

కోలాచలం శ్రీనివాసరావు.

# సత్యహరిశ్చంద్రీయము.



ఇది

బళ్ళారిజిల్లా బళ్ళారి డిస్ట్రిక్టు మునసఫ్కోర్టు వకీలుగానుండిన

కే. కే. కోలాచలం శ్రీనివాసరావుచే

రచియింపఁబడినది.



వారి జ్యేష్ఠపుత్రుఁడగు కె. శత్రుఘ్నరావుచే

ప్రకటింపఁబడియె.

రెండవ కూర్పు.

చెన్నపురి:

టి. వి. చెల్లప్పశాస్త్రి ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.



1920.



వెల రు. 1—4—0.    తపాలాఖర్చు రు. 0—1—0.

# ఉపోద్ఘాతము.



నే నింతకుమున్ను వ్రాసి ముద్రింపించి ప్రచురించిన నాటకములలో "సునందని" స్వకపోలకల్పితముగను "సుఖమంజరి" చరిత్రాంశముగను, "మదాలస. సీమంతిని" పౌరాణిక కథలుగ నున్నవి. కేవల పౌరాణిక కథలు నాటకములుగఁ బన్నుటయందు గ్రంథకర్తకు నిరివృత్తకల్పనా కష్టంబేమియు నుండదనియును, జనసామాన్యమునకుఁ జరిత్రాంశములు బాగుగఁ దెలియవు గావున, నవి నాటకంబులుగ వ్రాయుటచే నిరివృత్తకల్పనా చమత్కృతి నగపఱచుటయగాక, జనులకుఁ జరిత్రాంశములు బోధింపనగునని యెంచి, తురుష్కులలో గొప్పరాణియని ప్రసిద్ధికెక్కి, "అహమ్మనగరు" రాజ్యము నేలిన "సుల్తానా ఛాందు బీబీ" యనునామె చరిత్రంబు నాటకరూపంబున వ్రాసితి. ఈపురినుండు "సుమనోరమ" సభవారు దానినిఁ జక్కఁగఁ బ్రదర్శించిరి. మరల "విజయనగరనాశనము" అని పేరిడి తాళికోట యుద్ధమున్ను, బాక్థియగ్రీలు సింధునదిదాటి, మనదేశము ప్రవేశించి, యప్పటికి గొప్పపట్టణమని పేరందిన బలహరి నగరమును బాదానరించిన విషయమును దెలుపు "శిలాదిత్య" నాటకమున్ను, తాళికోట యుద్ధమయిన పిదప మైసూరురాజ్యమరాజకమై క్షీణించుతఱిని మరల దానినుద్ధరించిన "కృష్ణరాయ యొడెయరు" చరిత్రమును దెలుపు "మైసూరు రాజ్యాభివృద్ధి" యను నాటకమున్ను, వ్రాసితి. నామిత్రులు కొందఱు ననుఁ జేరి పురాణసంబంధములైన కథలు మఱికొన్ని వ్రాయుమని నన్నడిగిరి. నామానసంబున కది యిష్టంబుగాకయున్నను మిత్రుల మనోభీష్టంబు వ్యర్థపరచుట యుక్తముగాదని యెంచి-భారతములోని ముఖ్యాంశములన్నియు వెల్లడియగురీతి "శిరోమణి నాటక" మని పేరిడి యశ్వత్థామ శిరోరత్నమును దీయునంతవఱకు నొకనాటకంబు వ్రాసితి. అందున భగవద్గీతాంశములు విశేషభాగము చేర్చితిని. మరల "రుక్మాంగద" చరిత్ర, నాటకంబుగ వ్రాసియుంచితిని. పైనుదహరింపఁబడిన పదినాటకములలో నాలునాటకములు

'సుమనోరమసభవారు ప్రదర్శింపఁగ నేఁజూచితిని. సామాన్య నాటక
సంఘమువారికి నాటకములఁ ప్రదర్శింపఁ గష్టమని నేననుభవ పూర్వక
ముగఁగని సంతసించితి. పదునాల్గవ శతాబ్దమునుండి మన దేశములో
నాటకములు క్షీణించుట కనేక కారణంబులుగలిగెను. ఆకారణంబులన్ని
యు నాచే నాంగ్లేయభాషలో వ్రాయుంబడిన "*Dramatical History of the world*" అను పొత్తములోఁ దెలుపఁబడినవి. విద్యాభివృ
ద్ధిని రాజిలిన యిక్కాలమున నట్టి కారణంబులు మరలఁగలుగునని నే
నూహించియుండలేదు. ప్రస్తుతఁపుస్థితినిఁబట్టిచూచిన నాటకములకు మరల
నాశనస్థితి స్వల్పకాలములోనే కలుగునని భీతియయ్యెడు. "సుమనో
రమ" సభవారు హరిశ్చంద్ర నాటకంబొనర్పుమని నన్నడిగిరి. ప్రసిద్ధు
లగు ననేకకవులొనరించిన నాటకమునే, నేనొనరింపనేలయని నేబదులిడఁ
దమపురి నాటకంబొకటి, కావలెనని యుత్తరంబిచ్చిరి. కానిమ్మని సమ్మ
తించి, నవీన పథంబొకటి కల్పింప యత్నించితినికాని, యది యసాధ్య
మయ్యెను. కావున నున్నది యించుమించుగ నున్నరీతిని వ్రాయవలసి
వచ్చెను. ఇంద్రసభలో సత్యమును ఘటించిన వాదకారణంబు బ్రహ్మశ్రీ
వీరేశలింగం పంతులవారు తమనాటకములో నూతనముగఁ గల్పించి
నారు. ఆకారణంబు చక్కఁగనుండెను కావున దానినే, నేననుసరించితి.
చంద్రమతినిఁ జంపుటకు రాజాజ్ఞ యయినదని యా సతీమణిని, వీర
దాసుని యెదుట నిడినపుడు వీరదాసుఁడాసతి తనభార్యయని తెలిసి,
వ్యసనంబును సూచింపక విధినిమాత్రము దూరుచు, శిరంబుఁదెగవేయ
నుద్యుక్తుఁడు గావలెనని, నామిత్రులొకరు వక్కాణించిరి. ఎంతటి
కఠిన మనజునకైన నది సహజంబు కాదనితోని వ్యసనసూచక వాచక
ములచటఁ జేర్చితి.

2. ఇందు నక్షత్రకాలకౌశికులభాష కొన్నిస్థలములలో.
హాస్యరసాస్పదంబుగ భాషింపఁబడెను. అది హరిశ్చంద్ర చంద్రమతుల
కష్టములు హెచ్చించుటకును, వారి మానసవృత్తిఁ గలఁచుటకును నుప
యుక్తముగ నుండవలెను. ఇది విషాదాస్పద నాటకంబు గావున సాధ్య

హైనవలకు హాస్యరసంబు హెచ్చింపక యుండుటమేలని తెలియవలెను గాంభీర్యము వహించి వాక్యము లుచ్చరించినచో నవి హాస్యవాక్యములుగ నుండవు. ఈ పాత్రాధికారులు జ్ఞానవంతులై యుండవలెను.

3. ఇందు హరిశ్చంద్రుని సత్యవాక్య పరిపాలనకుఁ చంద్రమతి ప్రాముఖ్యురాలని యగపఱచ యత్నించినాడను. ఈనాటకంబునవచ్చు ముఖ్యపాత్రల పూర్వజన్మ వృత్తాంతంబు నేనుత్తర హరిశ్చంద్రచరిత్ర నుండి గ్రహించితిని, చంద్రమతి దాస్యమునకుఁ గారణంబు బ్రః విరేశలింగం పంతులవారు దుర్వాస శాపమని కల్పించిరి. ఆ కల్పనయుఁ జక్కగనున్నది.

4. నాటకసాంఘికు లక్షరాస్యులుగను సంస్కారవాసులుగను-నుచ్చారణశుద్ధిగలవారుగ నుండినచో నేనాటకంబయినను బాగుగనుండును. అటులేక, చిలుకపలుకులవలె పలుకులునేర్చి-యపశబ్దంబులుచ్చరించుచు, గాలిని నఱకువారిబలెఁ జేతులెత్తిడించి-దేహము పలుమారు కదలించి, రంగస్థానమంతయు దిరుగుచు, నటించినచో, నట్టి నటన, జనసామాన్యము మెచ్చునుగాని విద్యావంతులు మెచ్చరు. నేత్రభావము చేతను, ముఖభావముతోను, నించుక దేహచలనంబుతోడను, శబ్దోచ్చారణ సరణిని, జనులు మెచ్చులాగొనటించువాఁడు నటనాసమర్థుఁడు. ఆంగ్లేయ నాటకములలో వేషములు బుచ్చుకొనువారనేకులు, తమ వేషమునుగుణించిన నటనలోఁ బ్రాముఖ్యతఁగలుగఁ జేసికొనుటకు ననేకసంవత్సరంబులు నటన నభ్యసించుచుందురు. అట్టి నటనాసమర్థులు మన యాంధ్రదేశములో నెవరో యొకరిరువురున్నవారు. అట్టి యొకరిరువురునై తమ నటనను జక్కఁగ నభ్యసించి వృద్ధికిఁదేకయున్నవారు. జనులించుక మెచ్చిన గుణమునన గర్వించి-నటనలోఁ దామేభరతాచార్యులమని యెన్నికొని యున్నది కొంచెము పోగొట్టుకొనుచున్నారు. నటనాసామర్థ్యంబు లభించుట కష్టతమము. వన్నెఁబూసికొని రంగస్థానమున నిలిచినమాత్రనే-నేర్చినమాటలువచ్చును-దైవమిచ్చిన కంఠముత్తి పాడుటవచ్చునుగాని నటనరాదు భావనేర్చి, దానిరసము గ్రహించి, తనవేష గౌరవమును మఱవక-తన్ను తానుమఱచి-తనది వేషముకాదు

తాను నిజముగ నావేషమును ధరించిన యామనుజుఁడని నమ్మి నటించినవాఁడే నాటకపాత్రకు యోగ్యుఁడు. ఈ విషయమింకెంత వ్రాసినను చాలదు. కావున యింతటితో ముగించెద.

5. నాటకము వ్రాయుటలోనే నింతకుమున్నే చదివిన హరిశ్చంద్ర చరిత్రలన్నియు నాకుసాహాయ్యపడెను మార్కండేయ పురాణము, ననుసరించి వ్రాయఁబడిన చండకౌశికనాటక మిప్పటికాలమువారికి రుచింపదు. అందున ద్వితీయాజ్కముఁ జక్కఁగఁబ్రదర్శించుట కష్టము. స్కాంధపురాణాంతర్గత హరిశ్చంద్రచరిత్ర, ప్రయోగార్హమైనది. కావున నా దానినందఱనుసరించిరి. షట్చక్రవర్తుల చరిత్రను వ్రాసిన మల్లారెడ్డిగారి హరిశ్చంద్రచరిత్ర నతిసూక్ష్మముగఁ దెల్పినారు. అడిదముసూరన్నగారు రచించిన కవి జనరంజనములోఁ జంద్రమతి పరిణయము మాత్రము వ్రాయఁబడినది. కంచికావ్యమను హరిశ్చంద్రచరిత్రఁ నల్లారికావ్యమని ప్రసిద్ధికెక్కిన శంకరకవిగారి హరిశ్చంద్రోపాఖ్యానమువలె ప్రౌఢముగ లేదని విన్నాను. ముసటి గ్రంథములోఁ గొంతభాగము మాత్రము చెన్నపురిలోనే చదివినాను, గౌరనమంత్రిచే వ్రాయఁబడిన ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానము ప్రౌఢముగ నున్నది. అందున వసిష్ఠ విశ్వామిత్రులు పక్షులై పోరిరని యంత్యభాగములో వ్రాయఁబడినది. అది నాటకమునందుఁ బ్రయోగార్హముగ లేదు. పూర్వకవులిరువురి హరిశ్చంద్రోపాఖ్యానము యక్షగాన నాటకములుగ వ్రాసినారు. వారు వ్రాసిన ఫక్కియిప్పటి నాటక సాంఘికులకు రుచింపదు. ఇటీవల నా మిత్రులగు నయ్యనకోట పార్థసారథి శ్రేష్ఠిగారు శుద్ధాంధ్ర నిర్వచన హరిశ్చంద్రోపాఖ్యాన మతిపౌఢముగ శంకరకవిపద్యముల ననుసరించి వ్రాసిరి. హరిశ్చంద్ర నలోపాఖ్యానము శ్లేషకావ్యముగ రామరాజభూషణునిచే రచింపఁబడినది. ఈరీతి ననేకు లనేక విధంబులుగ రచించిన చరిత్రను మరల వ్రాయఁబూనుట చర్వితచర్వణమని యుంటిని. నామిత్రులకోరిక బలమాయెనుకావున నాకుఁదోచినరీతిని నేనువ్రాసితిని. క్షమింతురని వేఁడితిని.

కోలాచలం శ్రీనివాసరావు.

ఎవ్వానివదన రాజీవరంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టువలు నలుపుచుండునో! ఎవ్వాఁడు కువ్యాఖ్యావిషమూర్ఛితయగు కాళిదాస కవితాసుకన్యకను దనదు సంజీవినిచేఁ దెప్పిఱిల్లఁజేసి, వెజ్జలమిన్నయని వన్నెకెక్కెనో! ఏమహామహుని దివ్యనామామృతమును వీనులారఁ గ్రోలని యక్షరాస్యుఁడొక్కఁడైన నీభువిని గానంబడఁడో! ఏమహితచారిత్రుని యశఃకుసుమంబుల ధరియించి దివాకర నిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో!

ఏవిద్వదవతంసుఁడు అనన్య జనసామాన్యమగు మహామహోపాధ్యాయ బిరుదమునకు మార్గదర్శియయ్యెనో! అట్టిచుళుకీకృత సకల శాస్త్రజలధియగు కోలచల శ్రీమల్లినాథసూరి వంశమున మనశ్రీనివాస కవిముక్తామణి విరూపాక్షక్షేత్రమునకు సమీపముననుండు కామాలాపురమను గ్రామమునఁ గ్రీస్తుశకం 1854-3-13 తేదీలకు సరియగు ప్రమాదీచ సంవత్సర ఫాల్గుణాసిత చతుర్దశినాఁడుద్భవించె. ఇతఁడు బాల్యముననే సంస్కృతభాషను జక్కఁగ నభ్యసించి, పిదప నాంగ్లేయ భాషయందసమానమైన దుష్యమును గడించి, కొంతకాలము రాజకీయోద్యోగిఁగనుండి, తర్వాత న్యాయవాదిపరీక్షలయందుత్తీర్ణుఁడై, బలారి పురవరమున న్యాయవాదిగ వఱలుచుండె. ఇతనికి నొకకూఁతురును, నలుగురు కుమారులును, గలరు. మఱియు నితఁడు 1917-వ సం॥ ఏప్రేల్ 7-వ తేది దేవాళీపురమున జరిగిన విద్వత్సభయని ప్రసిద్ధిఁగాంచిన యాంధ్రసాహిత్యపరిషత్సభకగ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్లుండ నేతత్కవిచంద్రుఁడు రాజవ్రణపీడితుఁడై యాంధ్రకువలయంబు వసివాడఁగు కవిచక్రంబు లుల్లసిల్ల 1919-వ స॥ జూన్ 28-వ తేది యస్తమించె.

ఇట్లువిన్నవించు సుధీజనవిధేయుఁడు,
☛ రావాడి వెంకటరామశాస్త్రి,
తెలుఁగు పండితుఁడు,
మునిసిపల్ హైస్కూలు, బళ్ళారి.

# ముఖ్యపాత్రలు.



## పురుషులు.

ఇంద్రుఁడు.
బృహస్పత్యాచార్లు.
వసిష్ఠుఁడు.
విశ్వామిత్రుఁడు.
కశ్యపుఁడు.
అత్రి.
భరద్వాజుఁడు.
గౌతముఁడు.
భృగు.
పర్వతుఁడు.
నారదుఁడు.
పారాశరుఁడు.
అగస్త్యుఁడు.
గాలవుఁడు.
నక్షత్రకుఁడు.
హరిశ్చంద్రుఁడు.

సత్యకీర్తి.
లోహితాస్యుఁడు,
బేతాళులు.
కాలకౌశికుఁడు.
వీరబాహుఁడు.
కోదండరాముఁడు.
రాఘు.
భీషణుఁడు.
విభీషణుఁడు.
భీకరుఁడు.
సోమశేఖరుఁడు.
ప్రతాపచంద్రదేవుఁడు.
వీరదాసుఁడు, (హరిశ్చంద్రుఁడు.)
ఈశ్వరుఁడు.
పౌరులు, భటులు, మొదలైనవారు.

## స్త్రీలు.

చంద్రమతి.
మతంగకన్యకలు.
కలహకంఠి.
హంసనారి, (చంద్రమతి.)



# సత్యహరిశ్చంద్రీయము.



## నాంది.



### సూత్రధారుఁడు.

శా॥ శ్రీలక్ష్మీకమలాక్షి పేరెదను రాజిల్లన్, మహాభోగి శ
య్యాలోలుండయి, సర్వలోకము లనాయాసంబుగా, బొజ్జలోఁ
గ్రాలన్ గాఁచుదు సత్యలాలనరతిన్ రాణించు శ్రీదేవకీ
శాలుం డిచ్చుత మాకు నెల్లెడ యశోభాగ్యాయురారోగ్యముల్॥

అనుబంధము 1.

## ప్రథమాఙ్కము.—ప్రథమరంగము.



### ఇంద్రసభ.

ఇంద్రుఁడు, బృహస్పత్యాచార్లు, వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు, కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, గౌతముఁడు, భృగు, పర్వతుఁడు, నారదుఁడు, పారాశరుఁడు, అగస్త్యుఁడు, గాలవుఁడు.

ఇంద్రుఁడు.—

అనుబంధము 2.

ముని సార్వభౌములారా! నిన్నటిదినంబున శుక్రనీతి వింటిరి. ఈదినంబున వాగ్పతిసమానులగు వాచస్పతులనీతి వింటిరి

గదా? ఇందున భూలోక జనులకు నెద్ది సమంజసమో యేదియాచరణీయమో యేది పుణ్యప్రదమో యది మనమాలోచించి సిద్ధాంతీకరింపవలెను గావున మీమీ తాత్పర్యంబులు నిష్పక్షపాతబుద్ధిని వెలివేయుదురని వేఁడెదను.

నారదుఁడు.—(లేచి ముందరికిఁ బోయి) స్వగ॥ కలహము బెట్టను సమయము దొరకెను. తటిదప్పినఁ దగవుదప్పును (వాచకునిఁ జూచి) గాలవా! సత్యనిధి నిర్ణయములో శుక్రాచార్యులేమి పలికిరి? మరలఁ జదువుము.

గాలవుఁడు.—(చదివెదను.)

కం॥ వనితలయెడఁ బరిణయమెడ
ధనమాన ప్రాణహాని దశలను గోబ్రా
హ్మణ రక్షణయెడ ననృతం
బనఘుం డగు సూక్ష్మమార్గ మరయఁగ జగతిన్.

నారదుఁడు.—(గాలవునిఁ జూచి) ఈవిషయంబున బృహస్పత్యాచార్యులేమి పలికిరి? ఆభాగము చదువుము.

గాలవుఁడు.—(చదివెదను.)

కం॥ వీడును విడిముడిఁ బోయిన,
బోడిమి రాజ్యంబుఁ బుడమిఁ బోయినఁ, బ్రాణం
బూడినఁ, బతిసుతులు దనున్
వీడినఁ, సత్యంబు విడఁడు వీరుఁడు జగతిన్॥

నారదుఁడు.—అమరేంద్రా! శుక్రాచార్యులవారిది కేవల ఐహికనీతి, మన యాచార్యులవారిది కేవల పారలౌకికనీతి. సాంసారికప్రపంచంబుననుండువా రాచరింప నలవికానిదీ వాచస్పత్యనీతి యని నాకుఁ దోఁచెడు.

ఇంద్రుఁడు.—(దలయూఁచి, సభాసదులంజూచి.)

ఉ॥ నీరజసంభవాన్వయ మునీశ గణార్చిత పాదసారసో
దారగుణాఢ్యులార! సవతామరసోద్భవులార! యాత్మవి
ద్యారతి నూతనత్రిపురదాహకులార! ధరాధిపాళిలో
భూరిగసత్యవాక్యపరిభూషితుఁ డుండు నె? యున్నఁ బల్కుఁడీ॥

(ఋషులందఱు మిన్నకయుందురు.)

నారదుఁడు.—(వసిష్ఠునింజూచి) ఋషికులోత్తమా! అందఱింబలె నీవును గ్రిందుమీఁదుగఁ జూచుచు నీళ్లునములుచుండిన గతియేమి?

విశ్వామిత్రుఁడు.—అమరవల్లభా! మీ యాచార్యులనీతివిధి నాచరింప నసాధ్యంబైనదని స్వానుభవముపైన మీ రెఱుంగుదురుగదా? ఇఁక మీబోటివారికే యసాధ్యంబగు నెడ భూలోకాధిపతులకు నదిసాధ్యమగునే?

ఉ॥ పువ్వులు గంధవస్త్రములు భూషలసొంపుగు భక్ష్యలంబులున్
నువ్వుఁపు వీడులున్ మృదులమానితశయ్యలు మృష్టమాంసముల్
జవ్వనులున్ నవీనఘృత సారసుశోభ భక్ష్యభోజ్యముల్
నివ్వటిలంగ నిక్కు నవనీపతు లాడుదు రెట్టి సత్యముల్!

నిర్జరవరా! పరుల సిరులు చూఱఁగొని యింద్రియ సుఖోత్సుకమైన తలంపు పెంపున మధురాధరల యధరరక్తి మసుధారసము గ్రోలుచు మధురసూక్తులు వినుచు మధురధర్మాధీన పరతంత్రమానసులయి, క్రియాహీనులగుచు వృథాభిమానంబున నిక్కినీల్గి విఱ్ఱవీఁగు ధరాపతులు సత్యవచన ధురంధరులగుట నీట నగ్గిపుట్టుటకాదా? అట్టి యప్రతిమసత్య విశుద్ధప్రభావనిధులు, అట్టి సత్యస్తుత్యవిశేష పరిమక్తులు ప్రపంచంబునఁ గలరాయని గగనప్రయత్నం బొనరించి బ్రహ్మలోకపర్యంత మాలోచించినను నట్టివారుంట గగనారవిందమని నాకుఁదోఁచెడు.

నారదుఁడు.—(వసిష్ఠునిఁజూచి) మునికులోత్తమా! అంకిల్లుపట్టిగొనిపో యినవారిబలె మౌనమువహించి కూర్చుంటి వేల? విశ్వామిత్రుల వారిమాటలు వింటిరికదా? వారిమాటలు మీకంగీకారమేనా? ప్రపంచంబున మీశిష్యులలో నొకఁడును సత్యవచనంబు లాడువాఁడు లేఁడా?

వసిష్ఠుఁడు.—(నారదునిఁజూచి) నారదా! ఒకరు మాటలాడునపుడు మఱియొకరు మాటలాడుట ధర్మమార్గము కాదని యూఱకయుంటిని. (ఇంద్రునిఁజూచి) అమరేశా!

మ॥ రవివంశోదధి కౌస్తుభాభరణమై రాజిల్లి సర్వంసహా
ధవుఁడై నీతిపరాక్రమోర్జిత మహాధైర్య ప్రచారుండునై
దివిజానీకనుతిప్రశస్తగుణుఁడై దీపించి సత్యంబె యు
త్సవలీలన్ గను నిత్యకీర్తిగ హరిశ్చంద్రుండు భూమండలిన్॥

పాకశాసనా! ఆసార్వభౌముని సుగుణసమృద్ధి యింతయని లెక్కింపఁ బంకజాసన మురశాసన త్రిపురశాసనుల వశముగాదు. భూరి వివేకతావిభూతిసమేతుఁడు. నిఖిలభూతదయానిరతుఁడు. పరవనితా సోదరుఁడు. సూనృతవచనంబనెడి యుగ్గుతోఁ బెఱిఁగిన ఘనుఁడు. కావుననే సత్యవచోభూషణుఁడు. సత్యహరిశ్చంద్రుఁడు. కల్లయను మాట కలనైన వినియెఱుంగఁడు.

విశ్వామిత్ర.—ఏమీ! వసిష్ఠా! రాజులు సత్యమాడుదురన్న పిచ్చివారైనను నవ్వరా?

చం॥ కువలయపాలనాపరతఁ గోరరుసద్గురుబోధఁ, దమ్ములన్
దవిలి పనాటలన్ బొదవితాఁకియడంతురు, చక్రసౌఖ్య గౌ
రవముదలంప రాఖలుల రాజుల దుష్మమదాంధులన్ గటా!
నవనవమైనర్పఁగానగునె నవ్వులకాటుగ బుద్ధిజాడ్యతన్॥

వసిష్ఠా! ఆ హరిశ్చంద్రుని యింటి పౌరోహిత్యదాక్షిణ్య పక్షపాతంబున నీవిటుల మాటలాడనగునా? రాజ్యవైభవ మదాంధతకుఁ జేరి

క॥ మధుపానజనితవికారపారవశ్యలాలసగాత్రులై దంభలోభాభిమానమత్తులై విత్తవయోరూపబలైశ్వర్యగర్వులై జడతానిష్ఠులై దుర్మానగరిష్ఠులై దుర్దైవమన్యుభూయిష్ఠులై గర్వశేష్ఠులై వ్యామోహమునకుదక్కి విషయాసక్తిఁజిక్కి తమ్ముదామెఱుఁగక విరక్తిమార్గంబు దెలియక నిక్కురాజుల దేయూరు? సత్యమేయూరు? జనశూన్యంబైన కాననంబులు జేరి యేకాంతస్థానంబున నేకాంగులమై యాకలములు దిని యేకళంకము లేని మముబోలు మునులకే సూనృతవాక్శుద్ధి కలుగదనినఁ బయోఘృతదధిగ్రాసంబుల మత్తిక్కి భోగివై యుద్యోగివై మత్సరాధీనమలిన మానసముగల మానవపశువా కల్లలాడవెఱచును? శశమునకు విషాణముకలిగెనన్న జనులునవ్వరా? ఆహరిశ్చంద్రుని జననపూర్వోత్తరంబులు నేనెఱుఁగనా? ఇచ్చటి సభాసదులెఱుఁగరా? వారు మౌనమువహించి కూర్చుండియుండ నందఱికంటెను హెచ్చు ప్రపంచజ్ఞానంబుఁ గలవానివలె నిక్కు మాటలాడితివే? నీయహంభావమెంత?

సీ॥ కాశ్యపి చెలిమి సారణి కశ్యపుఁడుండఁ
జిత్రనేత్రము దాల్చి యత్రియుండ
వాగ్విభవము భరద్వాజుఁడు విడియుండఁ
గౌతుకమతినుండ గౌతముండు
భృగురీతి నిలఁబడి భీతి భృగుండుండఁ
బర్వతాకృతి నుండఁబర్వతుండు
పరచింతనా మతిఁ బారాశరుండుండ
నారసై యిటులుండ నారదుండు.

గీ॥ వింధ్యగర్వ మడంచిన విక్రమాఢ్యుఁ
డీ యగస్త్యుఁడు మిన్నక యిచటనుండ
నూతన స్వర్గసృష్టిని ఖ్యాతిఁగన్న
నేనెదుట నుండ గర్వము నీకుఁదగునే?

ఓరీ! వసిష్ఠా! ఇందఱు మహాత్ములిటులుండ వారియెదుట నీదుర్గర్వము వెలివేసికొంటివి. హరిశ్చంద్రుని యింటి పురోహితుఁడనునది బట్టువలె వానినీ బొగడి సార్థకతఁ బఱచికొంటివి. నీ యాకాశపంచాంగము లిఁకఁ గట్టిపెట్టుము. నీకు దక్షిణలిచ్చువా రెవరును లేరు. హరిశ్చంద్రుని వంశశీలవృత్తంబులు నీకంటెను నాకు హెచ్చుగఁ దెలుసును.

అనుబంధము 3.

**ఇంద్రుఁడు.**—విశ్వామిత్రా! నేనడిగిన ప్రశ్నకు వసిష్ఠులు తమకుఁదోఁచినది చెప్పిరి. అందున దోషమేమున్నది?

**గౌతముఁడు.**—నిజము వారివారికిఁదోఁచిన యభిప్రాయము వారిత్తురు ఇందునఁదప్పేమి?

**విశ్వామిత్రు.**—(కనులెఱ్ఱఁజేసి) ఓరీ! నిర్జరవల్లభా! నన్నెదరింపఁబూనితివియా? భార్యయగు నహల్యతో నీవుజారత్వమొనరించినది కన్నులారఁజూచియు వేయిగన్నులిచ్చి లజ్జాహీనుఁడయి నీతో ముచ్చటింప వచ్చిన యీ గౌతముఁడను నేననుకొంటివియా? హెచ్చరిక. నేను రెండవ దుర్వాసుఁడను.

**నారదుఁడు.**—(ముందఱికివచ్చి) స్వ॥ అగ్గిగాలి కలిపితిని. ఇఁకమంట పుట్టును.

**వసిష్ఠుడు.**—(లేచి)

ఉ॥ వేదురుఁబోలె నోటికసి వీడఁగ వాగెదవేల? కౌశికా!
వాదిదిచాలు నీవడఁక వాసవుఁడేమి యెఱుంగఁడే? మహా
హ్లాదమునన్ శపింతువని మౌనముపూనిరి గాక సభ్యులన్
గాదన నీదురాలుకకు ఖండనశిక్ష విధింపకుందురే?

ఓరీ! విశ్వామిత్రా! నీనామము కౌశికుఁడుగదా. కావుననే దివాంధుఁడవు. తామసగుణానుచరుఁడవు. నీనోటినుండి యులలవలె పదము

లు వచ్చునుగాని యణువంతయైన గుణము లేదు. అల్పవిద్యచే నధిక గర్వివైతివి. అల్పజ్ఞాన మపాయమనునది మఱచితివి. "శాంతిహీన తపః ఫలంవృథా" యను పెద్దలవచనము సరకుసేయవు. వైరాగ్యము పూనితివిగాని వైరబుద్ధి వదలవు. వాతివాఁడితనంబున మించితివి. బద్ధస్పర్ధ దుర్వాక్య జాలములు తపఃఫలనిర్మూలంబులని తెలియవైతివి. గజస్నానము వంటిదికదా నీతపంబు? మతత్వమునకువచ్చినను శఠత్వము మానవు. దూషకుఁడు, క్రియాశూన్యుఁడు, నికృష్టుఁడు, దీర్ఘకోపనుఁడు కర్మచాండాలురని పెద్దలాడరా? మరలఁ జాండాలత్వ మేల కోరెదవు! నీకోపోన్నత బుద్ధిమాని రాగాది రహితచిత్తుఁడవై యార్జవాదిగుణ యుక్తుఁడవై మునిపూజ్యుఁడవై మనుము నీగర్వవాక్యము లిఁక జాలింపుము.

విశ్వామిత్రుఁడు.—(లేచి కోపమున) ఏమీ వసిష్ఠా! హితముపదేశించు వారివలె మాటలచే నన్నెత్తిపొడిచెదవా?

ఉ॥ సత్యవచో ధురీణుఁడని సాధుసమాగముబోల నీవు సా
హిత్యము సార్థకంబుగను హీనునిఁ బట్టగఁ జేసితయ్య యా
దిత్యవరేణ్యు ద్రోలఁ గడు తేఁకువ యేమయ్యె? నెగుసాహసం
బత్యధికంబు మానుమిఁక నాఅడిమాటలకాటు చేటగున్॥

ఓరీ! వసిష్ఠా! నీహితోపదేశంబు నీశిష్యులకు బోధింపుము. వలయునేని యీ యింద్రునకు బోధింపుము. వానిమష్టకుఁడయిన యీ గౌతమునకు బోధింపుము (గౌతముఁడు వెళ్ళిపోవును) నాకా బోధించునది? నేనవఁడని తలంచితివి? తపోమహిమచే బ్రహ్మర్షియని నీచేఁ బొగడికఁగన్న వాఁడనుగానా నేను? నిక్కమీల్గి నిన్ను నీటిచేఁ గట్టి తెప్పించిన తపోబల యుక్తుఁడనుగానా నేను? నీసుతులపాలిటి మృత్యువునై నీకంటినలుసై వర్తించినవాఁడను నేనుగానా? నీచే శప్తుఁడైన త్రిశంకునకు నూతనస్వర్గపదవి నిచ్చిన తపోధనసంపన్నుఁడను నేనుగానా? నీబలె నిమిశాపతప్తతఁగుండి వేశ్యావలోకన కామ

మోహిత భుజంగులిరువురికిఁ బుట్టినవాఁడ వనికొంటివా? (అగస్త్యుఁడు లేచిపోవును. నారదుఁడు "ఏమండీ ప్రయాణమైతిరి" యని వారిని హాస్యము చేయును) నీకుచరిత్ర యింత తెలిసిన నాయెదుటనా నీపౌరుషము? సామజమును దోమమూర్కొని నిలుచునా? అనలముపై నెగయనుంకించెదవా? "మహాగజాః పలాయంతే మశకానాంతు కాగతిః" యనినటుల మీయన్న యగస్త్యుఁడు బిడౌజుని యన్న గౌతముఁడు వీరే నాయెదుట నిలువఁజాలరన్న నీవా యెదురించువాఁడవు?

వసిష్ఠుఁడు.—(కృష్ణాజినము నేలఁగొట్టి లేచి) ఓరీ దుర్మదాంధా! కొన్ని దినంబులు నీవు నాశిష్యవర్గములోఁ జేరిన వాఁడవని దయఁబూని హితముపదేశింప నన్నుధిక్కరించి యెన్ని ప్రల్లదములు పలికితివి! నీ జన్మ మెట్టిదైనది నే నెఱుఁగనా? నీవు గోతస్కరుఁడవనునది నే మఱచితినా? ద్విజఘాతుకుఁడవు బాలహంతవు చాండాలుఁడవు శ్వమాంసభక్షకుఁడవనునది లోకవిఖ్యాతంబుగదా? నే నుడువనేల? నీకుఁ బెట్టువన్నెగాని పుట్టువన్నె లేదనునది యెవతెఱుంగనివార్త? "మానోహి మహతాం ధనం" యని పరుల జోలికి పోక మానమున మౌనమూనియుండు నాపైననా నీకింతటెకసి? "మూర్ఖేన కిం భాషణం" యని నేను మిన్నకయుంటిని, ఈకలహప్రియుఁడు నారదుఁడు మానిన వ్రణమును మరల రేఁచెను ఓరీ! దుర్మతీ! మొప్పెకు మూరెడు నోరున్నట్లు లెన్ని మాటలాడితివి? మదోపశమనదక్షమైన యోగవిద్య ఖలుఁడగు నీయందు మదము హెచ్చింపఁజేసెను. పంజరమునఁ గాకి నుంచినఁ బంచమస్వరము వచ్చునా? "పయసా సించితో నిత్యం ననింబో మధురాయతే" యనునది సార్థకంబయ్యె. నీవు మునిపిశాచమవుగావున పిశాచమునకుఁ బిశాచభాషణమున నుత్తరంబియ్య సమకట్టితి. నీతపంబు బూడిదెలో హోమము. నీలోని శారద మృద్భాండములోని దీపకళికవోలెఁ బ్రజ్వలింపదు. నీకులము గొలది

నీబుద్ధిముదిరినది. నీవుచదువునది నీతిశాస్త్రము, ఆచరించునది ఘాతకశాస్త్రము. నీవుముదిరిన మూఢుఁడవు కావున సంభాషణార్హుఁడవుకావు. కులము నాకుఁ దెలుపుననునది సిద్ధమయ్యె నీకువార్ధక్యమువచ్చినను నీక్రోధమునకు వార్ధక్యమురాదు. అది కుక్షికంటినది ఆఁబోతుఅంకెకుఁ గంఠీరవము బెదరునా? ఈ శుష్కవచనములతోఁ బ్రయోజనమేమి? ఈ యమరవల్లభుని సుధర్మాస్థానమున నేనాడినమాటకంటె హెచ్చుగమగిలనాడెద. యోగ్యతఁగల వాఁడవేని కార్యమూలమున నీవు దానిని భంగపఱచుము చూచెద. (ఇంద్రునిఁజూచి) అమరవల్లభా! నేఁబలికిన హరిశ్చంద్రుఁడను సార్వభౌముఁడు. భువనభవనావనప్రవీణుఁడు. భూతదయా సమేతుఁడు. స్థిరసూనృతోక్తిరచనానిర్నిద్రుఁడు. సత్యపాశాబంధనశుఁడు. సత్యవాచాన్విత సుకృతి. ఇది నిస్సందేహము.

చం॥ భువనధరంబు వీఁగినను, భూమిసమస్తము గ్రుంగసాగినన్,
దివియొకపెట్టుగా ధరకు దిగ్గన గ్రుగ్గిన, దిక్కరీంద్రముల్
సనచెడియాఁగినన్, శిఖియుఁజల్లఁగనైనను, సంభ్రమించినన్,
బలికిన ధార దప్పినను, భానుకులోద్భవుఁ డాడునే మృషల్?

విశ్వామిత్రుఁడు:— దేవేంద్రా! ఎన్నికారణంబులు తెలిపినను దాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్లని మూర్ఖతఁబూని యీ మునిసాధించుచున్నవాఁడు. రసార్జితపూజ్యములైన భోజ్యములు భుజించి రాజ్యమేలువారు రాగాంధులగుదురుగాని సత్యవాక్యప్రమాణ బద్ధులుకారని నేనెంతయొత్తి పలికినను మతిభ్రమచే దాని నితఁడు సరకుసేయఁడు. గురుపాతకములకు గురువులగు ధరావరు లనృత మాడరనునది యచ్చెరువని స్వానుభవమున నేఁబలికిన మాటలఁ దిరస్కరించి మరల నాహరిశ్చంద్రుఁడు సత్యమూర్తిఁగొనిన స్తుతియని పలుమాఱు నుచ్చరించుచున్నవాఁడు. ముంజేతి కంకణంబున కద్దమేల?. వసిష్ఠునిచేఁ బలుకంబడిన ధరావరునిచే బొంకులాడించెద,

శా॥ చిత్తాన్నత్యము ద్రోసి, పత్తెగల దుష్కృత్యంబులన్ జేర్చి, పెన్
విత్తంబెల్ల హరించి, రాజ్యగృహముల్ నీడంగఁబోకార్చి, యు
ద్వృత్తిన్ దారసుతాదులన్ విడిచి జాతిభ్రష్టునిన్ గొల్వ ను
న్మత్తున్ జేసి, యసత్యమున్ బలుక భూనాథున్ గలంతున్ ధరన్॥

ఇటు సేయకున్న యీ మునికులాధమునకు బుద్ధిరాదు, రాదు.

వసిష్ఠుఁడు.—ఓరీ! అవివేకా! గుడ్డిబెదరింపులకు బెదరువాఁడనా నేను! నిర్గుణుఁడవగు నీకా హరిశ్చంద్రుని గుణమేమి తెలియును? హరిశ్చంద్రు డితరరాజపిశాచములతోఁ బోల్పనగునా? ఉరగకంకణునితో నూరిజోగులు సరివత్తురా? హరిశ్చంద్రుని యశశ్శాలవ్రాసిన పవిత్రరాజులఫాలతలంబున నైనఁగలదా?

సీ॥ వికచోత్పల విలాస విభవంబు విడునే! మలినశైవల మిల్ల నలఁదికొనిన!
దానపావకు వేఁడి ధారణిఁ జెఱఁగునే! తెప్పరంబుగ నీఱుఁ గప్పికొనిన!
భూరిరత్నద్యుతి సాంద్రంబు తగ్గునే! ముఱికివస్త్రమునందు ముడిచికొనిన!
ప్రాభాకరోరు ప్రభావంబు మానునే నీహారవారంబు నిండికొనిన!

గీ॥ నిరత పరిమళ భరితమై నెగడు సాంబ
వంబు పేటికఁ జిఱమున్న వాసిచెడునె!
అనఘచరితల నెగడిన యునని నేత
తప్పు బలుకున యెంతటి ముప్పునైన!

ఓరీ మూఢా! ఆ హరిశ్చంద్రుం డొకవేళ దైవాధిష్ఠితకర్మయోగంబున దైన్యదశాపరిపాకతప్తచేతనుండయినను ఘనతరసంతాపశోకకర్శితుండయినను పుత్రమిత్రభార్యావియోగవిచారగ్రస్తుండైనను విధికృతంబు దుర్వారంబనియెంచి "యశోవామృత్యుర్వా" యని దృఢసంకల్పుఁడై సత్యవ్రతమాచరించునుగాని యనృత మెన్నటికి నాడఁడు. "నహ్యనృతాత్పాతకంపరం" యను వాక్యమా యవనీపతికి నిత్యపారాయణ వాక్యము. "నచలతిఖలువాక్యం సజ్జనానాం కదాచిత్" యనునది నీవు వినవా?

విశ్వామిత్రుఁడు.—ఓరీ వసిష్ఠా! వాక్కలహము శుష్కకలహము గా
వున నీవిషయంబునఁ బన్నిదము సల్పుదము. నేనెటులయిన
హరిశ్చంద్రుని బొంకించిన నీవేమి సేయుదువు?

వసిష్ఠుఁడు.—ఓరీ జారదరీ నా ప్రతిజ్ఞ వినుము. నీ వాహరిశ్చంద్రుని సత్య
వ్రత భంగంబొనర్చితివేని

శా॥ విప్రత్వంబును నీటఁబుచ్చి, తపముఁ జేపడి, సత్కర్మముల్
కప్రంబుల్ బలెఁగాల్చి, పన్నిదమునీవుఁ గాంచఁగాఁ దెంచి, నీ
చపాత్రిఖర్యము మీఱఁగా ఖరముపై జానొప్పఁగా నెక్కి, యా
మ్యప్రాంతంబుల సంచరింతును లాగుపాకారుఁడై నింద్యతన్॥

విశ్వామిత్రుఁడు.—వసిష్ఠా! ఆహరిశ్చంద్రునిచే నే నసృతంబు లాడిం
పఁజాలనేని,

చం॥ భువివిభుసత్యముఁ జెఱచి బూడిదెగల్పక తప్పితేని భూ
ధవునకు నస్మదీయ్య సుకృతంబున ...యిచ్చి పూజ్యుఁగా
నవనిపునిఁ జతుర్దశమహాయుగముల్ ... నేలఁజేయుదుఁ
జివఱకు భూరికాలము శచీపతి పీఠము ...ందు నిల్పుదున్॥

ఓరీ వసిష్ఠా! ఇట్టికఠినప్రతిజ్ఞ విశ్వామిత్రుఁడు బూనినాఁడు హెచ్చ
రిక నుండుమని నీశిష్యునకు బోధింపుము నేభీతిల్లను.

వసిష్ఠుఁడు.—ఓరీమూర్ఖా! సత్యమా హరిశ్చంద్రుని జన్మముతోఁ
బుట్టినది. నే నేర్పవలెనా? చాపకునీఁత నెవరు నేర్పుదురు? "మన
స్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనః" యనుకీతి నతఁడు త్రిక
రణశుద్ధిగ సత్యవ్రతము నాచరించువాఁడు. నీవు మూర్ఖుఁడవై విష
పరీక్ష చేయఁబూనితివి. నీపొంగంతయుఁ బోయిపాలగును. నీతపః
ఫలమాఱడిఁబోవును. హెచ్చరిక. సుకీర్తి నార్జింపకు. దుష్కీర్తి
సంయుతుఁడు మృతోపముఁడుగాఁడా? దుష్టసంగతి దురితహేతువు
కావున నీ సరసనుంటదోషము నేఁబోయెద.

(నిష్క్రమణము.)

విశ్వామిత్రుఁడు.—ఆ హరిశ్చంద్రునిచేఁ గల్లలాడించి యాగర్వశ్రేష్ఠుఁడగు వసిష్ఠుని మానభంగమొనర్చుటకు నాకునిద్రపట్టదు. అప్పుని కై నేమనుఁబోయెద.

(నిష్క్రమణము.)

ఇంద్రుఁడు.—నారదా! ఈ విశ్వామిత్రుని ధార్ష్ట్యము చూచితివియా?

నారదుఁడు.—దానినడుఁగనేల? కోపము రూపమూని విశ్వామిత్రుని యందు సగము దుర్వాసులందు సగమునిలిచెను. ఇవి రెండును రాద్రాకృతులేను.

బృహస్పతి.—ఈ విశ్వామిత్రుని మెడనుండునది రుద్రాక్షమాల మన మున నుండునది వహ్నికీల. మముఁబోలువారికి సైతము వానిఁ జూచిన భయమగును.

నారదుఁడు.—కావుననే మీరు మౌనమూని యుంటిరి. కాదేని మీ వార్తసైతము వెలివేయుచుండెను.

పారాశరుఁడు.—నారదా! "వృషభ కలహే వత్సపాద భంగః" యని నటు వీరిరువురి కలహమున హరిశ్చంద్రునకే యాపదకలుగునో కదా?

నారదుఁడు.—ఈమాట విశ్వామిత్రుల వారిచట నుండినప్పుడే మీరాన తిచ్చియుంటిరేని వారినోట మీజన్మము పావనమగుచుండెను.

భారద్వాజుఁడు.—నారదా! "సర్వాంగే దుర్జనేవిషం" యనినటుల విశ్వామిత్రుని యాపాదమస్తకము విషము. వీనినోటఁ బడుట కష్టమైనది.

నారదుఁడు.—మీరునించుక నోరెత్తవలసియుండెను. మీయొక్కను మీతండ్రి-కాదు-కాదు-మీపెత్తండ్రి బృహస్పత్యాచార్యులయొక్కను చరిత్రలు వెలిపడుచుండెను.

ఇంద్రుఁడు.—నారదా! ఋషుల మూలము గోప్యము; వెలివేయనేల?

నారదుఁడు.—అమరవల్లభా! వెలివేయ నెవరు కోరుదురు? మాబావ విశ్వామిత్రుఁడు శాంతివహించి మాటలు మ్రింగునాయని యంటిని.

కశ్యపుఁడు.—ఆ విశ్వామిత్రుని జోలిమన కేల? వాఁడు నందినిఁ బందిఁ జేయుచు పందిని నందిఁ జేయుచు. కుక్షిఁజిచ్చంటి కుక్కను భక్షింపఁ బోయిన దక్షుఁడతఁడు. దీర్ఘక్రోధి. నోరుమూసినఁ జెడతలవాఁగు చూపెను. వాఁగినవెల్ల పెడసరపు మాటలేను. "దర్దురాయత్రవక్తార స్తత్ర మౌనంహి భూషణం" యనియున్నది కావుననే నూరక యుంటిని. ఆమాటలేల యిపుడు? భూలోకంబున హరిశ్చంద్రుఁడశ్వమేధంబుఁ జేయుచున్నవాఁడు. అచటికిఁ బోయెదను.

నారదుఁడు.—ఏమండీ! దానప్రతిగ్రహశక్తులు రెండును మీకున్నవని మరల భూదానము వేఁడఁబోయెదరా యేమి?

కశ్యపుఁడు.—కాదు కాదు! ఊరక వీక్షించి వచ్చెదను.

ఇంద్రుఁడు.—మనమెల్లరముఁ బోయి చూడఁదగిన యుత్సవమిది పోదము రండు.

(నిష్క్రమము.)

---

## ద్వితీయరంగము.

భూలోకము, నక్షత్రకుఁడు, విశ్వామిత్రుఁడు.

నక్షత్రకుఁడు.—

### అనుబంధము 4.

చం॥ ఇట ననువచ్చియుండుమని యేగెను మద్గురు వెంతకాల మా
కటఁగడు కుందుచుం నిలుతుఁ గానని సీమను? వాజపేయ మా
చ్చటఁ బరిపూర్ణమానుగద! పాంతరంబగు భక్ష్యభోజనం
బెట్టు దొరకుం? విచారకరమియ్యది. మౌనివరుండు రాఁడయెం॥

ఆ....ఆ హరిశ్చంద్రుం డొనరించు యజ్ఞము నేటితో సమాప్తమగునుగదా? విశ్వామిత్రుఁడు దేవేంద్రపురికిఁ బోయి మాధ్యాహ్నికమ్మునకు నిచటికివచ్చెదను గాచియుండుము పిదప యజ్ఞమునకుఁ బోనగునని యానతిచ్చెను. మధ్యాహ్నసమయమైనను రాఁడాయెను. అచటనేమి తటస్థించెనో? వాక్కలహమునకు వసిష్ఠులడ్డపడిరో? మదనకలహమునకు మేనకయడ్డపడెనో? మఱియొక నూతనస్వర్గము కావలెనని మిన్నుమన్నుకుఁజెడి తలక్రిందుగ వ్రేలాడు త్రిశంకుఁడడ్డపడెనో? తెలియకయున్నది. అతఁడేమి మహానుభావుఁడు. ఊపిరి పట్టి యుదరము నించుకొనును. ముక్కుఁబట్టి ముక్తిసాధించును. నాకంతటి శక్తికలదా? భక్ష్యములు తిన్నఁగాని కుక్షినిండదు. హుక్కాకొట్టినఁగాని తెలివిరాదు. నస్యమేసినఁగాని నాగలోకమగపడదు. అయ్యో! రాజుచేయు నశ్వమేధయాగంబు ముగిసిపోవును గదా? కూడిన బ్రాహ్మణులందఱు మృష్టాన్నములఁ మెసవి పొట్టలు పెంచుకొని యుందురుగదా! నేనేమి సేయుదు? కడుపు పీకంటినది. ఈసమీపవనంబుఁజేరి యేదయిన ఫలాహారముఁజేసి వచ్చెద. (వెడలును.)

(ప్రవేశము. విశ్వామిత్రుఁడు)

విశ్వామిత్రుఁడు.—(నిట్టూర్పు విడుచుచు) హా! హా! దైవమా.

చం॥ అనయఁ త్రిశంకుభూపతికినై సురుపాత్తతపంబు వీఁగితిన్
సగము దొలంగె మేనకామణిసంగతి నీఁగితిఁ బుణ్యసాంతమయెన్
మఱి పురిఁ గుక్కపాలు మాసి భుజించి తపంబునీఁగితిన్
వ్రేల వసిష్ఠుమూలమున మా క్రియ పొల్పు మీఁగఁగా నయెన్॥

హా! హా! నేఁజేసినతపోఫల మీరీతి వ్యర్థపుచ్చుచుండిన నాగతియేమి? శతవత్సర తపఃఫలం బొకదినమున వ్యయపఱచుచున్నాఁడను. పాడుకోపము పిశాచమునలె నన్నుఁబట్టి పీడించుచున్నయది. అందున వసి

ష్టుఁడెడఁదనుపడెనో నాదేహమెల్ల భగ్గునమండుచున్నది. అకాలం బున యుక్తాయుక్తబుద్ధి నాకించుకైనను బొడమదు. అయ్యో? ఇపుడు నేనేమి సేయుదు?

ఉ॥ ఇంద్రునివద్ద శ్రీమిపనికేగి తా నేగినచో సభాసదుల్
సాంద్రవచోధురీణులను సత్యవిచారము చేసినారు ని
స్తంద్రగతిం జగ్గ్చేయు నెడఁ దాన వశిష్ఠుఁడు నిక్క మా హరి
శ్చంద్రుని నామమేలఁగొనె? నెంచక యేల యెదిర్చి పల్కితిన్?

అయ్యో! అయ్యో! ఆహరిశ్చంద్రుఁడు నావంశమువాఁడు గాఁడా? వానిని నేనెటు బాధింతును? బాధించితినిపో వాఁడనృతంబు లాడు నా? ఆడఁడేని నా పంతము చెడునుగదా? వసిష్ఠుఁడు నరల నిక్కు నుగదా? అయోమయములో బడితిని. ఏమి సేయుదు? (ఆలోచించును.) హరిశ్చంద్రుఁడు సత్యములాడిన నామాట నక్కును బాధించినపుడసత్య మాడెనేని వసిష్ఠునితోఁ నేనొనర్చిన పంతంబు గెలుచును. (ఆలోచించి) పంతము వదలను. అందున నాద్వేషి యయిన వసిష్ఠునకు నేనోడుట ప్రాణమువదలుట కదా "అపయశోయద్యస్తికిం మృత్యునా" యని యుండదా? అట్టి బ్రదుకు నేఁ గోరుదునా? నేనంతటి బలహీనుఁడునా?

ఉ॥ సప్తహయంబులన్నిలిపి సాధనశత్రుని నిక్కనెంతు. నే
సప్తమరుత్తులన్నిలిపి సాధవిపేయఁ జేతు విశ్వమున్.
సప్తశిఖాదులన్ గలఁచి శక్తిఁ బాపుదు నెల్ల లోకముల్.
సప్తసముద్రముల్ గలఁతు శంకరుమున్ముడియై జగత్త్రయిన్॥

ఇట్టినేను మానవునికై మానచ్యుతి నొందిమనఁగలనా? ఎట్లైనను వానిఁజేరి వానిసంపద హరించెద. ధనములేని యంతనేవాఁడు మని నప్రీతయగును. పిదపవానిపైనప్పుమోపెద. అప్పునిపై వానికి ముప్పుఁదెచ్చు. వేఁటయను వ్యసనంబు వానిమనంబునన్ దవిలించి ప్రత్యక్షరాక్షసులగు పణ్యస్త్రీలగుమాలల వలలోఁ గెడపి రాజ్యభ్ర

ష్టునిగావించి కన్నరారాములం బెట్టి రాచెద. నక్షత్రకుఁడేలొకో యింకను రాడాయెను. ద్రోవఁదప్పియుండునా? నక్షత్రకా (యని యఱచును.)

నక్షత్రకుని ప్రవేశము.

నక్షత్రకుఁడు.—స్వామీ. గురువులవారు నమస్కారము. ఆఁకటిచేఁ జచ్చుచున్నాను. మీకై కాచికాచి వచ్చితిని. స్వర్గమువఱకుఁ జూచితిని. పాతాళమువఱకు భేదించితిని. దేహమంతయు వాడెను. బొజ్జకఱగెను. కడుపుమండెను. జఠరాగ్ని హెచ్చెను. అయ్యో? హరిశ్చంద్రుని యశ్వమేధ యాగంబు నేటితో సమాప్తియయ్యెను. ఒకదినమైనను మృష్టాన్న భోజనంబొనర్చి చావఁజూచితిని దానికిఁ బ్రాప్తిలేదాయెను. సంతర్పణ భోజనంబిదివఱకే ముగిసియుండును. పొట్టకట్టి, గట్టిగ నుసురుఁబట్టి మీకై యెంత కాచియుంచినను రాకైతిరి. ఆఁకలి తట్టుకొనలేక యిప్పుడే యీవనము జొచ్చితిని. అపుడే మీరువచ్చి కేకవేసితిరి. చిక్కినఫలము మెక్కకవచ్చితిని ఏమి సేయుదు? స్వామీ! నేనట్లైనఁ జావనీ యడుగువారెవరు? దిక్కులేనిపీనుఁగను మీకుదక్కినాను. మీమొగమేల వాడినది? కనులేల యెఱ్ఱబాఱినవి? పెదవులేల తటతటతట క్రిందికిఁబైకి నాసికాపుటములతోఁగూడ నెగరుచున్నవి? కారణంబేమి?

విశ్వామి.—ఓరీనక్షత్రకా! నీవు భోజనప్రియుఁడవని తెలిసి యప్పుడే రానెంచితిని. నీదౌర్భాగ్యమునకుఁగాను నాకునువసిష్ఠునకు దేవేంద్రునియెదుటఁ గలహము పొసంగెను కావున యాలస్యమాయెను.

నక్షత్ర.—నేనపుడే యూహించితిని నాగ్రహాచారము మీరేమిసేయుదురు? మీరాచరించినది వాక్కలహమేగదా? అట్లైన మీరే గెలిచియుందురనుటకు సందియమేమి?

విశ్వా.—ఓరీ మూర్ఖా! ఓడు. గెలుపు లిపుడు తెలియవు. ఆ హరిశ్చంద్రుని మాట బొంకుపఱచితినేని నేను గెలుతును. అటుచేయఁ జాలనేని వసిష్ఠుఁడు గెలుచును.

నక్షత్ర.—ఓహో. మేషయుద్ధములో నక్కజిక్కినట్లు మీ కలహములో హరిశ్చంద్రుఁడు జిక్కెనా? అటులైన గ్రహచారము తక్కువయినవాఁడను నేనొక్కఁడే కాను. నాకు జతగ హరిశ్చంద్రుఁ డొకఁడున్నవాఁడు. కానిండు.

విశ్వామి.—నక్షత్రకా! నీవు నా యాశ్రమముఁ జేరి యచటయుండుము. సాయాహ్నికమున కచటికి వచ్చెద. పొమ్ము.

నక్షత్ర.—స్వామీ! హరిశ్చంద్రుని యజ్ఞభోజనము భుజ్జనవైన నాకుఁ బ్రాప్తిలేదా?

విశ్వా.—నక్షత్రా! నేఁజెప్పినట్లు నీవుపొమ్ము. అధికప్రసంగము చేయకు. తిండిపోతువై కండ పెంపకు. నీకిప్పుడే సంసారంబు కాలిపై దొర్లుచున్నది? నీకుఁ ధనమేల? పొమ్ము వెడలుము

నక్షత్ర.—చిత్తము. స్వామీ! పోయెదను. (నిష్క్రమము.)

విశ్వామి.—(స్వగతం) నేను హరిశ్చంద్రునిఁ జేరి యాగధనముఁ గోరి, దానిని వానిపై ఋణముగఁ బెట్టి కర్తవ్యంబు ముందాలోచించెద.

(నిష్క్రమము.)

---

## తృతీయరంగము.

### అనుబంధము 5.

హరిశ్చంద్రుని యాస్థానమండపము.

హరిశ్చంద్రుఁడు, సత్యకీర్తి, భటులు, విశ్వామిత్రుఁడు.

హరిశ్చంద్రుఁడు.—సత్యకీర్తీ! బ్రాహ్మణపూజకు భూరిదక్షిణలొసంగుట మాని యిచటికి వచ్చితివేల?

## అనుబంధము 6.

సత్యకీర్తి.—మహాప్రభూ! ఆ బాలవృద్ధులు ద్విజులు సర్వులు తమతమ యాశాపరిపూర్ణముగ దక్షిణలంది తమకీర్తి వర్ణించుచు నాశీర్వదించి వెడలిరి. నేఁడేమగు నెంతకాచినను రారైరి. కావున తమదర్శనార్థమై యిచటికి వచ్చితిని.

(భటుఁడొకఁడు ప్రవేశించి.)

భటుడు.—మహాప్రభూ! విశ్వామిత్రులవారు దూరంబున వచ్చుచున్నవారు.

హరిశ్చ.—ఏమీ! విశ్వామిత్రులవారు వచ్చుచున్నవారా? ఏమియచ్చెరు విది (సత్యకీర్తినిఁజూచి) సత్యకీర్తీ! వారిరాకకుఁ గతంబేమియుండును?

## అనుబంధము 7.

సత్యకీర్తి.—మహాప్రభూ! ఆ మహానుభావుల యాగమనకుఁ గారణంబు నాకును దోఁచదు. మిము ననుగ్రహించుటకు వారువచ్చినారనీ తలఁచినను నాకేమో భయమయ్యెడు. "అవ్యవస్థితచిత్తస్య ప్రసాదోపి భయంకరః" యని యున్నది కదా?

హరిశ్చం.—సత్యకీర్తీ! సత్యమేగతియని యున్న మనకు నెవరినుండియే భయముండదు. విశ్వామిత్ర మునిభూషణుఁడు మాకులమాత్రాభరణముగదా? వంశజుల శ్రేయస్సు నిరంతర మంతరంగంబునఁ గోరుచుండునుగాని దానికివిరుద్ధంబుఁ గోరునా? కోరినుపో "సత్యమేవజయతి" యను మము నేమిసేయఁగలఁడు? మాటలలోఁగాలంబు సరిపెట్టక వారినెదుర్కొని పిలిచికొని వత్తమురమ్ము. (విశ్వామిత్ర ప్రవేశము.)

(సాష్టాంగ వందనంబిడి.)

ఉ॥ భూతదయా సుశీలనుత! భూరితపోధన! దీనబాంధవా!
యాతతమై నుదీయకృతయజ్ఞ ఫలంబిపుడందనయ్యె మీ

పూతపదాంబుజాత పరిభూషిత మద్గృహమయ్యెఁ గావునన్
నీతివిశారదా! పరమునీ! యభివందన మాచరించెదన్.

(పునః ప్రణామంబు లాచరించును.)

విశ్వా.—శుభమస్తు. ఆయుష్మాన్భవ.

హరిశ్చం.—భక్తలోక చింతామణీ! భవదీయదర్శనలాభంబున నే ధన్యుఁడనైతిని. దేవా! తమరాకకుఁ గతంబు దాసునకానతిచ్చి మా నసామోదంబు గలిగింతురని దీనతవేఁడెద.

విశ్వామి.—హరిశ్చంద్రా! నీవినయవిధేయతకు మెచ్చితి. ధారుణీభార మోర్చు ధరావరుఁడీరీతినుండి పెద్దల దీవెనలందిగదా యభివృద్ధిఁ గాంచు. వితరణఖనీ! నారాకకుఁ గతంబుగోరితివి. దానివివరంబు వినుము. హరిశ్చంద్రా! నేనొకవిధమైన యాగంబు సేయ సమకట్టితిని. అదికష్టమైనను ద్రవ్యసాధ్యముగ నున్నయది. సర్వసంగపరి త్యాగులకు ద్రవ్యమెటువచ్చును? కావున మదీయేప్సితయాగోద్య మప్రథమసాధనమయిన ధనంబు వేఁడవచ్చితి. అదియింత యంత యని లెక్కిడ నలవికాదు.

చ॥ మదకరి నెక్కి మానవుఁడు మానుగఁ జత్త్రము పైకి బట్టఁగా
నదిగొ నెంతసేపు వ్రేఁజను ; నంతటితోయె త్తును నంతపొకడున్
గుదురుగ విత్తమిత్తునని కోరఁగవచ్చితి భూమినాథ నా!
మదికలదేని నా మఖసమాప్తికి ద్రవ్యమొసంగుమా నృపా.

హరిశ్చంద్రుఁడు.—స్వామీ! ఎంతటిచిత్రంబిది? ఈరాజ్యము తమసొమ్ము గాదా? ఈగృహము తమసొమ్ముకదా? ఈధనభాండాగారము తమ సొమ్ముగాదా? ఈశరీరము పుత్రకళత్రాదులతోఁ దమసొమ్ముగాదా? నన్నడుగనేల?

సీ॥ సకలసంపదవీడి సన్న్యాసమును వేఁడి యంతఃపురస్త్రీల నొల్లనగుచు
సతిసంగతినిమాని యతి నియతినిఁబూని యాత్మబోధంబూని యనఘులగుచు
భూభుజులై పుట్టి భూరితపముఁబట్టి భూసురులై సట్టి పుణ్యులగుచు
పతితత్రిశంకుని వితతాకళంకునిఁ గాఁజేయు నేమాని గణ్యులగుచు,

హరిశ్చ.---మంత్రివరా! కారణంబేమి?

సత్యకీర్తి.---మునివరుఁడు శ్రమపడి యిచటికివచ్చి ధనమువేఁడి మరల దానిని మీపై నప్పుగనుంచి పోవుట విస్మయావహముగ నున్నది.

హరిశ్చంద్రుఁడు.—సత్యకీర్తీ! అందులకు వారే సమాధానంబు పలికిరి గదా. ఈయాలోచనలు వలదు బ్రాహ్మణు లేరయినను వచ్చి దక్షిణకై కాచియుందురు. లెమ్ము పోవుదము. నిష్క్రమము.

## చతుర్థరంగము.



ఆశ్రమమార్గము---విశ్వామిత్రుఁడు.

విశ్వామిత్రుఁడు.---స్వగతము.

ఉ॥ నేఁగని యింతి [illegible] సుముసఁ గాఢ్యఫలంబు...ఋణంబుగాను భూ
తలవిభుపై ధనంబుని [illegible] ప్రేతిఁ...గా నాంతరం
బులఁ గపటోగ్ర జంతువుల [illegible] కేసి [illegible]
[illegible] భూవరు [illegible] చయ్య [illegible] గొందును [illegible]

(ఆలోచించి) ఇదియు సరియైనమార్గము కాదేని హరిశ్చంద్రుఁడు నాచేఁ జిక్కఁడు. కాననంబున నామాయచేఁగపట మృగంబు లనేకంబులఁగల్పించి దేశమును బాధింపఁ జేసెద. జనులమొఱవిని రాజు వేఁటకువచ్చును మృగయావ్యాజంబు గఱపఁ గుమారునిఁ బిలిచికొని వచ్చును. వానినెపఁబాయని మనంబునఁ జంద్రమతి వచ్చును ఎటులైన నాయాశ్రమ పరిసరప్రాంతంబునకు హరిశ్చంద్రుఁడిచ్చి మతంగకన్యకలను వానిపైఁబడఁ జేసి వారినెపంబున రాజ్యం బపహరించి ఋణవ్యాజమున దేశభ్రష్టునిగ నొనరించెద. అంతటితో వదలుదునా? వదలను. వదలను. అన్నపానమాడించువఱకు వదలను. నిజము. కుక్షిగత మక్షికన్యాయమున నుండులాగు నక్షత్ర

కుని వారిపైఁ దగుప్రకారనిగా నియమించి వారినిఁబిల్చి పిక్కఁజేసెద. నేఁజేసిన వదలను. ఆచాండాలుని వసిష్ఠునిమాట రోటు పఱచెద. ఖరముపై నెక్కించెద. భంగపఱచెద. అటులొనరించువఱకుఁ గంటి పై తెప్ప వేయను. వేయను. ఈనిర్ధారణము మకల్ప శూలివశము గాదు. తామరసమాలి వశముగాదు. ఆనీచుఁడు వసిష్ఠుఁడు నా మహిమ నెఱుంగక యంతటికిఁదిన ప్రతినయొనరించెను. నామహిమ సామాన్యమా?

సీ॥ అరివ్రాతతతికి నాఅనియొడచిచ్చు. ఏరరాజికి దయావేశముద్ర.
మునిజనవితతికి ఘనమైనకనుకట్టు. సచ్చరితాళికి రచ్చపట్టు.
ఘనవాదాంధాళికిఁ బగినసిద్ధాంజన మజ్జా మపకల భాంకుశంబు.
అవివేకతాశీర్ష్య పుణఁచెడిగళహస్త. పాషువారనిధి బడబాగ్నికోటి.

గీ॥ సాధుజనభూరిసంతాపసాంధ్రనిద్ర.
వాదుకెక్కిన నరికి నాలుమక్కు.
నిక్కమై వచ్చువారికి యుక్కుఁగోట.
నాచరిత్ర మెఱుంగఁడా నీచమాని.

చూపెదనాసాహసంబు. ఇపుడెపోయి క్రముక్కడిమృగముల సృజించి దిక్కులెల్ల వెక్కసముగ బాధించులాగొనరించెద. పోయెద.

(నిష్క్రమము.)

---

## పంచమరంగము.

మతంగకన్యలు, నక్షత్రకుఁడు.

అనుబంధము 8.

1. మతంగ. చెల్లెలా! నాయన్న చెప్పిన రాజవరుఁడు రాఁడాయెఁగదా? వచ్చునో? అటులనే తనదోవపట్టుకొని పురికివెళ్లునో?

2. మతంగ. నాయనన్నగారి పని రిత్తపోవునా? ఒక బంగారు జింకను నిర్మించి రాజు వేఁటాడునపుడు గంటికిఁబడి కన్నులిప్పుటలం బెట్టి యీవనంబునకు లాగికొనిరన్నని పంపినాడు. ఆ మేకమటుచేయు ననుటకు సందియము లేదు.

1. మతంగ. అట్లైన మనమిచటనే కాచియుందము.

(నక్షత్రకుని ప్రవేశము.)

నక్షత్రకుఁడు.—(మతంగ కన్యలంజూచి) మాలతొత్తులారా! ఆచార్య శీలుఁడగు బ్రాహ్మణుని ననుఁజూచి నమస్కరింపక యున్నవారు! మీకుఁగండ కావరము హెచ్చాయెఁ గాఁబోలు? మాగురువుల మన్ననకలదని మైమఱచి నటించుచున్నవారు.

1. మతంగ. స్వామీ! మీరువచ్చినది చూడలేదు.

నక్షత్ర.—మీకిపుడుగల సౌభాగ్యములో నాబోటివాఁడు మీకంటఁ బడునా? పడఁడు.

2. మతంగ. స్వామీ మా సౌభాగ్యము మీయాశీర్వాద ఫలముగదా?

నక్షత్ర.—నిజము. మిమ్మునాశీర్వదించుచు మీకుసౌభాగ్యము హెచ్చఁ జేసితిని. నేను దారిద్ర్యము దెచ్చికొంటిని.

1. మతంగ. స్వామీ! ద్విజులకు దారిద్ర్యమనఁగనేమి?

నక్షత్ర.—ఓహో! ఉపనయనమునాటి మాటయున్నది కావున భిక్ష మెత్తుకొని బ్రదుకవచ్చుననికదా నీతలంపు. ఔరా! తలపొగరు? నన్నా మీరు హాస్యముచేయునది?

2. మతంగ. స్వామీ! పరిహాసముగాదు. మీరు మంత్రసంపన్నులు గావున సదా శ్రీమంతులని మీకుఖ్యాతిగలదు.

నక్షత్ర.—నేను మంత్రశాస్త్రసంపన్నుఁడను. మీరు తంత్ర నాస్త్రసంపన్నులు. ఇరువురికిఁ గుదిరికకూడినది.

1. మతంగ. స్వామీ! మేము వెలివాడ చేడియలము. మీరు కులపాడి గలవారలు. మాకును మీకు దోమకు నేనుఁగకుఁగల యెడమ యున్నది. మనకుఁ గుదిరిక యెటుగూడును?

నక్షత్ర.—మదనుఁడను కుంటెనగాఁడు కుదిరిక కుదుర్చును.

2. మతంగ. స్వామీ తాము పెద్దలే! పెద్దమాటలాడుచున్నారు? మదన శాస్త్రవాదము తమకెందుకు? అందులలో మాతోనా యావాదము? ఆశాస్త్రములో మేము ప్రవీణలై బిరుదందినాము. మీకిఁకను "ఓనమా"లు రావు.

నక్షత్ర.—పాగురుపోతులారా! నేనిఁకను బ్రహ్మచారినని యెత్తిపొడుపు మాటలాడుచున్నవారా? బ్రహ్మచారినైన మాత్రమున నాకా శాస్త్రము రాఁగూడదా? అభ్యసింపఁగూడదా? చతుష్షష్టికళలు బ్రాహ్మణుఁడభ్యసింప వలెనని విధిలేదా. అందునఁ జోరశాస్త్రము రాదా? జారశాస్త్రము రాదా? యాచార్యుల వారినిఁ జేరి నేనన్నిశాస్త్రములు నభ్యసించినాను. మాగురువులు మేనకతో సంసారము చేయునపుడు చక్కఁగ వారిచర్యలు గమనించి మారశాస్త్రము నేర్చితిని. భుజంగతత్వము నాకిపుడు ఘంటాపథంబుగనున్నది.

అనుబంధము 9.

1. మతంగ. స్వామీ! తామింతటి పెద్దలని మాకుఁ దెలిసియుండలేదు. తాము మంచి యోగ్యులు. నీచజాతివారితో మీకేమిమాటలు? పొండు.

నక్షత్రకుఁడు.—నేనూరక వచ్చినదారిఁబట్టిగాని పోవుటకేనా మీరొంటరిగనుండు సమయముగాచి గురువుల నేదోయొకనెపముపైన మోసగించి మెల్లన పదములుంచుచు నిచటికివచ్చితిని? మిమ్ము వదలి పోవుదునా? మిమ్ముఁజూచినప్పటినుండి నాకెటులనో యున్నది.

2. మతంగ. మాయావిబాపనయ్యా? నీమంతీనప్పు సుద్దులుచాలునిక. ఊరక వెడలిపొమ్ము. హీనజాతి చానలము మేము. మాతోఁబొందు పాతక దేవతకుపిందు. నిన్ను పాపమునఁ ద్రోయుటకు మేమిష్ట పడము.

నక్షత్ర.—చానలారా! నేను బ్రాహ్మణుఁడనే! నాకా పాపభయము? త్రికాలములందు సంధ్యావందన మాచరించువారమే? పగలుచేసిన పాపము పగటి సంధ్యావందనంబుచేతను రాత్రి పాపము రాత్రి సంధ్యచేతను చించిచెండాడువారమే? పాతకము మమ్ముఁజూచిన తోడనే గడగడగడవడఁకుచు మూలమూలల దాఁగుచుండునుగదా? కావుననే బ్రాహ్మణులకు మేమెన్ని పాపములైన నిర్భీతిగఁజేయ నోపుదుము. మాకు రాజదండన లేదు.

1. మతంగ. స్వామీ! మీసామర్థ్యంబు దెలిసికొనునంతటి శక్తిమాకుఁ జాలదు. మేము వేఱుపనిపైన మనముదవిల్లియున్నాము. మీతో మాటలాడుచుండుటకు సమయము లేదు.

నక్షత్ర.—ఓహో! మీపని నాకేమి తెలియదనుకొంటిరా? మాగురువుల నారానతిచ్చినదెల్లఁ బొందిపింటిని. ఇదిగోచూడుఁడి నాయిష్టార్థము నెఱపితిరేని మీకుఁగార్య సిద్ధియగు. అటుచేయరేని మీకుఁ జక్కఁగ దేహశుద్ధియగు. ముఖప్రక్షాళనమగు. అర్ధచంద్రప్రయోగంబగు.

2. మతంగ. మాకేమయిననుగానీ మీకార్యము కాదుపొండి. స్వామీ ప్రణుక్కుదము పొండి.

అనుబంధము 10.

నక్షత్ర.—రాజదండన ప్రాప్తిరస్తు. (నిష్క్రమము.)

# ద్వితీయాంకము.



## ప్రథమరంగము.



### అరణ్యము.

{హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితాస్యుఁడు, సత్యకీర్తి, మతంగకన్యలు, విశ్వామిత్రుఁడు, నక్షత్రకుఁడు.}

అనుబంధములు 11-12.

**చంద్రమతి.**—ప్రాణనాథా! మెకంబు నెపంబున మైమఱచి మీ రెఱుంగక యెంతదవ్వు వచ్చితిమి. వసిష్ఠులవారి యాజ్ఞ మీఱితిమి.

అనుబంధము 13.

సీ॥ ఒకపరి బంగరుపసఁగాంచు చాఱల నెసఁగారు జింకకై యేల యలఁతి?
మాయావిఁబోలును మాయలఁబన్నుచు నాకుమాయ మమ్మిట్లు లటునటించె
మనసేమము మనకై మనగురువులవారు గఱపినయితముల గడచి మనము
మెకము నెపమ్మున మీ రెఱుంగక మితమీఱ వచ్చితిమయా మేనుబడలె.

గీ॥ గాధిపట్టి చక్రిఁగలనైనఁ జోరవని
పలికి ప్రోలికి రుగఁ దలఁచుమీకు
నెదురుపడఁగ నేల యిట్లేల మెకమయో?
కోరనేల ముద్దుకొడుకు దాని!

**హరిశ్చంద్రుఁడు.**—ఇంతీ! వేటకై కాంతారముఁ జేరినపుడు చిత్రవిచిత్రపు మృగములు కంటఁబడుట యేమియచ్చెరువు? అందునఁ గంటికింపైన మృగమునకై బట్టియిమ్మని రాచపట్టి వేఁడుట యేమియరుదు? దానికై యింతచింత యేల? ఇఁక నాదేహము బడలెనని చింతించెదవా? దానికేమి యిచట నించుక విశ్రమించుకొనిన నలసట పోవును.

వనబోణీ! ఇక్కాంతారంబున నాటిపెంచిన చెట్లజాలె వరుసదీర్చ డిన యీవనంబు మనంబునకు హర్షదమైయున్నది చూచితివియా?

చం॥ నవనవ యౌవనోన్నయ వనంబను భామినీ తీవమేనుఁ, గెం
జివురుల పాదముల్, సునుచుగుచ్ఛల కోమలహస్తముల్, శుభో
త్సవనగు కుందముట్మల విశాలవిచంబులు, పువ్వు పువ్వులన్,
సవరుగనంది సద్విటపసౌరభ సంగతిఁ జెందెఁ జూచితే?

సారసాక్షీ! ఈసరస కిసలయనవపువ్వు ఫలజాలములు మనోహరము లైన సాలములు గంటివియా? ఈ మత్తకోకిలకాకలీకలకుహూ కారకలకలములు వింటివియా? మానినీ! యీదిక్కునఁ జూడుమా యీమంజరీ మంజులమాధవీ మంటపముల శృంగారమ్ములు. ఈకు సుమసౌరభతుందిల మందానిలంబులు తిన్ననినడకలు మానసానంద మ్ములుగనున్నవి. రమణీ! పూర్వతాపములకుఁ దావులైన యీమావుల నీడలఁ గొంచుక విశ్రమించుకొన తలఁపుగలిగినది. దేహమెల్లఁ బడలి నది. నిద్రవచ్చుచున్నయది.

చంద్రమతి.—నాథా! తనశరీరమునకు బడలికదోఁచునపుడు మరల మార్గము నడవనేల? నాతోడఁ దలకడగ నిడుకొని బడలికఁదీర్చి కొనుడు. రండు.

(చంద్రమతి తొడపైఁ దలనిడి హరిశ్చంద్రుఁడు పండుకొనును.)

హరిశ్చంద్రుఁడు.—నాతీ! నాకునిద్రయంటుటకై నొకపాట పాడుము వినుచు నిదురఁ బోయెద.

చంద్రమతి.—ప్రాణప్రియా చిత్తము.

అనుబంధము 14.

చం॥ అలలనుబోలెఁ బుట్టి నశించు నదెపు మనుంగుకై పడన్
గలుములువచ్చుఁబోవు నటు నిల్చు నెందు శిరమ్మనిత్య చం
చలములు వీనిఁ నమ్మకు. నిజమ్మగుపి[?] గణింపుము నమ్మ మూ
ర్ఖులు కలలోనికల్ములను గోరుచు చేసెదు వాయు లోఁ ధరన్,

హా! హా!. నాప్రాణప్రియునకు నిదురపట్టినది నిశ్శబ్దముగ నుండిన నిదురచక్కఁగఁబట్టి యలసటఁదీరును. ఆపాడుజింకకై యెంతపరుగిడెను. ఎన్నిపొదలు దూరెను! ఎన్నికాలువ కోనలఁదిరిగెను! ఎన్ని మలలెక్కెను! ఆగాపసఁపు మెకము దొరకదాయెను. నాపతి యతిశ్రమపడెను. దేహమెల్లఁజెమటచేఁ స్నానము చేయించినరీతి యున్నది. (అనుచుఁ కొంగుఁదుడిచి పయ్యెదచే గాలివిసరుచుండును.)

హరిశ్చంద్రుఁడు.—(హాయని యులిచిదిగ్గున లేచి) ఏదీ! నాతలఁదన్నిన బ్రాహ్మణుఁడు? ఏదీ! ఇప్పుడిచటనుండెనే? (అనుచుఁబలవరించుచుండును.)

చంద్రమతి.—(తనచేతికడియము దీసి దిగఁదుడిచి పాఱవేసి) ప్రాణప్రియా! ఏమీవికారము? నేనిచట నేయున్నదాననే? మనలోహితుఁడు దప్ప మఱియొకఁడిచట నడుగిడలేదే? ద్విజుఁడెవఁడు? అతఁడు నిన్నే మొనరించెను?

హరిశ్చ.—(తెలివి తెచ్చికొని) భామామణీ!

ఉ॥ చల్లని నీమృదూరువునఁ జంద్రమతీ! నిదురించి యుండగా
త్రుళ్లుచుఁడై ద్విజుండొకఁడు చూపులనిప్పులుగ్రక్కి నేను ధీ
తిల్లఁగ నాకిరీటమును ద్రిక్కగతిన్ బడఁదన్ని వైభవం
బెల్లహరించె నయ్యయొ భయింపఁ గలంచెను గాననమ్ములన్.

అయ్యో! ఆద్విజనకుని పదతాడనంబున నాతలదిమ్ముబట్టెను. ఇది మతివిభ్రమమో మోహమో స్వప్నమో యథార్థమో తెలియకున్నది ఏమిసేయుదు? ఇఁకముందేమి రానున్నదో కదా? కాంతా! ఆద్విజుఁడెచటనుండును? ఏకారణంబున నాతలఁదన్ని యుండును? ఎచటికి వెళ్ళియుండును?

చంద్రమతి.—ప్రాణపతీ! ఇదియొకదుస్స్వప్నము. తత్ఫలంబు మిమ్మంద

నటుల యీ యాభరణంబు దిగఁదుడిచివేసెద (అనుచు రెండవ కడియము దిగదుడిచివేయును.)

హరిశ్చంద్రుఁడు.—మానినీమణీ! ఇది స్వప్నంబైన నాశిరముపైఁబడిన దెబ్బనొప్పి యిఁకను మానదేల? ఇదియథార్థమని నాకుఁదోఁచెడు.

చంద్రమతి.—ప్రాణేశా! తమస్వప్నమునుగుఱించి నాకుఁదోఁచినది విన్నవించెద.

మ॥ అరయన్ మీతలఁదన్ని స్వప్నయతి విశ్వామిత్రుఁడౌఁగాని భూ
సురుఁడన్యుఁడును గాదు నమ్ము రమణా! శోకంబువ్యర్థంబు. భీ
కరవన్యాలత జంతుజాలమిది నిక్కంబారయన్ మానిదు
ష్కరమాయా జనితంబు క్రోధిమతియే కార్కశ్యమున్ బూనునో?

ప్రాణనాథా! ఇన్నియాలోచించిగదా వసిష్ఠులు గాధిపట్టివనభూములనడుగిడక పురికివెడలుఁడని యానతిచ్చెను. త్రయీవేదులు త్రికాలవేదులుకదా. మాపాలిటివిధి 'యాజింకరూపమ్మున నగపడెను.

హరిశ్చ.—భామినీ! వచ్చినది రానిమ్ము వగవనేల? నాదేహమెల్ల బెండుపాఱినది. కాళ్లువడఁకుచున్నయవి. పదములు తొట్రుపడుచున్నవి. ఒకరెండు గడియలిచటనే విశ్రమించెదను (అనుచుఁగూర్చుండును.)

(సత్యకీర్తి ప్రవేశము)

సత్యకీర్తి.—మహాప్రభూ! తమదర్శనార్థము మతంగకన్యక లిరువురు వచ్చి సెలవునకు వేఁచియున్నవారు. చక్కఁగఁబాడుదురఁట. స్ఫురద్రూపులు.

హరిశ్చంద్రు—ఏమీ మతంగమానినులా? అనూనగాన కళాప్రవీణలా? మోహనాంగులా? ఏమియచ్చెరువు? విరుద్ధధర్మములిందు గూడినవి రానిమ్ము.

సత్యకీర్తి.—(వెళ్ళి వారిం బిలిచికొని వచ్చును.)

మతంగకన్యకలు నమస్కరించి. (రాగమాలిక ద్విపద.)

భావజాకార! నీ పాదపద్మముల
సేవింపవచ్చిన సితకరాననల
మాలలంచని యనుమానమువిడక
లాలించి గానకళానిధీ! ప్రీతి
వాలించి వివిధరాగాలాపములను
మేళించుమా మాను మేదినీనాథ!
మోహనాకారయీ మోహనరాగ
మోహమింపుగనిచ్చు నిహసుఖమెల్ల.
కల్యాణశుభగాత్ర! కలుగుశుభంబు
కల్యాణరాగంబు కరుణకు వినుము
సహానాధినాథ! యీ సహానరాగంబు
గహనాను రక్తిఁ గలిగించు ముదము.
ఆనందపెట్టుచు నానందరాగంబు
ఆనందభయిరవి యనవనిత! వినుము
కేదారగౌళ సంకీర్తనల్ విను
భూదారుఁడిను మెచ్చి పూజ్యతనిచ్చు.
మధ్యమావతిని సుస్వరంబుఁ బాడ
నిధ్యంజనంబయి నినుచుసంపదలు.
ఆగడంబులుబాపి యధికశోభనము
చేగడయిచ్చును బెడగారఁ బాడ.
గౌరీప్రియంబిది గౌళిరాగంబు
ధారణీపతివిను తనియఁగను మదిని
నాటిరాగంబు భూనాథుల మదిని
నాటిన విభవమే నాటికిఁ జెందు

మలయమారుతమిది మహితలాధీశ.
మలయమారుతమయి మదికింపుఁ గూర్చు
చక్రవాకంబు భూచక్రాధినాథ!
చక్రధారిహితంబు చారుతరంబు.
నీలాంబరామోదనిధి యిది వినుము
నీలాంబరీరాగ నియమముగనుము
శహానరాగ గాంభీర్యమువినిఁ
సాహసవిక్రమ శౌర్యధారుఁడు.
భయిరవీప్రియభక్త! భయిరవిరాగ
పూరితానందుఁడై పూజ్యుఁడవగుము.
కేదారరాగంబు కేదారవాసు
మోదదంబగుఁగాన ముదమిచ్చునీకు
ఎఱుకల కాంభోజి యెలమినవినిన
నెఱుకహెచ్చును మను నిల మనుజుండు
తోడిరాగమువినఁ దోయజాక్షుండు
తోడినీడగుచు సంతోషంబునిచ్చు
కన్నడరాగంబు కడలకవినిన
కన్నడలనుబాపి కాచు నన్నుండు
శ్రీరాగమునువిన్న సేవకజనుల
శ్రీరాముఁడెదమెచ్చి శ్రీయుతుఁజేయు
ఈవరాళినివిన్న యిహలోకజనుల
శ్రీవరాళినిఁజేయు శ్రీవరుఁడెపుడు
హంసధ్వనిరాగ మతివినోదమ్ము
హంసయానకుఁబ్రీతి యగువైభవమ్ము
సాధనామక్రియ నానురాగంబు
సాదరంబునవిన్న నఘునాశకంబు
సూనృతవాక్య! జంఝూటిరాగంబు

మానసామోదంబు మధుసూదనునకు
రారాజ! బిల్హరి రాగంబువినుమ
కోరికలెల్లను గోమరొప్పఁగనుమ.
భూరిప్రతాప! కాంభోజరాగంబు
ఆరోగ్యదాయకం బతిశుభదంబు
రాణింపఁ బూరికల్యాణరాగంబు
యేణాంక సమరూప! యిష్టార్థదంబు
సారంగధరునకు సమ్మోదకరము
ఆరభిరాగ ము దారచరిత్ర!
నాటకురంజి యే నాటికైన
కైటభమర్దను కరుణ నార్జించు
సావేరి వినినట్టి సజ్జనాళికిని
కావేరితటధామ కరుణచేఁగూడు
శంకరాభరణము శంకరాంకితము
శంకరాభరణము శంకర మనని
వరకీరవాణి వాగ్వరకీరవాణి
సరససమ్మోదాను సంగతామృతము
దేవగాంధారి! యీ దేవగాంధారి
దేవదేవుని భాగధేయము వినుము
గంధారిమర్దన! గాంధారిరాగ
మంధకాసురవైరి కానందదంబు.
సన్యాసులకునైన సంతోషకరము
ధన్యాసిరాగము దయఁగనివినుము
సంతాపహరము వసంతరాగమ్ము
సతతానందైక సంపదుద్భవము
కాలకాలమున ముఖారియు విని
కాలాంతకుని భీతి కలుగదీయనని.

యుందువిలుకాని మోహప్రపంచమునకు
డించి రక్షింపుమా నవపంచబాణ!

2. మతంగకన్య.—

గీ॥ ఖరకిరణతప్తమయి బాహ్యకాయమడఁగ
పంచశరవహ్ని లోన వ్యాపించెఁగాన
వెలిగొడుగునిచ్చి మారుని లలితకేళిఁ
దేల్చి రెంటను రక్షించు దీనరక్ష!

మదనసమరూపా! పుష్పబాణుని వేఁడిమిమై సొచ్చి బాధించుచున్నయది నీతావి కెమ్మోవి పానకంబిచ్చి రతికేళుల మము నేలుము. మాగాన ప్రవీణతకు నీవు మముమెచ్చితివి. నీ పంచాయుధ ప్రపంచజ్ఞానంబు మాయందువెల్లడించి మామెప్పులందుము. నినువదలఁజాలము.

హరిశ్చంద్రుఁడు.—(కోపమున) వెలవాడ చేడియలారా! మీ మాల గుణంబువెల్లడించితిరి. మీరు తృణావృతకూపసన్నిభులు. మండూక స్వనఘణులు. మేకవన్నెపులులు. ఆ! ఇంతటిదౌష్ట్యమా? పాముకుఁ బాలుంచిన విషముమానునా? పలువలను జేరఁబిలిచి మంచిపలుకు లాడినఁ దమ తులువగుణంబు మానుదురా?

ఉ॥ మాయలబూమెలుస్నెఱపి మాయురె! నన్నిటుగోరనానె? మీ
కాయము హేయమంచు మిముఁగాంచినఁ బాచితమంచు ధీవరుల్
రోయుచునుండ, భూవరుఁడు స్మాధిగమిష్ఠు వరింపఁబోలునే?
యాయతభూతలేశుల జయాంకిత మీ గొడుగివ్వనేర్చునే?

మాలెతలారా! మధుమాంసభక్షణచే సురాపానముచే మీకనులకుఁ గావరముగప్పి నీతివిధులు, జాతిహెచ్చుతగ్గులు, స్థానతారతమ్యము దెలియక, మాటలాడుచున్నవారు. మీ ప్రల్లదములు దుస్సహములు. ఇచ్చినది పుచ్చుకొని చెచ్చెరవెళ్లెదరా? వెళ్ళగొంటింపవలెనా?

1. మతంగకన్య.—

ఉ॥ భూలలనామనోజ! యిటుభూరిమనోభవ బాణధారలన్
సోలిన యంగనామణుల శోకమువార్పక దీనరక్షకా!

పోలునె చిచ్చునఁ బడఁగఁ బొమ్మనిపల్కఁగ? రాజధర్మమే?
లాలనసేయుమా మదనలాలిత సంగరకేళిలో మముఁ.

2. మతంగకన్య.—సార్వభౌమా! రాజబింబమో రాజీవమో రాజన్యకురరాజమో యని భ్రాంతిగలిగించు నామోముఁ జూడుము.

1. మతంగకన్య.—జలచరములో యలరువిల్తుశరములో జలజములో యని సందేహముగలిగించు మాతళుకుడాల్గల కనుఁగవలుగనుము.

2. మతంగకన్య.—కోరకగుచ్ఛములో కోకములో కనకకుంభములో యని భ్రాంతికలిగించు మాచనుగుబ్బలు కనులారఁగనుము.

1. మతంగకన్య.—చంచలాలతికలో కనకలతలో చారుతరతారకాజాలమో యని విచికిత్సగలిగించు మాయంగసౌష్టవమును గనుము.

2. మతంగకన్య.—కావిడాలుల దీవులై పూవుతావుల తావులై తావిమీరు మామోవుల చవులించుకయనుభవించిచూడుము.

(అనుచు సరసకువత్తురు.)

హరిశ్చంద్రుఁడు.—సత్యకీర్తీ! ఈ మత్తమదగజయానలు సురాపానమత్తుచేఁ జిత్తజుని పిచ్చియెత్తి తత్తరపడుచు మత్తనువు హత్తవచ్చుచున్నవారు. వీరిదేహము కొరడాదెబ్బల మెత్తఁబఱచి యుత్తమగుణంబుగఱపి పంపుము.

సత్యకీర్తి.—చిత్తము (అనుచుఁ గొరడాయెత్తి వారినిఁదన్నును.)

మతంగకన్యలు.—హా! హా! నాయనా! విశ్వామిత్రా! ఈచాండాలుఁడు మముఁజంపుచున్నవాఁడు. వేవచ్చిప్రోవుము. చచ్చితిమి.

విశ్వామిత్రుఁడు.—(హా! హా! ఎవఁడు నాముద్దుబిడ్డలను జంపువాఁడని యఱచుచుఁ బ్రవేశించును. విశ్వామిత్రునిఁజూచి.)

1. మతంగకన్య.—నాయనా! ఆచాండాలుని మాటవిని యీచాండాలుఁడు ననుఁగొట్టి చంపెను వేఁడినను వదలఁడాయెను. అయ్యో!

గరిష్ఠుని, ఆగర్వి శ్రేష్ఠుని వసిష్ఠునిమాటలువిని వేఁటనెపంబున పర్వ నంబుసొచ్చి నుత్పాదిత బాలహారిణంబును హారింపనెంచితివి. అంతటితోఁదనియక నాముద్దుబిడ్డలను కౌర్యరక్తమూని, కృపమాని మేనెల్లఁజిదియఁదంచితివి. ఇదిగో కఠిన శాపంబిచ్చి నినుఁగాల్చెదఁ జూడుము.

హరిశ్చంద్రుఁడు.—(గడగడవణఁకుచు) అనాధరక్షా! దీనబాంధవా! పిచ్చుకపైన బ్రహ్మాస్త్రమా? తృణమును ఛేదింప వజ్రాయుధమా? కొడుకుతప్పు తండ్రిసైరింపఁడా (అనుచుఁ బాదములు బట్టుకొనును.)

విశ్వామిత్రుఁడు.—(కోపమునఁ గిరీటము క్రిందపడ లాగునఁ దన్ని) ఓరీ! దురాత్మా! నాపదములంటకు. ఋషినాశకుఁడు కులనాశకుఁడగు కులనాశకుఁడు నిరయాలయుఁడగును. నీవు పంచమహాపాతకులలో నొకఁడవు.

హరిశ్చంద్రుఁడు.—(లేచి) స్వామీ! ఈపాతకి శిరముపైనుండిన రత్నపాషాణఖచిత కిరీటమునకు మీమృదుకోమల పదములు వవిలి నొప్పిపట్టెనేమో?

విశ్వామిత్రుఁడు.—ఓరీ! నృశంసా! ఈనాపాదములొకటే యననేల నాసర్వాంగములు నొచ్చినవి

హరిశ్చంద్రుఁడు.—దేవా! శతాపరాధిని నేను, సర్వాపరాధిని నేను, నను క్షమించు భారము నీయది.

విశ్వామిత్రుఁడు.—ఓరీ! రాజ్యమదాంధా! నాచరిత్రయెట్టిదైనది వినవో? వినిమఱచితివో?

చం॥ స్థిరమతిఁబూని ధీరత వసిష్ఠునితోఁ గలహించిమించి బ
హ్మఋషినైతి, ధాతనుమున్యతుఁడుగా నెంచఁగ నొంచఁ గ్రొత్తగా
సురపురిసృష్టిచేసితిని, సూటిగఁజేసితి నిందిరో పర
శ్వరుఁడగు నీదుతండ్రిని త్రిశంకునిఁ గాంచవ నాచరిత్రముల్!

ఓరీదుష్టాశయా! యిట్టిమహిమాస్పదుని తపోధనుని ముద్దుతనయల నింతకష్టపెట్టుదురే పాపాత్మా?

హరిశ్చంద్రుఁడు.---మునిశార్దూలా! నాయెనర్చినదంతయుఁదప్పు. నను మన్నింపవేఁడెద.

విశ్వామిత్రు.---ఓరీ! హరిశ్చంద్రా! నేనొకహితముపదేశించెద. దాని నాచరింతువేని నినుమన్నించి రక్షించెద.

హరిశ్చంద్రుడు.—స్వామీ! అదియేమి?

విశ్వామిత్రుఁడు.---హరిశ్చంద్రా! వీరినిఁజూడుము. (అనుచు మతంగ కన్యకలంజూపి.)

సీ॥ శ్రీమాతజాత్రమై చికురములేవేళ శృంగారరసము వర్షించుచుండు
పైమాస్యమణి గుచ్ఛవత్ఖరీ స్తనయుగ మనురాగరాగంబు ననుపఁజేయు
అంబరమణి దీప్తినలరుచు రాజిల్లు చక్రవర్తులకటి చక్రయుగము
జలజరాగశ్యాలఁ జెలువారిచెలఁగును పద్మసుమోపమ పదయుగమ్ము.

గీ॥ బింబరాజమ్ము ద్విజరాజబింబమోము
మోవిమోముల విలసిల్లు ముద్దురాండ్రు
రాజభోగార్హ్వలగుదురు రమణమీఱ
నీదుదేవేరులుగ వారి నాదరింపు॥

హరిశ్చంద్రా! నాబిడ్డలు నీచేఁగష్టపడినారు. కావున మరలవారు నీచే సుఖపడువలయు నాయుదరవహ్ని చల్లాఱదు. వైళమ్మెవారిని వరించి నీ దేవేరులుగ నేలుము. నీకిదిహితము.

మతంగకన్యలు.—తండ్రీ నిజము. మంచిమాటలాడితిరి. బాగుగఁదోఁచెను.

హరిశ్చంద్రుఁడు.—మునిపుంగవా! వంశపావనత రాజ్యగౌరవత నెఱింగిన మీరిటులాడఁదగునా?

చ॥ జలజహితాన్వయాంబుధి శశాంకుఁడనై వరధీరతాంకుఁడై
జలధిపరీత భూభువన చక్రము నేలెడు చక్రవర్తినై
మలినకులాఘువర్తనల మాలెతలన్ వరియింపనేర్తునే?
ఫలమె? చలమ్మె? మీరిటులపల్కఁగనా నె యధర్మ వృత్తముల్?

మునివర్యా! ఇట్టిమాటలు నీశిష్యునకు బోధింపనగునా? వినసనహాంబులుగదా?

విశ్వామిత్రుఁడు.—ఓరీ! దుష్టాశయా! విననసహాంబులైన దుష్కృత్యములో నీకు నేను బోధించినవి? పోటుమానిసిబలె నోటికొమ్ములతో మాటలపోటు చూపుచున్నావు. చిచ్చార్చ్చనుచెత్తఁ జేర్చుచున్నావు. ఓరీ! మఱచియైన నగ్గిముట్టకు. హెచ్చరిక. విశ్వామిత్రునితో విరసములాచరింపకు. ఈమాలకన్నెల నాలుగునేలెదవా? ఏలవా? అనాలోచితముగ బదులిడకు. నెమరువేసినసులుము. ఆలోచించి యభిప్రాయమిమ్ము. నీభవిష్యదాపత్సుఖములు జూచికొనుము. కీర్తి నార్జింపుము.

హరిశ్చంద్రుఁడు.—మునివర్యా! ఆలోచించితిని. సుఖదుఃఖములు శారీర సంబంధములు, కావున శాశ్వతంబులుగావు. కీర్తి దేవతాభరణంబుగావున నిత్యము. నిత్యవస్తువుత్యజించి, యనిత్యవస్తువును గోరుదునా? కోరను.

చ॥ వదలుదు మానివంశమణి! వారణరథ్య పదాతివర్గమున్
వదలుదు సర్వసంపదలు, వారిధివేష్టిత భూతలంబునున్
వదలుదు దారపుత్రహిత బాంధవమిత్ర భటాలినంతయున్
వదలను, వంశధర్మమయి వానికి నెక్కిన శీలసంపదన్.

మునివంశాగ్రణీ! తమినంది, యీమాలచేడెలఁబొంది, నేనందునది స్వర్గపదవియైనను నాకువలదు. కులశీలము వదలఁజాల.

విశ్వామిత్రుఁడు.—ఏమీ క్షత్రియాధమా! రాజ్యమువదలుదువా? రాజ్యసంపదలు వదలుదువా? ఈమాటలుతప్పకు. ఈశ్వరునానసుమీ.

ఏదీ! నీరాజ్యము నాకుధారాదత్తముగనిమ్ము. చూతము నీసత్యసంకల్పము.

హరిశ్చంద్రుఁడు.—ఋషివర్యా! నాహృదయమరయ మీరిటుకోరదగు కాఁబోలు? తామనుభవించి వేసరి వదలినదికదా యీరాజ్యము? వైరాగ్యధనంబు మితిమీఱినందిన, మీకీ యశాశ్వత రాజ్యవిభవంబుపై నిచ్ఛగలుగునా?

విశ్వామిత్రుఁడు.—ఓరీ మాయామాయకారీ! దోషములపుట్టా! అనృతవాదీ! నీనాలుకపైఁ దేనె మనంబున విషము గలిసియున్నది. ఈరాజ్యమిప్పుడే కదా యిచ్చెదనంటివి? ఇమ్మనినంతనె యెన్ని నేర్పు లెన్ని మార్పులు పలుకుచున్నావు? అవురా! ఇన్నిచుట్లు యగచాట్లుబడుటకంటెను రాజ్యదానంబిచ్చెదనని వచింపనని పలుకరాదా? నీసత్యవాక్యపరిపాలన వెల్లడియగు.

హరిశ్చంద్రుఁడు—(ఆలోచించుచుండును.)

చంద్రమతి.—నాధా! ఏమీయాలోచన?

కం॥ భూనాథులెందఱేలిరి
యీనేలను? వారిలోన నెవ్వండేనిఁ
బూని యొక యించుకేనియు
దానఁగొనిపోయెనే, ముదంబనివెంటఁ?

నాథా! ఈయశాశ్వతమైన రాజ్యంబును రాజ్యవిభవంబును నీకు వలదు.

విశ్వామిత్రుఁడు.—హరిశ్చంద్రా! స్త్రీలెంతటికైనఁ దెగించినవారు. కావున "స్త్రీబుద్ధి ప్రళయంకరీ" యని పెద్దలాడుదురు రాజాధిరాజవగునీవు స్త్రీబుద్ధివిని బిచ్చాలరాజగుట యుపేక్షణీయము కాదు. మానప్రాణధనహానిదశల, ననృతమాడినను, గలుషంబు రాదని

శుక్రనీతియున్నది. కావున యీవిషయంబున, ననృతంబాడితినని కార్యంబు దక్కించుకొనుము.

హరిశ్చంద్రుఁడు.—మునిజనగ్రామణీ!

గీ॥ హేయకాయంబు బుద్బుదప్రాయమవని
ధరణి, దారలు, తనయులు, ధనము, సతమె?
సజ్జనస్తుత్య సత్య మాచంద్ర సూర్య
తారకంబుగనిలుచు, సుదారమహిమ॥

మహానుభావా! ఇట్టి తుచ్ఛానుభవంబులఁ గోరి, యిచ్చినమాటఁ దప్పి సూర్యకుల సచ్చరిత్రమునకుఁ గళంకముఁ దెచ్చునంతటి పాపాత్ముఁడనుగాను. కాయము కాలచక్రముఁబలె, కల్లోలముల భంగిఁ జలించుచుండునుగదా! కాయము పోయినను మాటనిలుచును గదా? "కీర్తిర్యస్యసజీవతి" యను వాక్యము లేదా? ఈశ్వరేచ్ఛ యెటులుండిన నటులుకానిమ్ము. నేమాటఁదప్పను. (చంద్రమతిఁజూచి) ప్రాణేశ్వరీ! జలమ్ముదెమ్ము.

(చంద్రమతి జలముదెచ్చి హరిశ్చంద్రుని కరమునఁబోయును.)

హరిశ్చంద్రుఁడు.—సూర్యచంద్రులారా! అష్టదిక్పతులారా! త్రిమూర్తులారా! త్రికరణశుద్ధిగ నేనీదినంబున దేవస్వబ్రహ్మస్వములు దప్ప సర్వరాజ్యము, సర్వసంపదలు, విశ్వామిత్ర మహర్షికి బ్రహ్మప్రీతిగ బ్రహ్మార్పణముగ, సమర్పించితి (అనుచు నీరు ఋషికరమున విడిచి) (సత్యకీర్తిఁజూచి) సత్యకీర్తీ! నేఁటినుండి విశ్వామిత్రులవారు మీరాజులు కావున మీరు వారియానతికి వేఱుసేయక నటించుఁడు.

విశ్వామిత్రుఁడు.—సత్యకీర్తీ! రేపటిదినంబుననే నేనాపురికివచ్చి రాజ్యభారంబు వహించెద. నీవిపుడేవెళ్లి సర్వము సిద్ధముగనుంచుము. వెళ్లుము. నిలువకుము. వెళ్లుము.

సత్యకీర్తి.—(హరిశ్చంద్రునిఁజూచి కన్నీరుఁగార్చుచు నిల్చుచును.)

విశ్వామిత్రుఁడు.—హరిశ్చంద్రా! చూచితివే? యీమంత్రికెంత పొగరు తలకెక్కినదో? ఇట్టికుత్సితబుద్ధి నాకు విధేయుఁడుగనుండునా? జనుల కుఖోధించి రాజ్యమునందుఁ గలఁతలుబుట్టించును. ఇట్టిరాజ్యము నాకునిచ్చిన నేమి? లేదన్న నేమి?

హరిశ్చంద్రుఁడు.—ఋషికులాగ్రణీ! చిరకాలమునుండి మంత్రిపదంబు నందినవాఁడు కావున, నన్నెడబాయలేక కన్నీరుగార్చెడు. (సత్య కీర్తిఁజూచి) సత్యకీర్తీ! నీవిటులొనరించిన నామాట యెటుదక్కు? నీవు మీరాజునాజ్ఞ శిరసావహించి యీనర్వు. పొమ్ము.

అనుబంధము 17.

(సత్యకీర్తి కన్నీరుగార్చుచుఁ బోవును.)

విశ్వామిత్రుఁడు.—హరిశ్చంద్రా! రాజ్యము నాయధీనము. రాజ్య సంపద నాయధీనము. మీకీరాజచిహ్నములేల? అమూల్యములగు వస్త్రాభరణములేల. నారచీరలు చాలవా? వానిఁగట్టి యీవస్త్రా భరణము లిటు తెండు.

హరిశ్చంద్రుఁడు.—మౌనివరా! తమయానతి కీతివ ర్తిల్లెదము. నారచీ రలు గట్టికొని వత్తుమా?

విశ్వామి.—త్వరలోరండు. వెళ్లుఁడు. (హరిశ్చంద్ర చంద్రమతి లోహి తులు వెళ్లుదురు.) (మతంగకన్యకలఁజూచి) చేడియలారా! మీరును వెళ్లుఁడు.

(మతంగకన్యకలు నిష్క్రమింతురు.)

నక్షత్రకా! నక్షత్రకా! నక్షత్రకా! యని యఱచును.

(నక్షత్రకుఁడు "వచ్చితిని, వచ్చితిని" యనుచుఁ బ్రవేశము.)

ఓరీ! నక్షత్రకా! నీకు విద్యనేర్పినందులకు నీవు గురుదక్షిణ యివ్వ వలెను గదా?

నక్షత్రకుఁడు.—స్వామీ! అందులకుఁగదా యానాఁడు హరిశ్చంద్రుని యాగసంతర్పణ భోజనంబునకుఁ బోవలెనని యెంతప్రయత్నించినను నాకు మీరంతరాయంబుగ నిలిచితిరి? "నీకేసంసారంబు కాళ్లపై నడారలుచున్నది? ధనమేల?" యని యడిగితిరి. ఇపుడు చూచితిరా? గురుదక్షిణకు ధనము లేదాయెను. మీరడిగినపుడు నోటిలో నువ్వుగింజలు వేసికొని చచ్చినవానివలెఁ బడియుండవలసివచ్చెను. ధనమడిగినచో, "ఒకటీ, రెండూ, మూడూ, నాలుగూ" యని ఝుణ, ఝుణ, ఝుణ యెంచుచుంటినిగదా?

విశ్వామిత్రుఁడు.—నక్షత్రకా! నాకు ధనమేల? హరిశ్చంద్రుని రాజ్యసంపదలెల్ల నే హరించితిని. నాకు వాఁడనిమిదికోట్ల ధనము ఋణము దీర్పవలెను. వానిపైఁ దరువుగాఁడుగానుండి వానినిఁబడరాని హింసలఁ గెడపి యంకగతోరగమై, కొంగునఁజిచ్చై, కుక్షిమక్షికన్యాయంబున, ఋణము గక్కింప బాధించుచుందుము. నాకు వాఁడిచ్చుధనము ప్రాధాన్యముగాదు. వానిఁ గాఱించి కన్నహింసలఁ గెడపి యనృతం బాడించితినేని నేఁగృతార్థుఁడనయ్యెద. కాదేని నా తేజంబు తగ్గి, నీవైరిగురువు తేజంబు హెచ్చును.

నక్షత్ర.—స్వామీ! ఇది కఠినకార్యము. అయినను జేసెద. దీనినుండి నాకుఁ బాపము రాదుకదా?

విశ్వామి.—నక్షత్రకా! గురుకార్య నిర్వాహకంబునం దొనరించినదేదియుఁ బాతకహేతువుకాదు. నీపేరు శాశ్వతంబుగ జగతిని నిలుచును.

నక్షత్ర.—నిజము. అప్పున్నవారిపైఁ దరువుకాండ్రకెల్ల నాపేరువచ్చును. "ఏనకేనాద్యుపాయేన ప్రసిద్ధః పురుషోభవ" యని మీరువచించియుంటిరిగదా. చిత్తము. మీయానతి శిరసావహించి చేసెద. హరిశ్చంద్రుఁడేడీ?

విశ్వామిత్రుఁడు.—హరిశ్చంద్రుఁడును, చంద్రమతియు, లోహితుఁడు

నిర్వుదేనత్తురు. వారియెదుట నీవేమి మాటలాడకుము. నాహితము చక్కఁగ గమనించితివిగదా? హెచ్చుగఁబలుకుట యనవశ్యకము.

నక్షత్రకుఁడు.—స్వామీ! వ్రేలుచూపిన హస్తము దిగ్రమింగువానికి నిన్ని కఱపవలెనా? కఱపినమలి కట్టినకడి కలకాలముండునా? ఇట్టి వాటికెల్లఁ బ్రతిభ యుండవలెనుగాని.

విశ్వామి.—నిజము. వారు వచ్చుచున్నట్టున్నది. మిన్నకయుండుము.

నక్షత్ర.—చేతులు జోడించుకొని నిలుచును.

(ప్రవేశము హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితుఁడు.)

విశ్వామి.—హరిశ్చంద్రా! మీవస్త్రాభరణము లిటనుంచి నారాజ్యంబు వదలి వెళ్లిపోవుఁడు. నారాజ్యమునం దడుగిడకుఁడు.

హరిశ్చంద్రుఁడు.—మునివర్యా! పుణ్యక్షేత్రంబని ప్రసిద్ధికెక్కిన కాశీ నగరంబున నుండుటకు ననుజ్ఞయిత్తురని వేఁడెద.

విశ్వామిత్రుఁడు.—మంచిది అటుచేయుఁడు. పొండు.

(అందఱు నమస్కరించి వెళ్లిపోవ నడుగిడుదురు.)

నక్షత్ర.—స్వామీ! ఆవార్త మఱచితిరి.

విశ్వామిత్రుఁడు.—నిజము. నిజము. ఓరీ! హరిశ్చంద్రా! దుష్టాశయా! విప్రవిత్తాపహారకా! "ఋణవ్రణకలంకానాం కాలే శేషో భవిష్యతి" యను వాక్యంబు సార్థకపఱచఁజూచెదవా? నేమఱచితినో, నాకది యెఱుకపఱచి నాఋణమునకు దాఁటిపోఁ దగినది ధర్మము కదా? అలనాఁడు నాయొనర్చు యాగంబునకై నిడిన ధనం బేదీ? ఎవరిని ముంచఁ దలంచితివి? పరుల ఋణంబు ముంచుట పరువా? అందున విప్రునిధనంబు విషముగదా? అర్యమకులంబున నుంచి ధర్మపరుఁడవు బుట్టితివి.

హరిశ్చంద్రుఁడు.—మునికులోత్తమా! రాజ్యమిచ్చితి. రాజ్యవిభవము

చ్చితి. వస్త్రాభరణంబులిచ్చితి. కట్టుబట్టలుసైతమిచ్చితి. నారుచీరలు గట్టితి. రాజ్యలాభంబందినవారే రాజ్య ఋణంబు దీర్పబద్ధులుకదా?

విశ్వామిత్రుఁడు.—ఓహో! వ్యవహారవిధులకు దిగితివో? మంచిది. ఈఋణము నీవు హరిశ్చంద్రనామంబున పారలౌకికపుణ్యంబునకై చేసినావుకాని రాజుగాఁజేయవు. నీవొకరాజునని నీకు నే ఋణంబివ్వను. ఇన్నికష్టంబులుపడి మర్త్యవాదములు వెదకికొని ఋణము ముంచుటకంటెను యాగదక్షిణ నేనివ్వనే లేదని యసత్యంబు పలుకరాదా? సర్వసంకట పరిహారముగానుండును.

హరిశ్చంద్రుఁడు.—మునిరాజసార్వభౌమా! మూడుమాటలలో నాలు దప్పులు పట్టనగునా? మీకిచ్చిన వచనంబు దప్పుదునా? గ్రాసమునకులేని నిర్భాగ్యుఁడు కోట్లకొలది ధనం బెట్టు లడిగినపుడే యిచ్చును? దయఁబూని యొక నెలదినంబులు గడువిచ్చిన దేహమమ్మియైన మీధనంబు నిచ్చెద.

విశ్వామి.—అటులొనరింపుము. పొమ్ము.

నక్షత్రకుఁడు.—స్వామీ! ఋణముదీర్పను గడువేర్పఱచి పురివిడిచి చేతికిఁ జిక్కక పలాయనమంత్రంబు పఠించినవారి ననేకులను నేను జూచినాను. మనములోలు పేదవారిలో నిట్టివి దినదినము జరుగుచుండును.

విశ్వామిత్రుఁడు.—నక్షత్రకా! నిజముపలికితివి. (హరిశ్చంద్రునిఁజూచి) నిన్నుఁగాచికొని నీవెంటఁదిరుగ నాకనుకూలత లేదు. వీఁడు (నక్షత్రకునింజూపి) నాశిష్యులలో ముఖ్యుఁడు. ఎన్నఁడు నెండ కన్నెఱింగిన వాఁడుకాఁడు. వానమోమెఱుఁగఁడు. దారినడచినవాఁడు కాఁడు. ఆకలికినాగఁడు. దప్పికినోర్వఁడు. గొప్పయింటితనము వాఁడు. ఎటుల యీనెలదినంబులు నిను వెంబడించు వీనినిఁగాపాడుకొని వత్తువో తెలియకయున్నది? నిండుపరువుగలమానిసి. దినము గాలుకొట్టి

బంగారు కాసులిచ్చిన నిట్టివాఁడురాఁడు. మాటఁబడువాఁడుకాఁడు? చక్కఁగఁ దెలిసికొనుము. నాకంటె మీకితఁడు హెచ్చనికాపాడుఁడి. నక్షత్రకా! వీరివెంటనంటి యొకమాసములో నెనిమిదికోట్ల ధనము వారినుండి యెట్లైనలాఁగి తీసికొనిరమ్ము. కష్టపడకుము. వీరన్నిట నిన్నురక్షింతురు.

నక్షత్ర.—స్వామీ! రాత్రినేనొంటరిగ వెలికిఁబోలేను. ఆవార్త వారికిఁ దెలుపరైతిరే?

విశ్వామి.—నక్షత్రకా! అన్నియుఁ దెలుపవలెనా? వారు నిన్నురక్షించుదురు. పొమ్ము.

నక్షత్ర.—చిత్తము. నిలుఁడి. నిలుఁడి. స్వామీ! నాకుబత్తెము.

విశ్వామి.—ఓరీ! నక్షత్రకా! వారిత్తురు. వెళ్లుము.

(అంతయు నిష్క్రమింతురు.)

ఇఁక నామాయామహిమఁజూపి వీరికి దారిలో నేనుదాకుల మన్ను దిన్పించి యెనుపావుల నీరు ద్రావించెద. ఆపాదమస్తకము తపింపఁ జేసెద. మాయామునినై దారితప్పించెద. భేతాళులకు బలియిచ్చెద. మీఁతిలేని చిచ్చుచొచ్చులాగొనరించెద. అంతకు మీఁతిలేని ముందు జరుగఁదగిన కార్యంబాలోచించెద. అదృశ్యుఁడనై యుపుడపుడు వీరినిఁ గనుచుండెద. పోయెద.

నిష్క్రమము.

---

## ద్వితీయరంగము.

## అరణ్యమార్గము.

(హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితుఁడు, నక్షత్రకుఁడు.)

హరిశ్చంద్రుఁడు.—ప్రాణేశ్వరి! ఎండఁజూచితివే? అగ్నివలె మండుచు

న్నది. దానికిఁ జేరికఁగ వడగాలి లేచెను. జలజాకరంబులన్నియును జల విహీనంబులయ్యెను. నోటితడియార్ప నెచటను బుడిసెడు నీరు లేదు. నిలుచుటకు నీడ లేదు. ఏదిక్కుఁ జూచినను ముండ్లపొదరిండ్లతో నిండారిన దీయరణ్యము. అయ్యో! దైవమా! ఒకనిమిషమున నెంతటి యున్నతస్థితినుండి మమ్మెంతటి హీనస్థితికి దించితివి! చంద్రమతీ!

## అనుబంధము 18.

సీ॥ చలువతో నెలవులఁ జెలువొందు నీమేను సెగఁజల్లు నెండలఁ బొగలెఁ జాన!

చంద్రమతి. కలలోని కలుముల కొలత లేలో కోరిత్తె వెన్నెలవెన్నంటు నెతలయిరులు

హరిశ్చం. అలరు సెజ్జఁబరుండి యలరారు నీమేను కటకుతాల్మాటుచుఁగటకఁ బొలె

చంద్రమతి. పదియారువన్నెల పసఁగాంచు లేదొర గాము బాములఁజిక్కఁగానిపడదె!

హరిశ్చం. పట్టు చీరలు గట్ట బరువను చెలి! నీకు సింగారమే నారచీరలకటా!

చం. కలిమి లేములుగాంచఁ గావడికుండలై యొకటి హెచ్చును మఱియొకటి దిగును.

హరిశ్చం. చిలుకల పలుకుల కలవడు వీనులు మెకముల నాదుచే మెలఁగనేఁడు

చంద్రమతి. మేలు కీళ్లను దొలి మేన మేకొనరించు కర్మముపంటలుగావె రమణ!

హరిశ్చ.—(లోహితు నెత్తుకొని.)

గీ॥ చిన్నిచిలుత యెంతచెన్నైది బడలెను
మురుదఁబుడుత ముద్దుమోమువాఁడె

చంద్ర. { కలకఁబాల నేల తొలిజన్నిగట్టుని
వాడిఁదకట్టడంబు వసమె మాకు!

హరిశ్చంద్రుఁడు.—తన్వీ! నన్నూఱడించుటకై యెన్నివైరాగ్య వచనంబులు పలికినను నామనం బగ్ని గుండములో బడినటుల తపించుచున్నది. ఏమియుదోఁపదు.

నక్షత్ర.—(దూరమునకుఁబోయి) స్వగ॥ (వీరు తామేమో శ్రమపడుచుండినవారిబలె మాటలాడుచు నాదిక్కుఁజూడరు. నన్నూఱడిం

పరు, నావిద్యఁ జూపెద.) హా! తల్లీ! తండ్రీ! హా! విశ్వామిత్రా! దిక్కులేని చావుఁ జచ్చెద.

చం॥ గృహమునుండి దైనమిడు గింజయొ గంజియొ ద్రావి యుండకా
దహనునిఁ బోలె మండిపడు తాపసి నేలొకొ యాశ్రయించితిన్?
గుహకమె కూడుగాఁ గుడుచు కుంభినిభ స్తకుఁ గూలివాఁడనై
గహనపుఁ జావు చావుమని కాంచనగర్భుఁడు వ్రాసెనా? కటా!

హా! హా! ఏమిసేయుదు? దేహము వాఁడెను. నడవఁజాలను. దప్పి బలమాయెను. పాదములో ముండ్లు దూఱి యడుగిడుటకు శక్తిచాలదు. నా ప్రాణములింక నిలువవు. (సొమ్మసిలిపడును.)

(హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, వానిసరసఁ జేరి గాలివిసరుదురు.)

నక్షత్ర.—(లేచి) అయ్యో! చచ్చియుంటినే? యమపట్టణము సమీపముఁ జేరి మరలవచ్చితి. అయ్యో! హరిశ్చంద్రా! బ్రాహ్మణుని వెంటనిడికొనివచ్చి చంపెదవా? కాని. ఈపాపము నిన్నింతటితో వదలునా?

హరిశ్చ.—(తలవంచుకొని కూర్చుసియుండును.)

చంద్రమతి.---ప్రాణేశ్వరా! దుర్వ్యసనము మానుము.

చ॥ మనమున ధైర్యమూని వగ మానుము మానవనాథ! ప్రాకృతం
బనుభవనీయ మానుగద? యాఁపిన నిల్చునె జన్మమాదిగా
వెనుఁబడివచ్చి కాలగతి వేచుచు నిల్చిన కర్మవాసనల్?
ఘనమతిఁ బూని ధీరతనుగాంచి యశంబిలనింప నెంచుమా.

ప్రాణనాథా! ధీరత్వము మాని, దీనత్వము బూని, యిటులుండుచుండిన గతియేమి? లెమ్ము. ఈపరిసరప్రాంతంబుల నీరెందైన నున్నఁ దెమ్ము. విప్రకుమారునిఁ గాపాడుము. నాథా! ఒఱయికరాయిగదా యిత్తడికిఁ బుత్తడికిఁ గల తారతమ్యంబుఁ జూపును? దారిద్ర్యము గదా పురుషధైర్య రత్నమును వెలిచేయును. దారిద్ర్యముగదా మానవుని చేయును.

లోహితుఁడు.—

అనుబంధము 19.

క॥ అమ్మా! నడువఁగఁజాలను
రెమ్మయులేరాదు నోఁట రెమ్మా జలముల్
సొమ్మసిలె దేహమంతయుఁ
కెమ్మటబలమాఱె నేమిసేయుదుఁ దల్లీ!

అమ్మా! దాహమయ్యెడి. కాళ్లుగాలెడి. నిలువలేను.

హరిశ్చంద్రుఁడు.—హా! హా! ఎంతకష్టమునఁగూర్చితివి? ఇకాలంబున ననాథుఁడగు నాకు నీవుదప్పు బ్రాపెవరు? కసులుబ్బలితోఁ జిక్కినఁ గరుణెత్తనోపునుగాని పిపీలికరెత్తునా? అయ్యో! విధికృతంబు దుర్వారంబుగదా? ఈపసికూన యింతటి విపద్దశకర్హుఁడా? కర్మపరిపాకం బెవరికిని దురత్యయంబుగదా?

నక్షత్ర.—అయ్యో! హరిశ్చంద్రా! ప్రాణముపోయెడు. నీరిమ్ము. నీ వేదాంతములతోఁ దప్పి యాఱదు. ఈతీప్పుడు వేదాంతములు నాకు నీకంటె హెచ్చుగవచ్చును.

హరిశ్చంద్రుఁడు.—(చంద్రమతిఁజూచి) రమణీ! దూరమున నొక కుటీరము గానవచ్చెడు. నీవు లోహితుని నెత్తికొని మెల్లగ రమ్ము. నక్షత్రకుని మెల్లగ నడిపించుకొని నేనును వచ్చెద.

నక్షత్ర.—హరిశ్చంద్రా! నన్ను మెల్లగ మంచిమాటలతోఁ జంపి మా గురువులవారి ఋణము దిగద్రిమ్మింగఁజూచెదవా? నేను నొకయడుగైన నిడఁజాల. నీవుపోయి నీరుదెత్తువా? నేఁజత్తునా? చచ్చెద. చూడుము చచ్చెద.

హరిశ్చ.—విప్రకుమారా! అటుచేయకు. చేయకు. నీరుదెచ్చియిచ్చెద.

నక్షత్ర.—హా! అటుచేయుము. బ్రదికెదను. బ్రదికితిని. బ్రదుకుదును.

హరిశ్చ.—చంద్రమతీ! నేఁబోయి త్వరలో నీరుదెచ్చెద. నీవు హెచ్చరికగ నుండుము.

(హరిశ్చంద్రుఁడు నిష్క్రమణము.)

నక్షత్రకుఁడు.—అమ్మా చంద్రమతీ! హరిశ్చంద్రుఁడు నీరుదెచ్చుటకుఁ బోయెనుగదా.

చంద్రమతి.—అవునయ్యా! ఇపుడేపోయినారు.

నక్షత్ర.—తల్లీ! చంద్రమతీ! నీ మగనికీపిచ్చి పుట్టుకతో వచ్చినదయా? ఇటీవల వచ్చినదియా? ఇటీవలవచ్చియుండును. కాదేని నీతలిదండ్రు లేమి పిచ్చివారా యిట్టివానికి నిన్నిచ్చి వివాహము చేయుటకు? అయ్యో! ఈపసిబాలుని కష్టములు జూచినఁ గన్నులకుఁ గడవలు గడవలుగా నీరుకారునుగదా? ఎన్నఁడు క్రింద నడుగిడినవాఁడు కాడు. పాయసాన్నము భుజించి హంసతూలికా తల్పమున జోల పాటలువినుచు నిద్రించువాడు. నేఁడీ కఠినకంటక పాషాణస్థలంబులు ద్రొక్క పాదములలో రక్త మేఱులుగాఁ బ్రవహించుచున్నయది. అయ్యో! పిల్లవాఁడెంత ముద్దువచ్చుచున్నవాఁడు? చంద్రమతీ నీ కేమయినను కోపమురానీ యీబాలునకై నేనొక హితముపదేశించెద. అటులొనరింతువుగదా?

చంద్రమతి.—ద్విజకుమారా! అదియేమి?

నక్షత్ర.—తల్లీ! సావధానముగ విను.

మ॥ సుదతీ ప్రాణదని పెంపుగందునని యుంతో మున్నునన్ గాంచి తా
పడఁతీ! నీమగఁడీవిధంబునను నిర్భాగ్యుండయెన్. వానికిన్
విడి పోనీరుని వేఁడినన్ బుడమియందేమన్ సుఖంబందగా
నిడు. నీమానము కంటె కన్న సుఖమేదీ చూడుమా సమ్మతిన్.

చంద్రమతీ! కన్నకడుపు నీదిగావున నీకు నాకంటెను హెచ్చుగ నా

బాలునిసుఖ మాలోచింపఁ దగినదానవు. నాహితము వినుము. వలయునేని నేనునువచ్చి మాగురువులవారికి మెప్పువచ్చులాగు మాటలాడి మీరాజ్యము మీకిప్పించెద. రండు. వేగమె పోదము. "శుభస్యశీఘ్రః" మని వచనమున్నది.

చంద్ర.—నక్షత్రకా! విన నసహ్యములగు మాటలెన్ని పచరించితివి? హితబోధనసేయు వానింబలె విరుద్ధవచనంబులెన్ని పల్కితివి? మగని దిగనాడిపోయిన కలికిబ్రదుకుఁగన నాలికిబ్రదుకుగదా! అట్టి నారి మగనిపాలి మహామారి గదా?

ఉ॥ ముంగిటి పారిజాతమగు ముద్దియకున్ బతిభక్తి యొందునన్
తంగటిజున్ను గాదె నిరతంబును భార్యకు భర్తభక్తియున్
చెంగటిపెన్నిధానముగఁ జేడియకున్ బతిభక్తి గానదే?
బంగరు కొండగాదె పతిభక్తిసతీమణి కెల్లకాలమున్?

ద్విజకుమారా! పరదైవమగు పతిని వదలి సతి యుండనగునా? ఎట్టి పిచ్చిమాటలివి!

నక్ష.—(తలగోకికొనుచు) అమ్మా! చంద్రమతీ నేను బ్రహ్మచారిని. సతి యననేమో? పతియననేమో? వారివారి ధర్మకర్మము లేమో నాకుఁ దెలియవు.

(హరిశ్చంద్రుని ప్రవేశము.)

నక్ష.—దాహము. దాహము. రాజా! నీరుదెచ్చితివా? ఏదీ? తెమ్ము. త్రావెద.

లోహి.—నాయనా! నీరేదీ? యిమ్ము.

హరిశ్చం.—బ్రాహ్మణోత్తమా! ఇచటనే సమీపమున జలజాకరమున్నదఁట. అచ్చట పుష్కలముగ పుష్కరము దొరకునని యొకమహాముని పలికెను. మెల్లనఁ బోవుదము రమ్ము.

నక్ష.—అయ్యో! హరిశ్చంద్రా! దాహమునఁ జచ్చుచున్నాను. నీరు తెమ్మనఁ గష్టపడి పోయి పుష్కళపుష్కరశబ్దములు దెచ్చితివా? ఓరీ! నిర్భాగ్యా! బ్రాహ్మణునిఁ జంపితివే! నాఁడశ్వమేధం బొనరించి పుణ్యమార్జించితివి. నేఁడు బ్రాహ్మణవధం బొనరించి దుష్కీర్తి నార్జింపుము. అయ్యో! చచ్చెదను.

హరి.—బ్రాహ్మణోత్తమా! నీపాదములంటి వేఁడెదను. నన్నుఁగృపఁ గని రెండడుగు లిడుము. వలయుననిన నేనెత్తికొనిపోయెద. నా భుజము లెక్కుము.

నక్ష.—మంచిమాటలాడితివి. మీఁదికెత్తి క్రిందపాఱవైచు మాటలివి. నాకుఁ దెలియును. దైవము నీకిడినబుద్ధి నాకు నిడినాడు. నన్ను నరవాహనుఁడు గమ్మనియెదవా? నేనింకను గొన్నిదినంబులు బ్రదికెదను. చావేలగోరెదవు? "చెడగోరకురాచడేవను" సామెత తెలియదా?

హరి.—భూసురోత్తమా! నను మన్నించి దయయుంచి యించుక నడచి రమ్ము నీరుఁదెచ్చి యిచ్చెద. సాయాహ్నసమయ మాయెను.

నక్ష.—మంచిది వచ్చెదను.

(నిష్క్రమము.)

---

## తృతీయరంగము.

అరణ్యము, కొలను, మఱ్ఱిచెట్టు.

(హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితుఁడు, నక్షత్రకుఁడు.)

బేతాళులు.

నక్ష.—అయ్యో! పాపీ! పాతకీ! హరిశ్చంద్రా! నీరిచ్చ[illegible] బ్రదుకింతువని నమ్మితిని. అయ్యో! నీరిచ్చి జీవమిచ్చి దయ్యాలకుఁ బట్టి

యిత్తునని నే నమ్మనైతిని. అయ్యో! యీదయ్యాలు నన్ను చుట్టుముట్టెను.

హరి.—(తిరిగి బేతాళుల గుంపునుఁజూచి వారినిఁజంపును.)

నక్ష.—అబ్బా! నాతల్లి కడుపులోనుండి మరలఁబుట్టితి. ఈబేతాళులీతూరిరానీ! చూచెద! కండ కండలుగ ద్రుంచివేసెద. (అనుచు జచ్చినవానినిఁ జంపఁబ్రయత్నించి దెబ్బవేయు పడినబేతాళుఁ డా కఁడు పాదమొత్తును.) (భీతినటించుచు) హరిశ్చంద్రా! నేను బ్రాహ్మణుఁడని మర్యాదఁ జూపక నన్నుఁ గాళ్లతోఁ దన్నవచ్చుచున్నాఁడు చూచితివియా యీబేతాళుని దుర్గుణాధిక్యత? రాజవయిన నీవీరితి మర్యాదలు గఱపితివియా?

హరి.—భూసురోత్తమా! బేతాళులకు విద్యనేర్పువారెవరు? పుట్టుకతోనే దుర్మార్గవిద్య వారికి వచ్చును.

నక్ష.—అటులైన నేను బేతాళుఁడై పుట్టియుండిన బాగుగనుండెను. నీవెంటనంటి యీతిరిగేక కన్నంబులేక, ద్రావను నీరులేక, నిద్రలేక, యెండకునెండి వానకునాని కుల్లి గుడీ గుండారములలో నివసించుచు ఘోరారణ్యములలో సంచరించుచు గన్నబాధలు గుడుచుచుండు కష్టము దప్పించుకొనుచుంటిని. పాడు నాతల్లి నన్ను మనుజునిగా నేల కనెనో?

హరి.—ధరణీదేవోత్తమా! అంతగా వేసరిలి మాటలాడెదవేల? నిర్భాగ్యులతోఁ జేరినవారికి సౌభాగ్య మెటువచ్చును.

(ఎవఁడురావాఁడని భీకరధ్వనిలోనుండి వచ్చును.)

నక్ష.—(గడగడవడఁకుచు) ఈ యశనిప్రతిమాన కఠోరధ్వని యెవనిదుండును? అయ్యో! నన్నుఁ జంపవచ్చునేమో?

హరి.—బ్రాహ్మణోత్తమా! భయపడకు. నెమ్మదిగనుండుము.

(బేతాళరాజు ప్రవేశము.)

**బేతాళరాజు.**—

మ॥ కనవేరా నను మానవాధమ! ఖలా! కాంతార భూనేతనై,
చినతారాలికి మ్రాక్కుడై, మునిభయా వేశోగ్ర మంత్రంబునై,
జనతాకోటికి గుండె తల్లడమునై, సర్వామరశ్రేణికిన్
గనుమాయన్ జనసట్టి కంటినలునై, కాటించుబేతాళుఁడన్.

ఓరీ! మానవాధమా! నామందిరంబుజొచ్చి నాభటులను జంపితివి. ఇపుడు మిమ్ముందఱినిఁబట్టి నిశాతతరక్రకచదంతముల భంగి తీక్ష్ణతరములైన మదీయదంతమధ్యమునఁ బెట్టి నమలి యేకాహుతిగా ఖ్రింగెద.

**నక్ష.**—అయ్యా! అయ్యా! నేనవరినిఁజంపను. అందఱినిఁజంపిన దితఁడేను.

**హరి.**—ఓరీ! పిశాచాధమా! నీవు బేతాళుఁడవా?

శా॥ బేతాళుండవెనీవు? మంచిదయె. నీబీరంబులన్నానుమా.
భీతాలిన్ గరుణించి బ్రోవు దొరనై, భీమారికిన్ జిచ్చునై,
నీతాలిన్ బొగలించు నీచతతికిన్ నిర్ఘాతపాతంబునై,
చైతన్యంబున నున్నవాఁడను హరిశ్చంద్రాఖ్యతన్ నేధరన్.

ఓరీ! పిశునాధమా! స్థిరముగ నిలువుము నీపీచమడఁచెద.

(అనుచు యుద్ధమొనరించి బేతాళుని జంపును.)

**నక్ష.**—హరిశ్చంద్రా! చూచితివా నాదెబ్బ? వానిది మీఁదిచేయి యయినపుడు వెనుకనుండి చచ్చునంతటిదెబ్బ వేసితిని. పట్టునఁబడెను. నాదెబ్బ నీవు చూచియుండవు.

**హరి.**—బ్రాహ్మణోత్తమా! ఇఁక నేభయంబునులేదు. హాయిగ నిద్రబొమ్ము.

**నక్ష.**—ఏమయ్యా! నీయర్థమేమి నాకుఁ దెలియకయున్నది. నన్నుఁ

జంపవలెనని నీతాత్పర్యమా? పిశాచములన్ని పీనుగపెంటలై బడియుండ దానికిఁ జేరికగ నేనొక పీనుఁగయగుదునా? ఇచట నేనన్నటికిని నిద్రింపను. మఱియొచటకైనఁ బోవుదము.

హరి.—భూసురోత్తమా! నిజము. నిజము. ఇంచుకదూరమేగి శయనింతము.

నక్ష.—అయ్యో! గాఢాంధకారమే? చినుకులుపడుచున్నవియే? ఆకాశమెల్లెడ వారిధరములతో నిండి యురుములు బలమయి భయంకరముగనున్నది ఎటుల నడవవలెను? ఎచటికిఁబోవలెను?

హరి.—బ్రాహ్మణోత్తమా! మాటలతోఁ బ్రొద్దుపుచ్చకు. త్వరగఁబోయి యెచటనైన దాఁగుదము.

(నిష్క్రమము.)

---

## చతుర్థరంగము.

### అరణ్యము.

(హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితుఁడు, నక్షత్రకుఁడు.)

నక్ష.—హరిశ్చంద్రా! సన్యాసులంబలె ఘోరారణ్యంబులు సంచరించుచున్నావు. ఋణము దీర్పఁదగిన దినములు సమీపించెను. ఇదివఱకు నొక కాసయినను గడింపవైతివి. నీయెత్తుగడ యేమయినది తెలియదు. అరణ్యమునకు నంజనంబువేసి నిధులెత్తఁదలంచితివియా? నన్నుఁబంచి నాగురువులవారి ఋణమెగరవేయ దలంచితివియా? నావచనంబులు నీయెడ నెనుముమీద వానకురిసినట్టున్నది. ఎందుకీ యగచాట్లు? ఈచుట్లు? ఈరట్లు? ఋణము పుచ్చుకొనలేదని పలుకరాదా? నాశ్రమయెల్లఁదీరును. నీకు సుఖమొదవును. "కాసు గతిలేదు. అబద్ధమాడను. అప్పుతీర్చెదను" యని బింకము మాట

లాడఁ బ్రయోజనమేమి? "కాసుకు గతిలేనివాఁడు కోటికిభయము లేకనినట్టు" పలుకుచున్నావు. కాశికిఁ బోయినవెనుక కాసంతయు నిచ్చెదనని పల్కెడవే? కాశిలో మీయబ్బ బ్రతికుఁడేమయినా ధనము పూడ్చిపెట్టినాఁడా? కాశికిఁబోయినయెడల నీకర్మము పోవునా? పిచ్చిరాజా! పోయినది పోనిమ్ము. "గతస్యశోచనానాస్తి" యని యున్నది. ఇప్పుడైనను ననృతమాడి బ్రదుకుము.

హరి.—భూసురోత్తమా! నీకు ధనమిచ్చు మితి యింకను బదిదినంబులున్నదిగదా? అంతలోనే యింతగాఁగాసింప నగునే? నీకు నాతండ్రి మాటలేల? ఋణధనంబు దొరకదేని నాశరీరంబునైన విక్రయించి యప్పుదీర్తునుగాని దానిని ముంతునా? అనృతము లాడుదునా? భూసురవరా! చెడుహితము నాకుఁగఱపనగునా? "చలచ్చిత్తంచలద్విత్తం, చలజ్జీవనయావనం, చలాచలమిదంసర్వం కీర్తిర్యస్యసజీవతి" యను హితవచనంబు పెద్దలుపలికినదికాదే?

నక్ష.—హరిశ్చంద్రా! నీకది హితమని బోధించితి. చెడుకాలము నీకుఁ గావున నీవు దానిని సరకుసేయవు. "చెడుకాలమునకు హితము చేరదు. మరణకాలమునకు మందుచేరదు" అనునది నిజము నిజము. చెట్టుకొట్టి పైనవేసికొన్నట్టు నాకేల నీజోలి? చేతిధనమిచ్చి రోత కలహముకొనిన నాగురువునకు మతిఁదప్పెను. నాఁడే నాయప్పుపెట్టి ముందడుగిడమని తలపై కాయమోపి యుండిన నాకింతముప్పు వచ్చుచుండ లేదుగదా? పిచ్చిముని యతఁడు. కరుణవహించి గడవిచ్చెను. అతఁడు మంచివాఁడని యటమటించుచున్నావు. చెఱుకు తియ్యనని వ్రేళ్లతో నమలుచున్నావు. ముప్పది దినంబులలో నిమ్మననుగాని పూర్తిగ నెలదినములు సమయకొట్టుమని యాడెనా? మంచివాఁడవు. నాయప్పు తీర్చెదవా? తీర్పవా? "చెఱుకా! బెల్లమిమ్మనిన నిచ్చునా"? పీల్చి పిప్పిజేసి రసముదీసి యుడకింపవలెనుగాని. నేను పిల్లవాఁడను చేతకానివాఁడనని తాత్పర్యము చేసెదవేమో?

ఇదిగో చూడు నీకాళ్లు నాకాళ్లకుఁ గట్టుకొని కూర్చుండెద. నీవెంట నిరువై దినములు దిరుగునంతలోనే నాప్రాణము పోయెను. మరల నీవెంట నెవరు గుట్టలు గట్టులు నెక్కుచు దిగుచు శ్రమపడియెదరు? (అనుచు కాళ్లు గట్టిగఁగట్టును.)

హరి.—బ్రాహ్మణార్భకా! న్యాయము దప్పకు. ఇఁకను బదిదినము లుండఁగనే నీవీరీతి నను బాధించుట యధర్మము. అయ్యో! విప్రుఁడవై నాపాపి పాదములంటితివియా? వలదు. వదులుము (అనుచు చింతించుచుఁ గూర్చుని) (చంద్రమతిఁ జూచి) చంద్రమతీ! నే గురుతర పాతకిని.

చం॥ ధనములు దుఃఖ నిర్గతిఁ దారియుఁ దోఁపదు. భూసురార్భకుం
డనయము "పెట్టిపొమ్ము ధనమంచు" ననుఁ గడుగట్టిపెట్టి నా
మనముఁగలంచెడుఁ. సమయమానము మీఱితి నేని యక్కటా!
మునివరుఁడేమి బాధలిడి ముంచునొ కష్టజలాంబుధిన్ మమున్?

ప్రాణేశ్వరీ! కష్టాంబుధిలో మునిఁగితి. దారిఁగానను.

నక్ష.—ఓరీ! హరిశ్చంద్రా! నీభార్యతో మొఱలిడెదవో! నీభార్య నా కట్టువిచ్చునా? విచ్చునిమ్ము. నాలుక తెంచుకొని చచ్చెద. నీభార్య కౌటిల్యము నిన్నరాత్రి కనిపెట్టితిని. నీవు తెచ్చిన ఫలములలో నీకు మంచివి యిచ్చి నాకుఁ గుళ్లినవి యిచ్చెను.

హరి.—హా! హా! దైవమా! ఎంతటివారి నెంతకుదించితివి? అయ్యో! వికటీకృతదక్షమైన విధిని నేనేమందును?

నక్ష.—రాజా! అప్పిచ్చెదవా? అనృతమాడెదవా?

హరి.—(తలవంచుకొని మౌనమూనియుండును.)

చంద్రమతి.—

**అనుబంధములు 20—21.**

ఉ॥ మానవనాయకా! ననటమానక నీవిటు చింతఁగుందినన్
మానివరుండు క్రూరతను మానునె? సత్య మిలాతలంబునన్
బూనికనిల్పునే? యశము పూజ్యతఁగాంచునె? బొంకులాడఁగాఁ
బూనుట జాతితెప్పఁగొని భూరిజలాంబుధి నీఁదుటేగదా!

ప్రాణనాథా! ఎటులయినను మంచిమాటలాడి విప్రకుమారునకు బోధించి వారణాశిఁ జేరుదము. అచట ఋణముదీర్చ యత్నింతము

నక్ష.—ఆ! ఆ! ఈయుపాయము బూనితివో? మంచిది. మంచిమాటలకు మామిడికాయలు రాలునా? ఏదీ! మంచిమాటలాడుము. వదలెదనేమో చూడుము?

లోహి.—బ్రాహ్మణకుమారా! ఎన్నిమాటలాడెదవు?

క॥ తడయక విడు నాతండ్రిని
వడుగా! యటు విడువవేని బలవంతముగా
విడిపించెదఁ గట్టును నీ
దుడుకుతనంబునును నొక్కటతోరిగ వినుమా.

నక్షత్రకా! వదలెదవా. వదలవా?

చంద్ర.—(లోహితునిఁ జేరఁదీసి) నాయనా! అతఁడు ద్విజకుమారుఁడు పూజ్యుఁడగునుగాని దండ్యుఁడుగాడు. కావుననే మంచిమాటలాడి విడిపించెద మిన్నకయుండుము.

లోహి.—(వెఱగంది.) అమ్మా! అమ్మా! ఈదిక్కునఁజూడవే. యగ్గిమంటలెటు వ్యాపించి వచ్చుచున్నవి. (నాలుగుదిక్కులుఁజూచి) అమ్మా! నాలుగుదిక్కులనుండి వచ్చుచున్నవిగదే? మేము కాలిపోదుమేమో? అయ్యో?

నక్ష.—(దిగ్గున కట్టువదలిలేచి) అయ్యో! అయ్యో! హరిశ్చంద్రా! అగ్గిమంటలు నాలుగుదిక్కులనుండి వచ్చుచున్నవి. చేరువవచ్చెను. నిండు

ప్రాణముతో నుండునపుడే గాల్చునుగదా? నేనెటుచత్తును? అయ్యో? ఈయగ్నిమంటలనుండి నన్నుఁదప్పించిన నీయప్పుడగను. అయ్యో! వచ్చుచున్నవిరేమొ!

హరి.—ప్రాణేశ్వరీ! ఈదావపావక జ్వాలలు నలుదిక్కులనుండి వ్యాపించుకొని వచ్చుచున్నవి. పాపాత్ములము. కష్టజీవులము. మే మెటులైననేమి? ఈబ్రాహ్మణ కుమారుని ప్రాణంబు రక్షింపవలెను. చంద్రమతీ! ప్రాణసతీ! పుట్టినప్రాణి గిట్టుననునది సహజము. అయ్యో! మునికులాగ్రణి నాతలపై మోపిన ఋణము దీర్పక సత్యంబు ధర నిలుపక ప్రాణంబు వదలనయ్యెనేయని చింతించెద. సతీమణీ! చిచ్చు సమీపించి వచ్చుచున్నయది. నేనిపు డడ్డపడి యగ్నిని నులిమి నా దేహంబు వేల్చెద. అగ్నిదేవుఁడు తృప్తినంది చల్లారును. పిదప నీ బ్రాహ్మణకుమారుని రక్షించి యూరికిఁబంపి యీకుమారునితో నుండుము. అయ్యో! చంద్రమతీ! నీ ఋణానుబంధంబు నేటికిఁ దీరెను.

చంద్ర.—ప్రాణేశ్వరా! ఇంతటిమాటలు మీనుండి వచ్చునని కలనైనఁ దలఁపనైతిని. మిమ్మెడఁబాసి యొకగడియయైన నిస్పృహమి నేమనఁ గలనే? ఈకార్చిచ్చు నేఁజొచ్చెద. నాథా! జన్మ జన్మాంతరములందు మీకు నేభార్యనై యుండునటుల యాశీర్వదింతురని మీపాదంబులకు వందనంబులిడెద.

హరి.—తపస్వీ! ఈబాలుఁడు చిన్నచిలుత. వానికి నీయందు మాలిమి హెచ్చు. సుతపోషణమునకుఁ దల్లి సమర్థురాలగును. తండ్రికి నా శక్తిరాదు. కావున యీతనయుని మోముగనియైనను చిచ్చున దుముకుటకు నాకు సెలవిమ్ము.

చంద్ర.—నాథా! మీమాటలు విన నింపుగావు. పతిలేని సతిజన్మము వ్యర్థమగునుగదా! ఈచిచ్చునకు నడ్డముగ నేఁబడెదను. నన్నుదాఁటి ధీరవతుల గనఁబడు మార్గమునుండి పోవుఁడు.

హరి.—చంద్రమతీ! నీవు నన్ను వదలిపోవుట నాపాలి భాగ్యలక్ష్మి నను వదలిపోవుటగదా? నాబహిఃప్రాణంబవగు నీవు నాసరసనుండు తతినే దరిద్రుఁడనైనను భాగ్యసంపన్నుఁడనని తలంచితి. కటకటా! ఏక కాలంబున మాకెన్నికష్టంబులు సమకూరెను? అయ్యో! దైవమా! ఈశరీర మతిభారము. దుర్భరము. (అనుచు మూర్ఛఁబోయి పడును.)

చంద్ర.—(నక్షత్రక, లోహితులంజూచి) ద్విజకుమారా! నాభర్తమూర్ఛఁదేరక మునుపు నేఁజెప్పునంబడి మీకు మార్గంబు విడిపించెద. భూసురోత్తమా! నాప్రాణపతి లేవఁడేని యీకుమారుని నీ సోదరునిగ భావించి విశ్వామిత్రుని వద్దకుఁజేరి "తపోధనా యీశిశువు మీవంశాంకురము. మంచినను దేల్చినను మీసొమ్ము. పెద్దపెంచితి రేని తండ్రిఋణంబుదీర్పు" నని నాపలుకులుగాఁ బలికి వంశగ్రామణులైన యామునివరులవద్ద వదలుము.

నక్ష.—అమ్మా! నాకిదియొక కాలిసంకలియా? కానిమ్ము.

లోహి.—తల్లీ! నీవెనువెంటనే వచ్చెద.

కం॥ వచ్చెద నీవెనువెంటనె
చొచ్చెద నీచిచ్చు వెఱవ నమ్మా యింతన్
నిచ్చయమిది. నాకానతి
యిచ్చి ననుఁ బోవుమమ్మ యిటనేనుండన్.

చంద్ర.—నాయనా! లోహితా! చిచ్చుఁజొచ్చుటకు నేనేమి పిచ్చిదాననా? నమ్మదిగ నుండుము. అగ్నిని బ్రార్థించెద. (అనుచు నగ్నిముఖమై కరములు జోడించికొని.)

చం॥ పతిహితమెల్ల కాలమును బాయకయుండుదునేని, నామదిన్
పతిపదయుగ్మసేవ నెడఁబాయక సల్పుదునేని, సర్వదా
పతిఁబరమాత్మరూపుగను భావమునందుఁ దలంతునేని, నే
సతినవుదేని, పావకుఁడు చల్వ వహించుచుఁ గాచు నన్నిటన్.

(అనుచు సాష్టాంగ నమస్కారమిడ నగ్ని చల్లారును.)

నక్ష.—హరిశ్చంద్రా! హరిశ్చంద్రా! లెమ్ము. త్వరలో లెమ్ము. బ్రాహ్మణ ప్రభావము గనుము. మిమ్ము నెల్లర రక్షింపుమని నేనగ్నిమంత్ర పఠనం బొనర్చితిని. అగ్ని చల్లారెను. ఆపద తప్పెను.

హరి.—(లేచి) అయ్యో! ఆయగ్నియైన తము నామీదఁ గరుణవహించెనా? కష్టములు ప్రాణాంతములవలకుఁగదా? ప్రాణములతో నాకుఁ గష్టములు దీరెననికొనియుంటిని. "పాపీచిరాయుః" యని యుండ నా ప్రాణములు పోవునా?

లోహి.—నాయనా! నాతల్లి యగ్నిదేవునిఁ బ్రార్థించి చిచ్చార్చెను.

నక్ష.—ఏమీ! నీతల్లి చిచ్చార్చెనా? నీతల్లి యాఁడుది. ఒక మంత్రమైన రాదు చిచ్చార్ప సమర్థురాలా? చచ్చుటకు సిద్ధపడి నిన్ను విశ్వామిత్రులవారివద్దఁ జేర్పుమని నాకుఁ జెప్పిపోయెను గదా? నేనేమో యని దయతలఁచి మనస్సులోనే మంత్రము పఠించుచు మిముఁగాపాడితిని. ఉపకారస్మరణలేక యెదిరించెదవా?

హరి.—భూసురోత్తమా! బాలుఁడు. వానికేమి తెలుసును? ఒక చెక్కునఁ బాలు నొక చెక్కున "యుగ్గు" యున్నవాఁడు. మాశుభము మీయాశీర్వాద ఫలముగదా.

నక్ష.—నిజము. నిజము. ముఖస్తుతి మాటలాడి ఋణము ముంచకు. త్వరలో దెమ్ము.

హరి.—భూసురోత్తమా! ప్రయాణమై త్వరలోఁ గాశీపురము చేరుదము రమ్ము.

(నిష్క్రమము.)

# తృతీయాఙ్కము.



## ప్రథమరంగము.



(కాశి, దేవాలయము.)

హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితుఁడు, నక్షత్రకుఁడు.

విశ్వేశ్వరునిఁ జూచి.

**హరిశ్చంద్రుఁడు.**---

సీ॥ శైలకన్యామనస్సార! సాహస్కార! శరణుసంయమివర! శరణుసాంబ!
శైలరాజోత్తమ శరపీఠటంకార! శరణుసర్వేశ్వర! శరణుదేవ!
శైలధరాంచిత శరహతాసురపుర! శరణుశుభంకర! శరణుశర్వ!
శైలశాత్రవవైరి బాలమృత్యుత్యకుమార! శరణుసర్పాహార! శరణుగిరిశ!

గీ॥ శరణు చంద్రార్ధజూట! పశ్యల్లలాట!
కంఠగతకాలకూట! శ్రీకంఠ! శరణు
శరణువ్యాళకిరీట! వాగ్వరకరోట!
శంకరా! పార్వతీశ్వర! శరణు శరణు.

**చంద్ర.** మ॥ నగజశ్రీకర! నాగహార! నగబాణాకార! నాకీవరా!
జగదాధార! మృగోరుచిహ్నితకరా! సారంగచర్మాంబరా!
నిగమాంతాంచిత మందిరా! శశిధరా! నిర్ధూతరక్షోపురా!
దిగధీశేశ్వర! పార్వతీశ్వర! హరా! దీనావనా! మ్రొక్కెదన్.

**లోహితుడు.**—

అనుబంధము 22.

(అనుచు మధ్యరంగంబునవచ్చి కూర్చుండుదురు.)

**నక్ష.**---ఏమయ్యా! హరిశ్చంద్రా! స్వస్థముగ నారి తేరినవారిబలెఁ గూర్చుంటివి "చేలనున్న కూతలమిన్న" యన్నట్లు రిత్త చేతులతో

మూరలు వేయుచున్నావే? ఋణమిచ్చుమితి నేటితో సమాప్త మాయెను. "దిమ్మిరంగ దీపావళిపండుగ" యనినరీతి నటించుచు న్నావు.

ఉ॥ కూసుమతింబుఁబూని గుడిగుండ్లకు ద్రొక్కిన ద్రవ్యమబ్బునే?
కాసుగడించు మార్గమునుఁ గానఁగఁ బూనవు భూమిపాల! నీ
వీసరణి ఋణంబుఁ దెగనిత్తువొ? నేటికి మాసమయ్యెఁగా
వీసమునైన నివ్వకిటు వీసరఁబుచ్చుచు మోసగించుదే?

ఏమి! మాటలాడవు? మొండిబండవలెఁ గూర్చుంటివి? ఓహో! ఏమి కన్నులెఱ్ఱఁజేసెదవు? ఇన్నిదినంబులు మిన్నకయున్న తప్పుకాఁ బోలు. స్నానసంధ్యావందనంబులు నీటిలోవదలి, జపతపములు బూడిదలోఁగలిపి, విద్యాభ్యాసంగ మరణ్యవాసమునకుఁ బంపి, నిద్రాహారములు వదలి నీవెంట మంచిమాటలాడుచుఁ దిరిగిన ఫల మేమాయెది? ముప్పదిదినంబులు జీతము బత్తెము లేని బంటు దొరికె ననికొంటివేమో? నేను బంటునా? నీకంటిపాపను పొడుచు కంట కము. చాలుచాలు లెమ్ము. నాఋణ మించిపొమ్ము. (అనుచు నీడ్చును.)

హరి.—భూసురవర్యా! ఈశ్వరధ్యానమునయున్న నామనము చలింపఁ జేయుచున్నావే? ఏల యిటుచేసెదవు? ఇంచుక యూరక యుం డుము.

నక్ష.—చాలునయా నీసమాధానపు మాటలు. వినివిని వీను లలసినవి.

సీ॥ అహిభూషణునిసేవ యర్థమిచ్చునె నీకు? ఋణవృద్ధియను విషం బెచ్చుఁగాని
చిత్తజారిపుసేవ విత్తమిచ్చునె నీకుఁ? గామంబుపై నాసఁ గలఁచుఁగాని
భస్మాంగుఁడిచ్చునే బంగరుకాసులు? బూడిదిమైపూత గూడుఁగాని
గజచర్మవసనుఁ డే గతి నీకుధనమిచ్చు? జోలెగా నిడుగాని తోలుతిత్తి.

గీ॥ కాడుబీడుగఁ గలవాఁడు కాసులిడునె?
కాటికాపరిగానుండి చేటుఁదెచ్చు

నిత్యభిక్షుకుఁడటు నీకు నిధులొఁగుఁగు!
లెమ్ము సొమ్మిమ్ము నీదార నమ్మియైన.

అంతేసరి. నీకువెఱవను. ఆలినిఁదాకట్టుఁబెట్టి యర్థమిమ్ము. పుచ్చుకొనునపుడున్న సుఖ మిచ్చునపుడుండునా? "తీయునపుడు దీపావళిపండుగ. ఇచ్చునపుడు కామునిపండుగ" ఇది లోక సహజమైనది. ఇచ్చినవాఁడడిగినపుడు చచ్చినట్టుపడియుండక యెదిరించి మాటలాడెదవా? చాలుచాలు లెమ్ము. ఈశ్వరధ్యానంబున ఋణముతీరదు. జంబుకవాలమున జలధిఁ గొలువనగునా? ఏమీ! హరిశ్చంద్రా! బెల్లముకొట్టిన గుండువలెఁ గూర్చుంటివి? లేచెదవా? ఈత్తునా? లెమ్ము. నీదారనమ్మి తీర్చెదవో? నీసుతునమ్మి తీర్చెదవో? నీవే యమ్ముకొని తీర్చెదవో? యేదోయొకటి త్వరలోఁ జేయుము. ఈ పీనుఁగజాగరము నేఁజేయఁజాలను.

హరి.—నక్షత్రకా! నీమాటలు విన నసహ్యముగనున్నవి. నీవు తరవుకాఁడవు. ముప్పదిదినంబులు నిండువఱకు మిన్నకపడియుండుము. హెచ్చు మాటలాడకు. గడవుమీఱుటకు నిఁక నర్ధదినంబున్నది. అంతవఱకు మాటలాడకు సుమా.

నక్ష.—ఏమోయి హరిశ్చంద్రా! నీనోరు పెద్దదాయెను. తెగించిమాటలాడితివి. ఇఁకఁదెగించి ఋణముగలవేయుదువా యేమి? నీకు నేను వెఱతుననుకొంటివిగా? ఎన్నటికి వెఱవను.

ఉత్సాహ. తగవుకాదటంచు నేను తరవుకాడటంచు నీ
బిగువుఁజూపనేల? నీదు బిరుదులన్ని మానుమా
దిగులుమాని బొంకులాడితినని పల్కుపంపుమా
తెగువఁబూని యాలినమ్మి తెగ ఋణమ్ముదీర్పుమా.

ఓయీ! హరిశ్చంద్రా! బొంకితినని పల్కుము. నిను మరలఁ బల్కరింపను. నాఋణధనమ్మిమ్ము. నాదారి నేఁబోయెద. ఏదియు నొనరింపక గుడ్డునుమ్రింగిన పిల్లివలె గ్రుడ్లువిడుచుచుఁ గూర్చుంటివేని

నాకు సరిపడదు. ఇప్పుడైనను బుద్ధిఁ దెచ్చుకొని యప్పు లేదని పలుకుము. నేఁబోయెద. పోయి బొంకు బొంకుము. నేఁడు నిన్ను వదలను. తలపై ఱాయి మోపెద. కాళ్లు కట్టుకొని కూర్చుండెద. (హరిశ్చంద్రుఁడు వ్యాకులాయత్త చిత్తుఁడై నిట్టూర్పులు విడుచుచుఁ గూర్చుండును.)

చంద్ర.—ప్రాణనాథా! ఏమి యీ చిత్తక్లేశము? ఏమి యీ దీర్ఘాలోచన? అపరిమితమగు ధనం బెప్పటికిఁ దెచ్చెదవు? ఋణము తీర్పకున్న నసత్యమాడినవా రగుదురు కదా? హరిశ్చంద్ర సార్వభౌముం డసత్యమాడెనని యెంతటి యపయశస్సునకుఁ గారణం బగును? అపయశస్సు వచ్చినవారికి వేయుమృత్యువు లేల? "యతో ధర్మ స్తతో జయః" యని పెద్దలు పలుకరా? ఈ దేహము శాశ్వతమా?

ఉ॥ కాయము నిత్యమే? రమణ! కాలము మీఱఁ గిస్సుమాఁగదా?
ప్రాయము నిత్యమే? గురుజరాభరదుర్దశఁ జెంది యుండదే?
హేయము గాదె? "శాశ్వతను హీనసుఖాస్పదమె, సత్యముఁ
బాయఁగ నెట్టివారికిని" పాతకహేతుక మ్మదయ్యెయెన్.

నాథా! నిత్యమైన సత్యము రక్షింపుము. దారాపుత్రాదుల ఋణానుబంధము కలలవంటివని నమ్ముము.

హరి.—నాతీ! సత్యము వదలుదునని నీవు భీతిల్లితివా యేమి? ఈ ప్రాణంబునం దీధరను సత్య మీ హరిశ్చంద్రుఁడు వదలునా?

మ॥ రవిచంద్రగ్రహతారా సులన్నియొకమై రాలున్ గదా! భూరిభూ
భువనంబుల్ వికలంబులై తుమురులై బ్రుంగున్ గదా! దిక్కరుల్
ధృవిసత్త్వంబుఁ దొలంగి నేలఁ బడుచున్ గ్రుంగున్ గదా! నేను ని
క్కువమున్ విడితి నేని. యట్టిమతి నాకున్ గల్గునే? మానినీ!

నక్ష.—అయ్యా! సత్యము వదలవలదని నీభార్య బోధించెను. ఆముద్దుల రాణిమాట మీఱను శక్తిలేక సత్యము వదలనని నీవు నాడితివి. సత్యము వదల నేని ఋణమొవరిత్తురని నీభార్య నడుగఁగూడదా?

నోరుపడిపోయినదియా? ఆయమునుఁజూచిన నీకంతటి భయమా?
ఏదీ! నాఋణము గక్కుము నీపౌరుషముఁ జూచెద?

హరి.—నక్షత్రకా! ఏలయిట్టి కడుపుమండు మాటలాడెదవు? ఇట్టిమా
టలతో నామనంబుఁగలంచి బొంకింపఁజూచెదవా? ఊచిచూచిన
మేరుధరంబు విఱుగునా? "ప్రాణమేవ పరిత్యజ్య సత్యమే వాభి
రక్షతు" యనునది నాకు నిత్యపారాయణము.

నక్ష.—నిజము. నిజము. ఈ ముప్పదిదినములనుండి నాకు నిత్యపారా
యణమైన సంధ్యావందనంబు పోయి నీఋణమంత్ర పారాయణము
పట్టుబడినది ఏదీ! తెమ్ము నాఋణము. అమ్ము నీభార్యను.

చంద్ర.—నాథా! కాలము గడచిపోవుచున్నది. మితిమీఱుకగడియ మీా
తిమేని యసత్యదోషంబు ప్రాప్తిల్లు. కావున వైశ్యమ్మె నన్ను దా
సిగనమ్మి ఋణముదీర్పుము. సందియమువలదు. లెమ్ము. వెన్న చేత
నిడికొని నేతికి వెదుకనేల? నాథా! కన్నీరుగార్చెదవేల?

హరి.—(హాయని కూలంబడి.) హా! హా! కట్టడిదైవమా! ఎట్టి కఠోర
వాక్యజాలంబులు నాకర్ణంబులఁదూర్చితివి? దుస్సహంబులగు
వచనంబులు వినియును నాప్రాణంబులు నిలిచినవిగదా? ఘోరా!
హరిశ్చంద్రా! నీగుండె యక్కటికమించుకైనఁ గనరాని కటిక
వానిగుండియ యనుటకు నిస్సందేహము. అయ్యో! అట్టివాఁడయి
నను తనభార్యను వీధిఁ బెట్టి విక్రయించునా? అగ్నిసాక్షిగ "అగ్ని
ముఖావై దేవా" యనురీతి దైవసాక్షిగ పంచభూతములసాక్షిగ
దేవముని ఋషి గురుగణంబుల సాక్షిగ సూర్యచంద్రుల సాక్షిగ
నష్టదిక్పాలకుల సాక్షిగ భూమ్యంతరిక్షవాసుల సాక్షిగఁ బ్రాణాం
తమువరకు భరించెదనని కఠిన ప్రమాణంబు లాచరించి స్వీకరించిన
దారను సుగుణోదారను మోహనసుందరాకారను సత్పథవిచారను
ప్రశస్తగుణవిస్తారను మంగళాచారను క్రూరుఁడనై వీధినుంచి వెలకు

నిచ్చు దురాత్ముఁడనగుదునా? అంత పాపాత్ముఁడనా? అంతటికఠిన చిత్తుఁడనా? అంతటి నిర్భాగ్యుఁడనా? హా! హా! శ్రీహరీ.

ఉ॥ విశ్వజనీనుఁడై సకలవిశ్వము సౌఖ్యముగాను నేలుచున్
శాశ్వతకీర్తిచంద్రిక దిశావలయంబునఁ దాండవింపఁగా
నశ్వరహీనతన్ వెలసినట్టి యుదారచరిత్రుఁడకటా!
యీశ్వరు ప్రాపుదప్పి యిటు హీనదశన్ బడి కుందనయ్యెఁగా.

హా! దుర్భరము. దుర్భర వికారము.

నక్ష.—హా! హా! దుర్భరము. దుర్భరము ఋణము. అకటకటా! దుర్వ్రణము దుర్వ్రణము ఋణము. తెమ్మా! హరిశ్చంద్రా! నా ఋణ ధనము.

హరి.—నక్షత్రకా! ఋణము దుర్వ్రణము. దుర్భరము. దుష్ప్రసహ మని నాకిదివఱకుఁ దెలియదాయెను.

మ॥ గణనీయంబగు నెంతకష్టమయినన్ క్ష్మాభారమున్, భూరి ధా
రణీభృద్భారము, దోర్బలంబుననో, ఘోరంబౌ తపశ్శక్తినో,
ఫణివంశాగ్రణిహారదివ్యవరసంపల్లబ్ధమౌ బల్మినో,
ఋణభారం బమితం బగణ్య మసహం బెవ్వానికిన్ ధాత్రిలోన్.

ఋణభారంబసహ్యము. అసహము. దుర్భరము.

నక్ష.—కావున, గనుక, కాన. ఏమి నీవు ఋణము దీర్పననియెదవా?

చంద్ర.—ప్రాణనాథా! ఈభూసురాధమునితో మాటలేల? మాట మాటకు మముఁబొడచి మనముఁగలఁచుచుండును. నిన్నెట్టులైన బొంకింప యత్నించుచున్నవాఁడు. నాథా! భార్యను పిలచెదనే యను సందేహము నీకువలదు. భార్యాపుత్రులు నీసొమ్ములు. వారిని విక్రయింప నీకేదోషమురాదు.

హరి.—చంద్రమతీ! ప్రాణేశ్వరీ! ప్రాణప్రియా! నాబహిః ప్రాణమా!

సీ॥ శుద్ధాంతసౌభాగ్య సుఖమందు నీవయా వరసేవకోత్తమా! పద్మగంధ!
రమణీయ చీనాంబరములం గట్టెడునీవు మలినవస్త్రములంటఁగలవె? మగువ!
పవళించి కనుసన్నఁబడయు సేర్చినీవు పరులయాజ్ఞకు లొగ్గి జరుగఁగలవె?
కలమాన్న పాయసంబులు రుచింపని నీకు కలికుటన్నము రుచిగలుగు నెటుల!
గీ॥ దాసఁగు లెవ్వరు నెఱుఁగని కుసుమదేహ
వెటుల పరగృహ కష్టాబ్ధి నీఁదఁగలవు!
యెటులనరవుదు పను సంకటము నోర్వఁ
గలవు? కోమలి యెట్టులొప్పఁగలమునిన్ను!

కోమలీ! ఆమాటలిఁక వినఁజాల. నీవు లేక నేఁబ్రదుకఁజాల.

చంద్ర.——నాథా! ఇదియేమి వ్యామోహము? పూర్వజన్మార్జిత కర్మఫలంబు మన మనుభవింపక తప్పునా? "అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" అని విధి లేదా? ఋణానుబంధములు కలలవంటివి కావా? దుర్నీతిక్రియాలోలుఁడగుటకంటెను దురితము కలదా? దేహము వాయుసంచలిత దీపిక, యెప్పుడారునో తెలియదు. జలధిలోని తరంగము, యేనిమిషమున మునిఁగిపోవునో యెఱుంగము. పుత్రమిత్ర వనితాగారాది సంయోగములు చంద్రకళలు. ఎప్పుడు తరఁగిపోవునో యెప్పుడు మేఘాచ్ఛాదితములై మఱుఁగుబడునో తెలియదు. జన్మజరారోగ విపత్తిమరణంబులను దుర్దశలకు జిక్కిన శారీరసంబంధములు నిత్యములనినమ్మి వాని వియోగమునకు దుఃఖింపనగునా? ఏల యీవ్యామోహము? జన్మజన్మాంతర సంచిత దురితఫలంబు లివ్విధీరీతి ననుభవింపవలెనని బ్రహ్మ మన నొసట వ్రాసియుండ మనము దప్పింపఁగలమా? ప్రాణపతీ! ఇది నీకొక కష్టమని యెన్నకు. కష్టము విషమూలమయినను కొన్నిసమయములయందు మధురఫలంబు నిచ్చును. నాథా! "జాతస్య మరణం ధ్రువం" యనుట నిస్సందేహముగదా. శరీరము బాయునప్పుడెవ రుండి యేమిఫలము? ఏమియుండి యేమి ఫలము?

క॥ నిలుచుసిరియింట, నిలుతురు
చెలులుఁ బంధువులు కాటిచెంతను, నరుఁడీ
యిలఁ జేసిన కర్మంబుల
ఫలములు వెనువెంటనంటి, పాయక యుండున్.

హరి.—మానినీమణీ! నీయంతటి సుగుణరాశిని, నీయంతటి దృఢవైరాగ్య చిత్తను, నీయంతటి ధనధైర్యోత్సాహ ఖనిని, నీయంతటి పరోపకారనిరతను, నీయంతటి పుణ్యచరితను, నేనెందునువిని యెఱుగను కని యెఱుగను. ప్రాణేశ్వరీ! ప్రాణేశ్వరీ! ఇంతటి సుగుణసంపన్నను నిన్ను కటికగుండియనై యమ్ముటకంటెను నన్ను నేనే యమ్ముకొనియెద.

నక్ష.—హరిశ్చంద్రా! నీవు పిచ్చివాఁడవని నాకుఁదోఁచెడు. వ్యవహార ధర్మంబు నీకించుకైనఁ దెలియదు. ఏరీతి నంతటి రాజ్యం బేలితివో? నీకు మంచి మంత్రియుండెను కావున నీపని చక్కఁబడెను. కాదేని యెప్పుడో రాజ్యము పోవుచుండెను. ఓరీ! వెఱ్ఱిదొరా! నీభార్య నీలోఁ జేరినదిగదా! నిన్ను నీవు విక్రయించుకొనినఁ గొనినవాని నీ బేరములోనే నీభార్యసైతము దొరకును. అట్టి బేరము నీకునష్టము గదా? చక్కఁగ నాలోచింపుము. ఇట్టివాటికి గ్రంథవిశేషసజనిత వైదుష్యముచాలదు. సర్వతోముఖంబగు లోకానుభవ జ్ఞానంబు కావలెను. అది నీకు సున్న.

చంద్ర.—నాధా! నిన్ను నీవమ్ముకొనుట దూష్యము. నీదాసిని నేను. దాసినమ్ముట దోషముకాదు. కావున నన్ను విక్రయించి ఋషిఋణమ్ముదీర్చి ధన్యుఁడవుగమ్ము. లెమ్ము. కాలము మీఱుచున్నది.

హరి.—హా! హా! ప్రాణేశ్వరీ! కటికనై నిన్ను విక్రయింపవలెను గదా? విక్రయించెద. (ఆలోచించి) ధర్మపత్నీ విక్రయము ధర్మవిరుద్ధము. ధర్మముద్ధరించుటకై దారనైన విక్రయింపఁదగునది ధర్మము. ఈ విరుద్ధశాస్త్రార్థంబు సూక్ష్మదృష్టినిఁజూచ ధర్మము స్థాపించుటకై

యెంతటి పనినైనను జేయనగునని సారాంశ మేర్పడుచున్నది. కావున సత్యధర్మ మీాధరస్థాపించుటకై నాధర్మపత్ని నమ్మెద. కటి కనై విక్రయించెద. క్రూరుఁడనై పరులకుఁ బట్టియిచ్చెద. విరక్తిల విత్రచే ననురాగ పాశంబు ఛేదించెద.

ద్విపద. భూసురులార! యో భూభుజులార!
వాసిఁగాంచిన వణిగ్వరులార! పాద
సంభవులార! యో సజ్జనులార!
కుంభినీధవురాణి కులసతిదీనిఁ
గొనుఁడయ్య యెనిమిదికోట్ల ధనంబు
మునిఋణమును దీర్ప మున్నుగా నిచ్చి
కలనైన బొంకని కడుపుణ్యశీల
కలుష మెఱుంగని గణిత సుశీల
తనవలెసర్వభూతములను గనుచు
వినయవివేకయై విలసిల్లుచాన
పతిహితవ్రతి భూరిపావనచరిత
పతిభక్తినవని పరమవిఖ్యాత
మానముసందేహంబు మానుచు దీనిఁ
గొనుఁడయ్య వరవుడు కొలువుసేయఁగను.

నక్ష.—హరిశ్చంద్రా! నీవు కన్నీరుగార్చుచు నేమేమో గొణుగుచున్నావు. జనులు నీకేమో యీాపదసంభవించెను పాపమని తాము నేడ్చుచున్నారు. నీమాటలు నీయేడ్పులో మునిఁగిపోయినవి. చక్కఁగ నేడ్పుచాలించి యెత్తియెత్తి దీర్ఘాలుతీసి యందఱికినిఁ దెలియు లాగునఁ బాటఁబాడుము.

హరి.—నక్షత్రకా! నావశముగాదు. నీవే విక్రయింపుము.

నక్ష.—(మంచిది) కూడిన జనులందఱు వినుఁడయ్యా! చక్కఁగవినుఁడి. వేరము కుదిరినపిదప వినలేదనకుఁడి. ఈవనిత హరిశ్చంద్రసార్వభౌముని భార్య. పతివ్రతయని దానిభర్తవచించెదు. ఈహరిశ్చంద్రుఁడు,

విశ్వామిత్రునికి నెనిమిదికోట్ల ధనము ఋణమివ్వవలెను. ఇవ్వఁదగిన ధనిలేఁడు. కావున తనభార్యను దాసిగానమ్మెదు. ఇచట నేరయిన ధనికులుండినచోఁ గొననగు. మంచిసొమ్మిది. చేయిజారిపోయిన మరల దొరకదు. రండి. వచ్చువారందఱువచ్చి బేరమాడుఁడి.

మొదటి పౌరుఁడు—(హరిశ్చంద్రునిఁజూచి) అయ్యా! హరిశ్చంద్రా! ఇది నీకులాంగనయా?

రెండవ పౌరుఁడు.—కులాంగనగానుండదు. ధర్మపత్నినమ్ము చాండాలురుగలరా!

నక్ష.—ఏమయ్యా! హరిశ్చంద్రా! బేరమాడువారు సొమ్మునుగుఱించి యడుగు ప్రశ్నలకు బదులిడకున్న బేరమెట్లు కుదురును? ఇది నీ సొమ్మగునో కాదోయని సందేహపడుచున్నవారు?

(కాలకౌశికుని ప్రవేశము.)

కాల.—ఏమయ్యాయిది? యింతగద్దలము. బ్రాహ్మణుఁడు వేదవిదుఁడు సర్వశాస్త్రార్థవేది యాయజూకుఁడు నేను వచ్చునది చూచియు నన్ను సత్కరింపక దారిపిడువక నిలచినారు. వీరిని నాకఱ్ఱతో మోఁదెద. చాండాలులారా దారివదలరా? (అనుచు నొకరిరువురి మోఁదును.) అందఱు దారివదలుదురు.

హరి.—(లేచి) బ్రాహ్మణోత్తమా! అభివందనంబు లాచరించెద.

కాల.—అయ్యా! నీవెవఁడవు? నీకులశీలములుఁ దెలియక నే నెట్లు లాశీర్వదింతును?

హరిశ్చంద్రుఁడు.—

మ॥ జలజాక్షారకులోత్తమా! వినుమ నాచారిత్రమున్ దల్పెదన్
జలరుణ్మిత్ర కులోద్భవుండను హరిశ్చంద్రుఁడ, నీయింతి, నా
కులభామామణి, మాగదఋణకు నేఁ గ్రూరుఁడనై యమ్మెదన్
వెలయివ్వన్ గలరేని దీనిఁ గొనుఁడీ, శీవేగ శంకింపకన్.

కాల.—ఏమీ! ఏమీ! ఇతఁడు హరిశ్చంద్రసార్వభౌముఁడా! నే నమ్మను. నే నమ్మను. మాయబ్బ మీయబ్బలతోఁడు నమ్మను. చెప్పువానికి నీకు బుద్ధిలేకున్న వినువానికి నాకుబుద్ధిలేదా! నే నమ్మను. నీరీతిఁ జూచిన నీవెవఁడవో దొంగవని తోఁచెను ఓరీ! బందికాండ్రమేటీ మేనికండలు నిండుగాను బలసి రాక్షసునిబలె శక్తికలిగి నిండు వయసున నుండునీవు మడకలుదున్ని బ్రదుకఁగూడదా? కూలిచేసి కూడు సంపాదించుకొనఁ గూడదా? పసులగాచు పనిచేయఁగూడదా? నీళ్లు మోయఁగూడదా? వంటచేయఁగూడదా? ఆలినమ్ముట కంటెను జోలెవేసుకొని బిక్షమెత్తరాదా? నిజముగ నిది నీభార్య కాదు. భార్యయగునేని యెంతటి మందుఁడైన వీధిఁబెట్టి విక్రయించునా? దోవలోఁబోవుదానిని దొంగిలించుకొనివచ్చి దొరతనము వారికిఁ దెలుపక యమ్ముకొని పోఁజూచెదవు కాఁబోలు? ఓరీ! కడతేరినదొంగా! తలారు లెఱిఁగిరేని నిన్నుఁ గొఱతవేయుదురు సుమా! ఈ తెరువ నిండు వదలి పరుగిడుము. లెమ్ము. వైళమ్మె పొమ్ము.

చంద్ర.—బ్రాహ్మణోత్తమా! అతఁడు హరిశ్చంద్రసార్వభౌముఁడనునది నిజము. నే నతనిభార్య చంద్రమతిని. రాజ్యంబెల్ల విశ్వామిత్రునకు ధారవోసి యంతకుముందా మునికినిడిన యాగదక్షిణ ఋణమును దీర్పను ధనములేక దాసిగ నన్నమ్ముచున్నవాఁడు. కఠినభాషణములచే మీరేల యా సార్వభౌముని మానసంబుగలంచెదరు?

కాల.—హా! హా! ఇతఁడు రాజేనా? ఓయీ హరిశ్చంద్రా!

ఉ॥ వాలునుచేతఁబూని నిడువాలుఁగ వాలిన వైరివీరులన్
భూలలనామనోహరులు పూజ్యులు వారిజయించి వారప్ర
వ్యాలయముల్ హరించితిది యద్భుతము రాజులపాడి యెందునన్
పాలస! యీవిధంబు నిజభామల వీధిని నమ్మఁజూచిరే!

హరిశ్చంద్రా! కులభామినిని విక్రయించునంతటికుందు రాజాధిరాజ వగు నీకుఁ బ్రాప్తించెనేయని చింతించెద. ఏమి చింతించిన నేమి

ప్రయోజనము? అందఱు నార్చువారేగాని తీర్చువారుకారు. అయ్యో! నీవు బాగుగనుండినపు డెందఱు నీయుపకృతినందిరి? ఎందరు నీవేయింద్రుఁడు నీవే చంద్రుఁడని ముఖస్తుతిమాటలాడి నీ సొమ్మునొల్లఁగొట్టిరి? నీవు పిచ్చివాఁడవు యాచకులఁ బొగడికలు మెచ్చి బిచ్చాలరాజైతివి. నీచే నుపకృతినందినవారొక్కరైనను నేఁడువచ్చి నినోదార్పఁజాలిరే? దుర్మార్గకాలమిది. ఉపకారస్మరణయించుకైనను జనులయందులేదు నీ హీనదశఁజూచి నాకు జాలియయ్యెడు. కొన్ని హితములు నీకుపదేశింపఁదలంచితిని. వాని ననుసరించితివేని నీవు బాగుపడియెదవు. స్త్రీవిత్తము విషము కావుననే "స్త్రీవిత్త మధమాధమం" యని పెద్దలు పలికిరి

హరి.—స్వామీ! యాహితము లెవ్వి?

కాల.—నేను మూఁడు హితములుపదేశించెద అందున మొదటిది. "ఈ వడుగుచేతికిధనమిచ్చితిని వాఁడేమిచేసునో" యనుము. నిన్నవరేమి సేయుదురు? ఇచ్చినది నిజమని స్వహస్తాంకనములో నేఁబలికెద. దానికించుకధనము నాకిమ్ము. మఱల నీకుఁ బ్రాయశ్చిత్తముపెట్టించి శుద్ధిఁజేసెద. బ్రాహ్మణమంత్ర ప్రభావంబు నీకేమి తెలియదా? శాంచనము కర్మవిమోచనముగదా? ఏమి హరిశ్చంద్రా! మోమటుదిప్పితివి? ఈ హితము నీమనమునకు నెక్కదాయెనేమో? పోనిమ్ము. రెండవహితము వినుము. నీవు దరిద్రుఁడవు. అప్పు కొండంతయున్నది. "తీర్చెదను తీర్చెదను" యనిచెప్పి తుదకు నీసరసనిపుడుండిన కాసు వీసము నావద్దనుంచి ఋణము నేనీయలేనని మొండికిఁబడుము. కొన్ని దినంబులుజూచి వేసరి ఋణమిచ్చినవారే యంతధనంబు మునిఁగి పోయెనని కుళ్లి కుళ్లిచత్తురు. పిదపఁ బ్రాయశ్చిత్తమునఁ బరిశుద్ధుఁడ వగుదువు. ఇదియు నీకు హితమని తోఁపదేని నీప్రాణప్రియను నిచ్చట వదలి పలాయనమంత్రంబు పఠింపుము.

చంద్ర.—బ్రాహ్మణోత్తమా! అనుకూలశత్రువవయి నీవీరీతి నీతిపథవిహీనుఁడవై పలుకుట యుచితంబుగాదు. నీకు ధనముంటేనేని దానిఁ గనుఁగొనుము. కాదేని నీదారిని నీవుపొమ్ము. హెచ్చుమాటలు వలదు.

కాల.—తెలిసెనా! నీవెంతకైనఁ దెగించినదానవు. నీతో మాటలేల?

హరి.—బ్రాహ్మణోత్తమా! నీవు బీదవాఁడవు. ఇంతధనంబు నీకెచట నుండి వచ్చును? మాటలాడక పొమ్ము.

కాల.—ఏమీ! హరిశ్చంద్రా! ఎంతమాటలాడితివి? సూర్యవంశజులు భూసురులవచనంబులు వేదవచనంబులని స్వీకరించుచుండిరిగాని నీట్లు తిరస్కరించుచుండలేదు. నీకుఁ జెడుకాలముగనుక యీచెడ్డబుద్ధి పుట్టినది. ఓరీ! రాజాధమా! నేను బీదవాఁడనా? అరుణోదయంబుననే లేచి యాయావారము లెత్తి పురిటిబడిన పీనుఁగులనెల్ల ధనమునకై మోసి శవముల నోటికాసునైతముగాని పంచాంగంబులుచెప్పి యుపకర్మలు చేయించి యార్జించిన ధనమును వడ్డికై జూదకాండ్ర కిచ్చి వారితో నొకటికి నూరుగ రాఁబట్టుకొని కాసులకొలది ధనము దేశదేశముల నుంచినాను. ఈచింపుదుగుడ్డలుజూచి నేను పేదవాఁడనని తలంచితివి కాఁబోలు....ఆ....నన్ను పేదవాఁడనియెదవా? ఆ....ఆ....ఏదీ నీభార్యకుఁ గ్రయమెంత? పలుకుము. నీకు లేనిమర్యాద నాకేమి? చల్లకువచ్చి ముంతదాచనేల? చెప్పుము. ఎంతధనము గావలెను?

హరి.—అయ్యా! ఎనిమిదికోట్ల బంగరు కాసులు.

కాల.—ఇంతేగదా! మంచిది. ఇచ్చెద. ఎదుటయుండునదే నాయిల్లు, రమ్ము.

హరి.—నక్షత్రకా! ఈభూసురోత్తముఁ డిచ్చుధనంబు పుచ్చుకొనుము.

నక్ష.—విశ్వామిత్రులవెంట వెనుక నేఁ గాశీవచ్చినపు డీక్షేత్రవాసుల యింటనే దిగియుంటిమి. వీరిది మంచిమర్యాదగల కుటుంబము. నాకు

ధనమువచ్చినట్లు. (కాలకౌశికుఁజూచి) ఏమండీ! ధనము నాకీసాయంకాల మివ్వవలెను. మీయింటికివచ్చెద.

కాల.—(చంద్రమతిఁజూచి) దానీ వెళ్లుము. వెళ్లుము. ఆలస్యమేల?

చంద్ర.—బ్రాహ్మణోత్తమా! ఇంచుకనిలువుము. నాప్రాణభర్త పాదారవిందములకు నమస్కరించి వచ్చెద.

అనుబంధము 28.

(హరిశ్చంద్రునిఁజూచి) నాథా! నాథా! అటులేల మోము వంచుకొని కూర్చుంటివి? మోమెత్తుము. నాథా! ప్రాణనాథా! మనోహరా! నాకనుజ్ఞ యిమ్ము. దాస్యవృత్తికిఁ జనవలయు.

హరి.—(నిట్టూర్పు నిగుడించుచు లేచి) హా! ధర్మపత్నీ విక్రయితా? కులాంగనా ధర్మదూషకా! నీవిఁకను మొండివై ప్రాణంబున నిలచితివియా? సమస్తవైరి కంఠావహారక దక్షమైన నీకరవాలంబు నీకంఠంబుఁద్రుంపదా? ఎటులద్రుంపదు? చూచెద. (అనుచుఁ గరవాలమెత్తును.)

చంద్ర.—నాథా! ఏమి? ఇంతటిదురితంబునకు నుద్యమించితివి? వలదీ సాహసము. ఋణానుబంధమున్న మరల మనముగూడెదము. నాథా! నాకనుజ్ఞ యిమ్ము పోయివచ్చెద.

హరి.—(కన్నీరుగార్చుచు) హా! విధీ! హా! పాపవిధీ! సమస్తపారావారపరీతోదారధరాభారదక్షరాజన్యకోటీరమణికోటివిరాజమాన రుచిరాజినీరాజిత పదరాజీవుఁడగు సార్వభౌముని కులసతి పరసేవకు దాసియైనిలుచు హీనస్థితిఁ దెచ్చితివియా? అయ్యో! దుష్కర్మమా! అనన్యసామాన్యవదాన్యధన్యుఁడగు రాజన్యుని ధర్మపత్నిని దాస్యవృత్తికి దించితివియా? హా! హా! విధికృతంబు దుర్వారంబు. ప్రాకృత దుష్కృతఫలంబు దురత్యయంబు. హా! రమణీ! రమణీ! కటో

మణీ! సతీమణీ! నీవియోగంబు నాకనల సంయోగంబు. ప్రాణేశ్వరీ! ప్రళయకాల పవమాన ప్రేరిత పవనసఖశిఖాసఖంబగు మంటలనైన నోర్తునుగాని యీదుర్భర వియోగదావాగ్నిభరమోపను. సతీమణీ!

సీ॥ రాజ్యలక్ష్మిని మునిరాజున కొసఁగితి దానికై వ్యసనంబుఁ దాల్పనైతి
కాంతారములయందుఁ గలఁతలఁ జిక్కితి దుఃఖమద్దియటంచుఁ దోఁపదయ్యె
నీయనీరంబుఁ గుమారుఁడు వెతఁగుంద నింతి! నే నింతటి వంతఁగుంద
భూసురార్భకుఁ డెన్ని చెడుపు మాటలాడె మగువరో! వానికై పొగలనైతి.

గీ॥ సరసిజానన! నీవు నాసరసనుండ
గష్టములునిండు సుఖములై కడురహించె
నీవియోగము సైరించి నిలువఁగలనె
నీరజానన మనుదారి దూరమయ్యె.

ప్రాణపతీ! నినుఁబాసి నే బ్రదుకను.

కౌల.—ఏమయ్యా! భార్యాభర్తల ముచ్చటలు ముగిసెనా? ముగియ వా? ఎంతకాలము నేఁగాచియుండవలెను? నేరాఁదడసితినని నా భార్య నన్ను వెదకుచుండును. మీరేమి హాయిగ వత్సరములకొలది ముచ్చటలాడుచుందురు.

సత్య.—అయ్యా! కాలకౌశికా! ఇంచుక నెమ్మదించుము. నీసొమ్మెచ్చటికిఁ బోవదు. నేఁబూటకాపుగా నుండెద.

కౌల.—కూడదు. కూడదు. నీదేమిపోవును. పైనఁగూర్చుండి కనుబొమ లెగరవేసెదవు. ఆఁకలిగ్రమ్మింగువానికి నాకుఁగష్టము. నాభార్యతో చీవాట్లు నీవుతినియెదవా? (చంద్రమతిఁ జూచి) దాసీ! ఈమూట తల పై నిడికొని వెళ్లుము. కాదేని యీకఱ్ఱతోఁ బడఁజెచ్చెద.

చంద్ర.—నాథా! పోయివచ్చెద. తెలిసీతెలియక నే నన్నఁడేని తప్పిద్ధమేని యొనర్చియుండిన క్షమింపుము.

కాల.—మంచిదాయెతే. క్షమించును. ఒకవేళ క్షమింపఁడేని నిన్నేమి చేయఁగలఁడు?

చంద్ర.—నాథా! పోయివచ్చెద. (అనుచు నడవఁబాదముంచును.)

అనుబంధము 24.

కాల.—దాసీ! ఈమూట నీయబ్బ యెవఁడు మోయవలెను? తలపై నెత్తికొమ్ము.

లోహి.—అమ్మా! నాతలపై నిడుము. నేనెత్తుకొని వచ్చెద.

చంద్ర.—నాయనా! నాకు నీఋణానుబంధంబు తీరెను. నీతండ్రి నిన్నుఁ గాపాడును. వినయ విధేయతనేర్చి కులశీలంబులు మానక సత్యంబు దప్పక కష్టములోర్చి బ్రదుకుము. నీతండ్రినిఁ జేరి సుఖముగనుండుము.

కాల.—ఏమీ! ఏమేమీ! ఎట్టెట్టూ! ఏమిచిత్రమిది! పిల్ల తల్లికిఁ జేరినవాఁడుగదా? నిన్ను దాసిగాఁ గొనిన వెలలో నీపిల్లవాఁడు చేరెను. వాఁడేల యిచట నిలువవలెను? ఇద్దఱు వెళ్లుఁడీ.

హరి.—ఏమీ! బ్రాహ్మణోత్తమా! అధర్మవృత్తికి లోఁబడియెదవు? నా భార్యను విక్రయించినపుడు నాతనయుని పేరు నుడువనుగదా?

కాల.—ఇట్టివ్యవహార ధర్మమెఱిఁగినవాఁడవు నీవుకావుననే రాజ్యము గోలుపోయి యీలాగున నమ్ముకొంటివి. నీవు నీభార్యను విక్రయించునపుడు నాతనయుఁ డావెలలోఁ జేరఁడని పలికితివియా? లేదుకదా? నోరు మూసికొని యూరకయుండుము.

హరి.—విప్రవరా! నీమాట యధర్మము. నేనీబాలుని వదలను.

కాల.—రాజా! నే నీ కుమారుని విడువను.

నక్ష.—ఏమయ్యా! కాలకౌశికా! ఎంత దుడుకొనరించెదవు? హరిశ్చంద్రుఁ డధర్మవృత్తికి లోఁబడునా? మితిమీఱితినను భీతిచే భార్య నమ్మినవాఁ డన్యాయవృత్తి నవలంబించునా? సత్యవాదియతఁడు

వుణ్యాత్ముఁడు. మీకలఁతల కారణంబు వింటిని. మీరిరువురు నా న్యాయనిర్ధారణంబునకు బద్ధులగుదురేని నాకుఁదోఁచిన ధర్మంబు నేఁ దెలిపెద.

హరి.—నే బద్ధుఁడను.

కాల.—అయ్యా! నీవు ప్రపంచవ్యవహార ధర్మంబు నేర్చితివో నేర్వవో?

నక్ష.—చక్కఁగ నేర్చినాను. తలక్రిందుగఁ జదివినాను.

కాల.—అటులైన నేను బద్ధుఁడ.

నక్ష.—(ఆలోచించి క్రిందమీఁదుగఁజూచి) (స్వగత) దీనియమ్మకడుపు మండా! యెట్టిధర్మసూక్ష్మంబిది? క్షేత్రము ప్రాధాన్యమా బీజము ప్రాధాన్యమాయని తర్కశాస్త్రరీత్యా పర్యాలోచనచేయ నాద నుభయప్రాధాన్యత సిద్ధమగుచున్నది. వ్యాకరణశాస్త్రమునుబట్టి యు శబ్దతత్వముఁబట్టియుఁజూడ నాకొక్కకయూరి కొంకరొకరికిఁ ప్రాధాన్యతఁ గలుగుచున్నది. మఱియే శాస్త్రమునుఁబట్టి చూచినను సందేహనివృత్తికాదు. అయ్యో! ఏల యీ న్యాయనిర్ధారణమునకు నేనియ్యకొంటిని? హా! హా! ఒకశాస్త్రము జ్ఞప్తివచ్చెను. పశువు లమ్మువారు దూడ గొప్పదికాకమునుపు తల్లి వెలలోనిదేయని తర్క మేర్పఱచినారు. ఇదియే నా నిర్ధారణము.

ఏమయ్యా! కాలకౌశికా! హరిశ్చంద్రా! నాకు సందేహనివృత్తియయి నది. తల్లినిఁగొనినవానికే పసిబిడ్డచేరవలెను.

కాల.—ఈ నక్షత్రకుఁడు నూతనధర్మదేవత. నిస్సందేహమిది.

హరి.—అయ్యా! కారణమేమి?

నక్ష.—కారణములుచెప్పి నిన్నుసమ్మతింపఁజేయునది నాపనికాదు.

హరి.—ఇది నాదురదృష్టము.

కాల.—దాసీ! ఇఁకనూటతొత్తువు. పైకెత్తువెళ్లెదము.

చంద్ర.—(లోహితునిఁజూచి) కుమారా! నీతండ్రిగారికి నమస్కరించి వారి దీవనలందిరమ్ము.

అనుబంధము 25.

లోహి.—(హరిశ్చంద్రునిఁ జేరి) నాయనా! వందనంబులిడెద. దీవనలిమ్ము.

హరి.—(కన్నీరుగార్చుచు. ముద్దిడి కౌఁగిలించుకొని) హా! తనయా! వినయసముదంచితతనయా! రాజ్యభారవశంబున నొక్కదినంబైన సదయహృదయుఁడనై నినుఁజేరఁదీసి చందమామనుబోలు నీముద్దుమోమును తనివిదీరఁగాంచనైతినిగదా? అయ్యో! పుత్రా! సమస్తబంధుజనవనచైత్రా! నీకుసుమకోమలగాత్రంబు నాశరీరంబునఁ గప్పికొని కౌఁగిలించి ముద్దిడి యొక్కనాఁడైనను పరిపూర్ణానందుఁడఁగా నైతినిఁగదా?

సీ॥ తనయా! నీమోమును దనియఁగాననుగాని, కానలో నీవెతల్గంటినన్న
కౌతుక! భూషలునీకు నిడఁగనైతినిఁగాని, యడవులనిడుముల నిడితినన్న
కరుణచే నినుఁబెంచి కావనైతినిఁగాని, చెఱుగులెన్నియొకూర్చి చెడితినన్న
నందనా! రాజ్యాభిషేకంబుఁ జేయనుగాని, యితరులకొలువున నిడితినన్న

గీ॥ అన్న! రావన్న! ముద్దునాయన్న! యెన్ని
పన్నములు చిన్నవయసునఁ బడితివన్న?
నన్ను మఱవకుమన్న! నీకన్నతల్లి
మన్ననల నంది మనుమన్న! కన్నతండ్రి!

కాల.—నాగ్రహచారమిది. ఈయేడ్పుఁ గోళ్లకేకమేల చేసితినో? ఇచట ఏరియేడ్పుచూతునా? ఇంటికిపోయినక్షణమే నేనేడ్తునా? (చంద్రమతిఁజూచి) తొత్తా! త్వరలో వెడలుము. బైసిమాలిన వైసికములు సేయకుము.

చంద్ర.—నాథా! పోయివచ్చెదను.

అనుబంధము 26.

లోహి.—నాయనా! పోయివచ్చెద.

నక్ష.—కాలకౌశికా! సాయంకాలమునకు వచ్చెద. ఆధనము నాసొమ్ము సుమా. మాగురువులకుఁ జెల్లఁదగినదికాదు.

హరి.—ఏమయ్యా! నక్షత్రకా! ఆమాటలాడెదవు? విశ్వామిత్రులవారి ఋణముక్కై యిచ్చినసొమ్మది.

నక్ష.—ఓయీ పిచ్చి! నీకులమున నెవ్వఁడైనను తరవు కాంత్రపని చేసి యుండినచో నీకీధర్మము తెలియుచుండెను. నేనిన్నిదినంబులు నీయొద్ద బత్తెములేని కొలువుసేసితి నను గొంటివియా? నేనేమి నీపినతండ్రి పెత్తండ్రి కొడుకునా?

హరి.—అయ్యా! నీవు నీగురువుల కార్యార్థము నావెంటనచ్చితివి. నే నేల బత్తెమిన్వవలెను?

నక్ష.—ఏమయ్యా! నీయెదుటనే దినము కాలుకోటివరహాలిచ్చినను వారకువాఁడు కాడని నన్నుఁజూపి నాగురువు పలుకలేదా? "నాజీతము నీవిత్తునని" ననుఁజేరఁదీసి చెవిలోఁబలుకలేదా? చదువులు వేదపాఠము స్నానజప సంధ్యావందనంబులు వదలి యెండ వేడిమికి వాడి పగుగ్గె గుట్టలుగట్టులు తిరుగుచు శీర్ణపర్ణము లాహారముగఁ గొనుచు గుడిగుండ్లు పాడిండ్లు గుహాలు వసతులుఁగాఁజేసికొని దాసఁగులు గుడిచినది మఱచితివియా? జీతవాతము లేక వాతాతపవర్షంబులఁజిక్కి నీవెన్నడితిరుగుట నాతలవ్రాలా? కాఱడవులలో నీవు బడు రారాములఁజూచి పోరామిఁబూని ఋణముగారింపక వదలిన దోషము నన్ను జుట్టుకొనెను కాఁబోలు? మంచి యోరితేరిన కృతఘ్నుఁడవు. పాముకుఁ బాలుంచినఁ గఱవక యుండునా? వేమునకుఁ బాలుపోసినఁదీపగునా? చాలు. చాలు. మారుమాటలాడకు. నా గురు ఋణంబిచ్చెదవా? ఇవ్వవా? ఈబంధకూడు కుడుచుటకంటెఁ జావుమేలు.

హరి.—విప్రవర్యకా! హెచ్చు మాటలాడకు.

కాల.—స్వామీ! వీరిలో నేమో తగవుగలిగెను. నేఁబరిష్కరింపవలెను. (హరిశ్చంద్రునిఁజూచి) అయ్యా! హరిశ్చంద్రా! అన్నిటఁజెడితివి. ఈబ్రాహ్మణుని బత్తెమిచ్చుటకా యింతటి వాగ్వాదము?

హరి.—అయ్యా! ఒకటిరెండు వరహాలు కాదు. ఎనిమిదికోట్లధనము బత్తెమునకు సరిపోయెనన్న నెటు సహింతును?

కాల.—అయ్యా! జీతము బత్తెము లేక యొకరిపని నౌకరు సేయుదురా?

నక్ష.—ఇదికదా ధర్మనిరూపణాసమయము. ఇతఁడు యమధర్మరాజునకు రెండవవాఁడు.

హరి.—అయ్యా! నక్షత్రకా! ఉంచినదెల్ల నిచ్చితిని ఆలినమ్మితిని. కొమారునిఁ గోలుపెట్టితిని. నాయొద్ద నాశరీరముఁదప్ప యింకేదియు లేదు. నన్నమ్మికొని నీఋణంబు దీర్చుకొనుము

నక్ష.—ఇదికదా న్యాయవాక్యము. అటులైన నశ్వమేధఘట్టమునకుఁ బోవుదము రమ్ము. అది రాజవీథి.

కాల.—అటులచేయుఁడి. పొండి.

(నక్షత్ర, హరిశ్చంద్ర నిష్క్రమము.)

(కలహాకంఠిక ప్రవేశము.)

కలహ.—ఓరీతొత్తా! వేకువననీఁదుననలి వెచ్చపుగింజ లింటికిఁ దేక యిప్పటి దేమిచేయుచున్నావు? నేనెంతప్రొద్దు పస్తువడియుండుదును? ఎప్పుడు నీరుదెచ్చెదవు? ఎప్పుడు వంటఁజేసెదవు? నీవీనడుమ భయమువదలి తిరుగుచున్నావు. నిన్నెంతదండించినను బుద్ధిరాదు. నాపాలిటి రెండవశనైశ్చరుఁడవు నీవు. ఈ పోసనముల పాలఁటి నీమాట మోసినదేల? కూలికిఁ దెచ్చితివియా? నేఁడెంత సంపాదించితివి? ఎన్నిపీనుఁగులు మోసితివి?

కాల.—(గడగడవడఁకుచు).... నాబాగెములదయ్యమా! నేఁడు నూరు శరీరములఁ గాల్చితిని. మూఁడుశవములు మోసితి. వారాణశీయందలియు

టిచ్చుచు త్తితి. ఘట్టములనెల్లఁ బిండదఱ్ఱఁబట్టితి. అన్నియు నీమన మున కొక్కలాగునఁ జేసితి.

కలహ.—ముసలితొత్తా! ఈమిటారికత్తె యెవ్వరైనది తెలుపవైతివేమే?

కాల.—నాపున్నెములదీపీ! నీవు మెత్తనిమేనుగలదానవు. ఇంటిపను లొంటరిగ దీర్పనేరవనియెంచి నీకు దాసిగానుంచుటకై యెనిమిది కోట్ల కాసులిచ్చి యీమానినిఁ గొంటిని.

కల.—ఓరీ! నాకొంపఁగూల్చితివి. నాయిల్లు తగులఁబెట్టితివి. నన్నుఁ జెఱచితివి. ఓరీ! ముసలివగ్గా! నాకుఁజేఁదోడు వాదోడుగవరవుడు మిటారియొకతె కావలెనని నిన్ను వేఁడికొనియుంటినా? రొక్క మెంత వెచ్చించితివికదరా? కాపురమునకు దాపురమునకు నేను. ఈ పురిలోఁ జిక్కినవారలకు వెచ్చపెట్టను నీవా? ఎనుబదియేండ్లు ము సలి తొత్తువైతివి. బుద్ధిరాదాయె. (అనుచు దన్నును.)

చంద్ర.—(అడ్డపడి) అమ్మా! చేతులుజోడించి వేఁడికొనియెద. ఆఁడు దానికిది యాగడమగును. సరిచేడియలలో నగుపాటు వలదు. పద లుము. సతికిఁ బతికదా దైవము? సతికిఁ బతికదా ముదము? అన్ని నీతు లెఱిఁగిన జాణవు. నీకు నేఁదెలుపునదేమున్నది?

కల.—ఔనే! ఆకతాయిబిగాడీ! పాతకలాడుచు నాయెదుట నిలచి పాడి దెలిపెదవా? నీకంటనేనవుడే యింతచులకనైతినా? తగవు దీర్పను రమ్మనివేఁడితినా? కూర్చినధనమెల్ల నీపైఁగూరిమిచే నీబడుగు మగ డు వెచ్చపెట్టినది చూచి నేఁజచ్చినదానివలెఁ బడియుండవలెనా? పిసాళిగయ్యాళీ! నీకిన్ని పెత్తనములేల? నన్నుఁ జూచినవారెల్లరు బొమ్మరాకాసినిఁ జూచినవారిఁబలెఁ బఱుగిడుచుండ నీవెదుటఁబడి బెదరించెదవా! నీపని పట్టించెదచూడుము. (అనుచు దెబ్బలుతిన్ని) పో పోసరపోతా! ఇంటిలోఁ దొత్తుగాఁ బనిసేయుచుండుము. నీగు ణము నీముఖముజూచినమాత్రానఁ దెలిసికొననగు. "జరుగునపుడు

జారిణీ జాతనవుడు కానాగిని" యని పెద్దలుపలుకరా? పాప్పురత సుమా! (లోహితునిజూచి) ఓరీ! దాసీపుత్రా! నీవు దినదినము ప్రాతఃకాలమున లేచి సమిధలు విస్తరాకులు దెచ్చుచుండుము. (మగనినిఁ జూచి) ఓరీ! వివేకహీనా! శైత్యమ్ము నీరుదెచ్చి వంటచేయుము. నీవు చేయకున్న నీయమ్మ స్వర్గమునుండివచ్చి వండిపెట్టునా?

కాల.—(చిత్తము) అటులనేచేసెద.

నిష్క్రమణము.

---

ద్వి తీ య రం గ ము.

---

అశ్వమేధ ఘట్టము.

నక్షత్రకుఁడు, హరిశ్చంద్రుఁడు, పురజనులు, వీరబాహుఁడు.

నక్ష.—(హరిశ్చంద్రుని చేతికిఁ బగ్గముఁగట్టి పట్టుకొని వీథికినిలిపి)

ద్విపద.—కొనుండయ్య కొనుఁడిది-కోట్లధనమ్ము
,, మునుమున్నుగా నిచ్చి-ముదమొప్పమీరు.
,, పురవరులార! యీ-పురుషభూషణుని
,, వరగుణాన్వితుని భా-స్వద్వంశమణిని.
,, ధరనార్జుచెలువలఁ-దానేలి పిదప
,, ధరణిసర్వంబును-దానమొసంగి
,, మునియాగమునకై-మున్నుతానిత్తు
,, నను ఋణంబునకై-యాలిని విలచి
,, కరవుకానికినిచ్చి-కాశని ఋణము
,, సరిఁదీర్పువరకును-చేరక తాను
,, మేనమ్మకొనియెడు-మేదినీధవుఁడు.
,, భూనుతో హారుఁడు-పుణ్యాత్ముఁడితఁడు

ద్విపద.—ఈహరిశ్చంద్రుని-నీసత్యనిధిని
,, ఈహరివంశావ-నీశునిఁగనెడి
,, సాహసియెవ్వఁడో-సరసకువచ్చి
,, యీహామీఁబున్నము-నిడనిమ్ము కనెద.

పురజనుఁడొకఁడు.—అబ్బా! హరిశ్చంద్ర సార్వభౌముఁడా యిత్తఁడు? ఇంతటిపుణ్యనిధి కెన్నికష్టంబులు విధిసమకూర్చెను.

రెండవ పురజ.—ఇంతటి కష్టపను ధరాధిపునిపై ఋణభారంబు మోపి యాతాపసి యేలొకో యింత కారించుచున్నవాఁడు?

మూఁడవ పురజ.—అబ్బా! నేను ధనికుఁడను నిజము. అయిన నింతటి సార్వభౌమునిఁగొని యాతనివద్ద నేఁ గొలువుసేయుదునా? దుడ్డిచ్చి తేలుకుట్టించుకొనుట కెవరిచ్ఛయింతురు?

అనుబంధము 27.

వీర.—(సంబళీ సంబళీ యని యఱచుచు సమీపమునకు వచ్చి, నక్షత్రకునిఁజూచి) ఏమయ్యా బాపనయ్యా! వీఁడే నేరమునర్చెను? పసరముఁబలెఁ బగ్గముతోఁ గట్టినావు.

నక్ష.—ఓరీ! ఆసాదీ! వీఁడే నేరముఁ జేయఁడు. వీనిని వరవుడుగా నమ్మెద.

వీర.—వెలయెంత?

నక్ష.—ఓరీ! మాదిగా! ఆజోలి నీకేల? ఎనిమిదికోట్ల ధనమిచ్చి కొనియెదవా?

వీర.—అబ్బా! అబ్బా! ఎనిమిదికోట్లధనమా? అబ్బా! (ఆలోచన నభినయించి) అయ్యా! ధనమేమినాకు హెచ్చుకాదు. వీఁడు కండమెండయి కడతేరిన గుండియవలెనున్నవాఁడు. ఊరేదో? ఉనికిపట్టేదో? ఊరిలో నిల్లులేదు. అడవిలోఁ బొలములేదు. నాసిరియంతయుఁ గొల్లఁగొట్టి పఱుగిడిన నేఁ జేయునదేమి? వీనికై చేతిబిడ్డు కడగికొని

ధర్మ్యమ్ముగొట్టినట్లు తిరుగుచుందునా? ఏని ముంచి, నక్షత్రకుని గుఱించి యేమైనఁ బూటకాపుటలైన లేని నీవు గోరినధనమంతయు నిచ్చి కొనియెద.

నక్ష.—అయ్యా! ఆనాఁడే సత్యహరిశ్చంద్రుఁడని ఖ్యాతినందిన యనేకాధ్వరంబులొనరించి సమస్తరాజ్యము విశ్వామిత్రునకు దారవోసి నిత్యకీర్తినిఁగన్న ... స్వభావమునకుఁ బూటకాపెనరుండవలెను? అతని వచనంబే ప్రమాణంబు ఇతఁడు త్రిశంకు సూధవునికొమారుఁడు.

వీర.—(హా! హా! హా! యని నవ్వుచు) వీనియబ్బ మహాదుష్పాపాలొనరించి త్రిశంకుఁడని బిరుదందెను. ఆతండ్రికొడుకే యితఁడు. అబ్బను మీఱ నిచ్ఛయించి యెన్నిపాపంబు లొనరింప సమకట్టినాఁడో? తండ్రియాచారమే కొడుకుది.

హరి.—ఓరీ! చాండాలా! ఓరీ! మాతంగాధమా! సురాపానమత్తుచే మైమఱచి ప్రేలకు.

కం॥ దుండగము ప్రేలుచు
చండాలుంగతిని సాధుప్రసంగతి నుడువున్
నిందార్;...నీచజాతికి
మంచున శుచిబుద్ధి దొరకనుండదు యధమా!

ఓరీ! మాలా! కల్లుద్రావి యొడలెఱుఁగక పాలుమాలి ప్రేలెదవేల? దూరముండుము. నోరెత్తకుము.

వీర.—ఓరీ త్రిశంకుపట్టీ! నీవిప్పుడే యెంతపెద్దవాఁడవైతివి?

ఉ॥ ఓరీ! రాజకులాధమా! వినర, యోహో! నీకులాన్యత్వముల్
మేరల్మీఱి సెలుంగ నాయెదుటనా మిథ్యాప్రలాపంబులున్?
ధారాళంబుగ నీకతండ్రి మును నాతండ్రిన్ భజించెన్ గదా!
పౌరాళంబుగ మద్యమాంసములు మా యింటన్ భుజించెన్ గదా!

ఓయన్నో! చిన్ననాఁటిమాట మఱచితివో? త్రిశంకుపట్టీ! నీరక్తమింకను వెలితీసి శోధింపుము. కల్లువాసన యిప్పుడుగదా నీకుఁ దెలియును.

నేనెవరనునది తెలియదా? హెచ్చరిక. హెచ్చరిక. రెండవ ప్రేత రాజును.

నక్ష.—అయ్యా! హరిశ్చంద్రా! ఈరాజసతామసగుణములు రాజ్యవైభవమదాంధులకుఁ జెల్లును. నీకుఁజెల్లవు. సంపద దానవునిఁ జేయును, దారిద్ర్యము మానవునిఁ జేయు ననునది వినవా? కొంత మాసికొని పోవులాగున యుంచినను బేరమునకు నొకఁడైనను రాఁడాయెను. అదృష్టవశమున నీపెద్దింటి మానిసి వచ్చినపుడు నీవతనిని తుచ్ఛముగ మాటలాడి బేరము చెడగొట్టెదవా? తెలిసెను నీసమాచారము.

హరిశ్చంద్రుఁడు.—

చ॥ జలరుహవంశజుండనయి సర్వధరాధిపులసేవనందితిన్,
జలధిపరీతభూభువనచక్రము నేలితిఁ జక్రవర్తిగా,
విలసితయాగకర్మముల వేడ్క నొనర్చితి నిత్యవృత్తిగా,
కులము నెఱింగి నే నెటులఁ గొల్తును మాలను? బ్రాహ్మణోత్తమా!

నక్షత్రకా! ఇట్టి హీనవృత్తికి ననుదింపకు. నిన్నుఁబతిమాలి వేఁడికొనియెద.

నక్ష.—రాజా! నీ నోరేమినొచ్చును? ఊరక మాటలాడెదవు. నిన్నుఁ గొను రాచవారిని వెదకుటకు నేఁబోవలెనా? "నన్నమ్ముకొమ్మని పల్కితివిగాని జాతినిర్ధారణము నీవు చేయవైతివిగదా?" మాట మాటకీరీతి నీవు మాఱ్పులు వెదకుచు నేర్పులుచూపితివేని నిన్నెవరును గొనరు. నీమితి మీఱును. ఋణము దీరదు. విశ్వామిత్రుఁడు నన్నుఁ జెడమాఱి గొట్టిచంపును. "అనృతవాది" యని నిన్ను శపించును. ఇన్నిదినంబులు నీవు కాననంబులఁ గష్టపడినదెల్ల వమ్మాయెను. ఆలినమ్మినది వెడయాయెను. నీకై నేనొనరించిన యుపకృతులెల్ల నిరర్థకములాయెను, దూరాలోచన పరుఁడవుగమ్ము.

హరి.—(ఆలోచించి) నక్షత్రకా!

ఉ॥ ఆలిని సంపదాలి విడనాడితి రాజ్యమునీటఁ బుచ్చితిన్,
కూరిమిచేసి పెంచిన కుమారునిఁ గూలికిఁబంపితిన్, సదా
చారము జాతియల్పుడుదుఁ గాననసీమనుచేరఁ దుంచితిన్,
మాలనుగొల్వ నేల యనుమానము! బ్రాహ్మణ! విక్రయింపుమా.

బ్రాహ్మణోత్తమా! మానహీనుఁడనయిన నాకు మాలనుగొలువ ననుమానమేల? (వీరబాహునిఁజూచి) మాతంగోత్తమా! నీకొలువున నేనుండెద. నన్నుఁగొనుము.

వీర.—అయ్యా! మొదట నగిరి యొగిరిపడి మాటలాడితివి. నాకులమెంచితివి. నన్నుఁదిట్టితివి. దూరముండుమంటివి. అంతలోనే దిగితివి. నీయొత్తుగడయేమో నాకుఁదెలియకున్నది?

హరి.—వీరబాహూ! త్రికరణశుద్ధిగ నేఁబలికెదను. నీకొలువుననుండెద.

వీర.—అయ్యా! మొదటనే యాలోచించి మాటయిమ్ము. కొలువునకు లోఁబడి నీ తులువతనంబుఁ జూపిన నే నోర్చువాఁడనుకాను. నేను రెండవ జముఁడనని తెలియుము. నీవు నాకొలువుననుండి నానుడి విన పనులన్నియుఁ జేయుదువుకదా!

హరి.—అయ్యా! రెండుపనులుదప్ప మిగతపనులన్నియుఁ జేసెద.

వీర.—ఆరెండుపను లేవి?

హరి.—నీయింట భుజింపను. అధర్మవృత్తికి లోఁబడను.

వీర.—ఇనితయకదా? అటులైన వెలయిచ్చెదరండు. అయ్యా! నీపేరు వీరదాసుఁడని యుంచెద. నీవు నామాఱుగ స్మశానాధికారంబు వహించి పీనుఁగనుంకము రాఁబట్టి వచ్చుబడిలో నాలవభాగంబు నీవెచ్చమునకై నుంచుకొని నాలవభాగము రాజునకిచ్చి మిగత యర్ధంబు నాకిమ్ము. లెక్కలలో హెచ్చుతగ్గులుచేసి ముంపకుసుమా.

మోమోటమివదలి కటికనై యెంతయేడ్చినను వదలక సురేశము రాబట్టుము. నీనుఁగసుంకమున కడిబంతులైనవారి తలఁగొట్టుము. చీకఁటిలో నిను మోసగింతురు. పరాకుమాని యెలుఁగుబలె నొక కంటనిదుర, యొకకంట జాగరూకతగలిగి యుండుము. రమ్ము ఈబట్టలు నీకుఁ బనికిరావు. వేఱు బట్టలిచ్చెద.

అనుబంధము 28.

నకు.—ఏమయ్యా! నాసొమ్ము మీరిరువురేకమై యొకరవేయుదురా? సొమ్మునకై నీనుగజాగరణంబు నేనుఁజేయవలెనా?

వీర.—అయ్యా! ధన మీవీధి నెంచికొనియెదవా? నాయింటికిరమ్ము ఇచ్చెద.

నకు.—ఏమీ! ఏమీ! నాకేమి గ్రహచారమా? సద్బ్రాహ్మణుఁడనై మాలవానివీధినైన నడుగిడఁగలనా?

వీర.—అటులైన యీవీధినుండు నాయుంగడికి నా వెంటరమ్ము. ఇచ్చెద.

నకు.—వచ్చెదను. (నాకంటిన యేడింటి కేసి నేఁటితో వదలెను.)

(నిష్క్రమము.)

---

తృ తీ య రం గ ము.

వ న ము.

అనుబంధము 29.

లోహిత, కోదండరామ. రాఘు.

యదుకులకాంభోజి రాగము.—

కో।రా.—కాననమిచ్చ్యగ - గాంతినిభాసిలు

రాఘు.—కానవె లోహిత! - కనుగవ రంజిలు

లోహి.—మిత్రమా! కుజములు - మింటిని నంటెడు

శో॥రా.—భ్రాతృవరా! యిట - ఫలములుపండెడు

రాఘు.— ఉల్లమురంజిల - నూఁగెడుకొమ్మలు

లోహి.—పల్లవములగుమి - ప్రాపుగవానిలు

శో॥రా.—చిలుకలపలుకులు - చెవులకునింపులు

రాఘు.— కలనాదంబుల - కలకంఠంబులు

లోహి.—శారికలనుగను - చక్కఁగఁబలుకును

శో॥రా —కూరిమిపలుకులఁ - గులుకుచు మముఁగను

రాఘు.— ధరనంటెడునీ - తరుశాఖలు గను

లోహి.—ధరణీతరుణికి - దండము లనుచును

శో॥రా.—ప్రీతగరమ్మని - పిలిచెడు మముఁగని

రాఘు.— కోఁతియాట యిటఁ - గూడును మనకని

లోహి.—మిత్రమ! కాలము - మీఱును త్వరపడు

శో॥రా.—రాత్రికి భయపడు - రాచకొమారుఁడు

రాఘు.— భయమేమిర యిట - బాలిక లుందురు

లోహి.—దయవిడి గురువులు - దడసినఁ దందురు.

శోదం.----ఓరీ! లోహితా! ఇచ్చటఁ జల్లఁగనున్నది. ఈచెట్టుకొమ్మలు భూమివరకు వంగినవి. కోఁతియాట యాడుదుమా?

రాఘు.---కోఁతియాటకన్నను గుండ్లాడుట బాగుగనుండును. నాదగ్గఱ గుండ్లున్నవి. ఆడుదము.

లోహి.---అన్నలారా! ఏ యాటయువలదు. మనగురుపుత్రులవారి యానతిచొప్పున సమిధలు కుశ పత్రపుష్పములు తీసుకొని చీకటికాక మునుపే యిల్లుచేరికొందము.

ఆ॥వె॥ అయ్యగారి యాజ్ఞ ననుసరింపకమేము
ఆటపాటలందు నధికమమత
నుంటిమేని గోపగింతురు మమువారు
మిత్రులార! దీని మాఱ కనరె!

అన్నలారా! గురువులవారు మముతిట్టెదరు. ఆలస్యము చేయక ఈచెట్టునెక్కి సమిధలుతీసుకొని గృహమునకు వెళ్లెదము.

కోదం.---ఓరీ! రాఘూ! ఏఁడేమో గురువులవారికి చాలాభయపడు లాగున నటించుచున్నవాఁడు. గురువులవారు మమ్మేమిచేయఁగలరు? రెండుతిట్లు తిట్టుదురు. అవి గాలిలోఁ గలసిపోవును. రెండుదెబ్బలు కొట్టుదురు. అవియేమి మా దేహముమీఁద శాశ్వతముగ నిలువవు. ముందేమిచేయఁగలరు? ఇంటినుండి వెడఁబెట్టి నట్టవేయుదురు. మాకింతెచాలును. పాఠములు చదువుకష్టము తప్పిపోవును. ఇఁకఁ దిండికని యాలోచింపవలెనుగదా? బ్రాహ్మణులకుబిచ్చ బ్రహ్మవ్రాసి నాఁడు.

రాఘు.---కోదండీ! బాగుగఁబలికితివి. నాతాత్పర్యమదేను.

లోహి.---అన్నలారా! మీమాటలు నాకురుచింపవు. ఈమఱ్ఱిచెట్టు నెక్కి నే సమిధలుగోసెద.

రాఘు.---ఓరీ పొగురుపోతా! ఈచెట్టునేల నెక్కఁజూచెదవు? అదిగో కనుము. దానిక్రింద నెంతగొప్పపుట్ట యున్నదియో చూడుము. అదిగోచూడుము. నీకేమి కండ్లున్నవియా? లేవా? ఓరీ కోదండ రామా! నీవుచూడుము.

కోధ.---అబ్బా! ఎంతపుట్టరాయుడి?

లోహి.---అన్నలారా! పుట్టయుండినమాత్రాన నాకేమిభయము? పుట్టలోనున్న పామును నేనేమిత్రొక్కుదునా? దానితోటిజోలి కున్నఁ బాముకఱచునా? ఒకవేళఁ బాముకఱచినను దానివిషమెక్క నటుల నాతల్లి నాకు రక్షకట్టినది.

కోదం.---అటులయిన నీవే చెట్టెక్కి సమిధలుగోయుము.

లోహి.—మంచిది. కోసెద.

(అనుచుఁ జెట్టునెక్కుటకై కాలెత్తఁ బుట్టలోనుండు పాము ఫూత్కారము చేయుచువచ్చి లోహితునిఁగఱచిపోవును.)

(లోహితుఁడు, హా! తల్లీ! అని యఱచుచుఁ గ్రిందబడును మఱ్ఱిచెట్టు కాలిక్రిందపడును.)

అనుబంధము 30.

కోద.—రాఘూ! చూడరా లోహితుని పాముకఱచిపోయెను?

(అనుచు సరసకుఁబోయి శరీరముదవిలిచూచి)

ఓరీ! వీఁడాకదెబ్బకుఁ జచ్చెను. నాకేమో భయమగుచున్నది. మన ము గృహము నకుఁబోయి వీనితల్లి కీసమాచారంబు దెలుపుదము రండు.

(నిష్క్రమము.)

---

చతుర్థరంగము.

కలహకంఠి, హంసనారి (చంద్రమతి) బాలురిరువురు.

హంసనారి.—

అనుబంధము 31.

ఉ॥ భానుఁడు పశ్చిమాద్రిఁబడి బాహుసహస్రము గోలుపోయె; నా
సూనుఁడు లోహితుం డడవిఁబోచ్చి గృహంబును జేర రాడయెఁ,
మానసమానకోమలుఁడు మానకకోపమశాలుఁ డే లొకో
కాననునిల్చెఁ? గారణముఁగానను, కాననువచ్చు జాడయుఁగా.

(నలుదిక్కులఁజూచి) ఏమిరా! యేదిక్కునఁజూచినను వాఁడు వచ్చు జాడ లేదుకదా? ఏమిసేయుదు? నామానసమేలొకో కళవళపడు

చున్నది? అయ్యో! ఆకుమారుఁడు సుకుమారశరీరుఁడే. ఎన్నఁడే కష్టంబును గన్నుఁగనివాఁడే. తోడిబాలురంగూడి యే గుట్టలెక్క బోతెనో? ఏ చెట్టులెక్కఁబడెనో? ఏ పొదలలో దూరెనో? ఏ పుట్టలపై నెట్టెనో? అయ్యో! కనుగందని పసిబాలుఁడు వాఁడు విష మూటవులు ద్రొక్కనర్హుఁడా? అకటా! విధీ! రాజపట్టార్హుఁడు నిస్తేజుఁడై కట్టెలుమోయువానికి లోఁబడెనుగదా! హా! ఎవరో బాలురు వచ్చినట్టున్నది. లోహితుఁడు వచ్చుచుండును (చక్కఁగాఁజూచి) ఏమీ? యిరువురే వచ్చుజాడ యగపడుచున్నది? లోహితుని వెంబడించినవారు వారేకదా? లోహితుఁడు వెనుకఁజిక్కియుండునా? ఈ బాలురు బాల్యచేష్టలకు వానినివదలి పరుగిడి ముందువచ్చియుండురా? ఎంతమెల్లఁగ నడచుచున్నవా రాపిల్లకాయలు? గడియకొక యడుగు వేయుచున్నవారు. నాదిక్కునఁ జూడరేల? మోమేలవంచుకొని వచ్చుచున్నవారు? నేనే పరుగిడుచుఁబోయి నాబాలుని వార్త నడుగుదునా? ఇంటియొద్ద నెవరును లేరే? ఎటుల యిల్లు వదలి పోఁగలను? నాయజమానురాలు పొరుగింటివారితోఁ గలహించుచు నిలిచినది. ఏమిసేయుదు?

(బాలుర ప్రవేశము.)

అబ్బాయీ! లోహితుఁడేడీ? మీవెంబడి యేలరాకతడసెను?

బాలుఁడొకఁడు. (రెండవవానిఁజూచి) నీవే తెలుపుము నావల్లకాదు.

రెం.—నీవే చెప్పుము నాచేతకాదు.

హంస.—బాలులారా! నాబాలునివార్త తెలుపక మీరేల నన్ను బాధించెదరు? వెనుకవచ్చుచున్నవాఁడా యేమి?.... బాలకులారా! ఏమి మౌనమూనితిరి? లోహితుఁడు క్షేమమున నున్నవాఁడుకదా?.... ఏమి మాటలాడరు? చెట్టుపైనుండిపడి గాయమాయెనా యేమి?...

బాలకులారా! మీకు మ్రొక్కెద. నా లోహితునివార్తఁ దెలుపుఁడీ. దారితప్పిపోయినాఁడా? ఎవరయినను వానినిఁ గొట్టి క్రిందఁ గెడపిరియా?

బాలు.—అమ్మా! లోహితుని.... (రెండవవానినిఁ జూచి) నీవు తెలుపరాదేమిరా? చెడుగంతయు నేనే చెప్పవలెనని విధియా?

హంస.—బాలులారా! లోహితునకే చెడుగుమూఁడెను? సందియము మేల తెలుపుఁడీ? మిము నడిగికొనియెద.

రెండ.—అమ్మా! నీకొడుకును పాముగఱచి చంపెను.

హంస.—హా! లోహితా! హా! కుమారా! (మూర్ఛిల్లిపడును.)

అనుబంధము 82.

బాలు.—ఓరీ! ఈమెదుఃఖము చూడఁజాలము. పోవుదము.

(నిష్క్రమము.)

హంస.—(లేచి) లోహితా! లోహితా! నాయనా! నినుఁ బాము గఱచెనా?

సీ॥ రాయంచుగరులచే రాణించుశయ్యపైఁ బవళించు నీమేను బడెనె నేల!
హాటకాంచితడోల లాడు లోహితుఁడవా కాటిలో నిద్రను గాంచె నేఁడు.
రాజభోగములచేఁ దేజరిల్లినబిడ్డ దక్కునే కాటికి దిక్కుమాలి!
సార్వభౌమసుతుండు నిర్వీర్యుఁడయి కటా! ఘోరాటవినిఁ బడి కుందె నేఁడు

గీ॥ ప్రాగ్భవాగమ కర్మంబు ప్రబలమకట!
నలువవ్రాఁతను దప్పింప నలవియగునె?
హా! కుమారక! ననుఁ జేరరాక యిటుల
ఏఁకదక్కితె? బ్రదుకిఁక నాకు వలదు.

అయ్యో! లోహితా! హా! కుమారా! శిరీషసుమోపమ సుకుమారా! నాయనా! విధివశంబున మీనాయన పన్నములంబడి నన్నెడఁ బాసెను. నీమోముఁ జూచి నేనావ్యసనంబు మఱచియుంటిని. ఇట్టి

నవరాదరింతురు? నన్నింక నెవరు చేరఁదీయువారు? అమ్మా! దినదినము కన్నీరుగార్చెదవేల నేయని యూఱడించువారెవరు? తనయా! నన్నిటు వదలిపోఁదగునా? నీవియోగము సైఁపఁగలనా? నేమనఁగలనా? నాయనా! ఆపాడుపాము నీపాలి విధియైనిలిచెనా? దానికి నీపైఁగరుణ రాదాయెనా? తండ్రీ! ప్రాణంబులు వదలునపుడు తల్లీ! యని తలఁచితివియా? ఇంతకష్టపడి పనికి నినుబంపితినని శపించితివియా? తండ్రీ! నేనేమిసేయఁగలను? అయ్యో! తనయా! నిన్నాకైన తేయుండు చంపకమానిన దోషమునఁగదా నాసూనుపాలిటి మృత్యువైతివి?

ఉ॥ నాకువు భూషణుండవయి నాకులభూషణుఁ బుత్రుఁ బంపితే
తేకువఁబూని? వక్రగతి తేటపడన్ శ్రుతిబాహ్య! తక్షకా!
యీ కనుకంద నన్ను పదహీనునిఁ జేసెనె? క్రిందఁద్రొక్కనే?
యేకరణిన్ సుతున్ గఱచి యేచితివయ్య భుజంగరాజమా!

హా! హా! నాదుష్ప్రాప్తికి నెవరినెంతదూరి యేమిప్రయోజనము?

(కలహాకంఠి ప్రవేశము.)

కలహా.—(వచ్చుచు) నానోటికిఁ బ్రపంచమే యాఁగదనిన వీరాయాఁగువారు? నోరెత్తిన గడియననే యిరుగుపొరుగు మగవారు వగఁజెంది యింటదూఱి తాకిండ్లు వేసికొనిరి. ఒకమగవాఁడయిన నావీధినిఁ దిరుగవెఱచి రాఁడాయెను. అటుచేయనేని యీకుంకలకు బుద్ధివచ్చునా? (హంసనారిఁజూచి) ఓసీ! రోత తొత్తా! లక్షణముగ శుక్రవారము సాయంత్రి యింటదీపముంచక యేడ్చుచుఁ గన్నీరుగార్చి యశుభ్రగాఱ్చెదవేమే? నాయింటికి జ్యేష్ఠాదేవిగా వచ్చితివిగదే? ఎందఱిదీపమార్పి యెందఱికొంపలు గూల్చివచ్చితివియే? పిసాళిగయ్యాళీ! తలపైఁ గంగనుంచుకొని కన్నులఁగడవలతో నీరుకుమ్మరించుచున్నావుగదే? నీకేమి చేటువచ్చెనే? యెవరోచచ్చినవారివలె నేడ్చెదవు? భ్రష్టా! ఇంటిలో దీపముంచుము. లెమ్ము. ఈనడుమ నీకు దెబ్బలు లేక నీవు మూరి మసలుచున్నావు.

హంస.—(హాయని నిట్టూర్పులు విడుచుచు) అమ్మా! యజమానురాలా! నేనేమని తెలుపుదు? నాదుఃఖంబెంతని విన్నవింతు? నాలోహితునిఁదిట్టి కట్టెకంపలు దెచ్చుటకై కాఱడవికిఁ బంపితిరి. అచ్చట వానిఁ బాముగఱచి చంపెనఁట. నేవానిఁ జూడక యుండలేను. వాఁడెచటఁబడినాఁడో వెదకుచుఁబోయి కాఁదగినకార్యంబు సలిపివచ్చెద. నాకీరాత్రిమాత్రము సెలవిమ్ము.

కల.—ఔనే వచ్చిరక్కసీ! ఈవగలెవరికి నేర్పెదవు? పట్టిని నెచటనో దాఁచిపెట్టి తప్పించుకొనిపోవు తలఁచి వేచి కొడుకును బాముగఱచెనని కూలియేడ్పు లేడ్చుచు నన్నటమటింపఁజూచెదవా? ఇంటిలోఁ బని పాటుచేయుక లక్షణముగఁ గళలచే వెలుఁగు నిండుగృహమున గూర్చుండి సిరివచ్చు సమయమునం దేడ్చుచున్నావుగదా? నీ దుడుకుతనంబు నుడువ నసహ్యమగుచున్నది. అయ్యో! బంగారా! నీవుపని నుండి తప్పించుకొని పోవుటకై ముద్దుగబలసిన కొడుకుచచ్చెనని యేల యవలక్షణములు పలికెదవే శనైశ్చరురాలా?

హంస.—తల్లీ! నాపలుకు కల్లగాదు. లోహితుని తోడిబాలురువచ్చి యీ ఘోరమైనవార్తఁ దెలిపిరి. అయ్యో! విషము నిలువెల్ల నెక్కక ప్రాణమించుక యుండెనేని వానిఁ దెచ్చి విషవైద్యులతో మంత్రింపించెద. ప్రాణములు పోయియుండిన సార్థకపఱచివచ్చెద.

కల.—వలువా! ఇంటిసిరియెల్ల వెచ్చఁబెట్టి హెచ్చువెలయిచ్చి యిచ్చినా మగఁడు నిన్నుదెచ్చినందులకుఁ జేరికగ వైద్యునకిచ్చు వెచ్చము నేఁడే యిచ్చుకొనవలెనా? వచ్చిగయ్యాళీ.

ఉ॥ సోమరివై పనుల్విడక సౌఖ్యముఁగ్రుమ్మరు నీదుబాలుపైఁ
ప్రేమను బూనియేము గృహకృత్యములఁ గఱపంగ నెంచి యం
దేమియు హానిలేదనుచు నిష్టికిదర్భలు తెమ్మటన్నచో
బాములపుట్ట నెట్టి యిటు ప్రాణముబాసినఁదప్పు మాదటే?

ఏమే! సమిధలు దర్భ తెమ్మని పంపితిమిగాని కాఱడవులలో దూఱి కండక్రొవ్వున గుట్టలుగట్టులు పుట్టలునెక్కి పాదు పాములతో గఱ పించుకొమ్మని చెప్పితిమా యేమి? ఎంతమిడిసిపాటుగల పోగుకుపోఁడు వాఁడు. ఉండుడు దొరక కొమారుఁడని "యడ్డియాజ్ఞ లేక పెంచినావు." "నీపిల్లవాఁడు పోగురెక్కి పుట్టయెక్కను పామూ కఱవవద్దని" వాకట్టుమంత్రము వేయించి యుంపనితప్పు మాయందున్నది కాఁబోలు? ఎటులయిన మముక్షమింపుము. నీపిల్లవానిపైన నీకు నెన రుండెనేని యింటిపనులన్నియు నెరవేర్చిపొమ్ము.

౦ంస.—అమ్మా! నీయిష్టానుసారం బొనర్చెద.

౦.—పొమ్ము. ఇంటిలో వెళ్లి దీపారాధనచేయుము.

(నిష్క్రమము.)

---

పంచమరంగము.



(అరణ్యము.)

చంద్రమతి, లోహితునిశవము.

అనుబంధము 88.

సీ॥ నాపూర్వసుకృతంబు నాపూర్ణవిభవంబు, నాపుత్రరత్నంబు నాముదంబు
నాకామితార్థంబు నాకామితఫలంబు, నాసుఖార్ణోరాశి నాదువాసి
నాగృహదీపంబు నాదునిక్షేపంబు, నామోహరూపంబు నాతపంబు
నావలపుల కేఁడు నాకలుములవీడు నాలీలలకుజోడు వాడు కేఁడు.

గీ॥ నాదుచిన్నిచిలుకత నాదాత నానేత, నాయనుంగుకేత నాదుభాగ్యత
ఈడు లేనివాఁడు పోడిమివాయుచుఁ గాచుకరణముగను పడెమేను.

చంద్ర.— లోహితా! పట్టభద్రునికూర్మి పట్టివగు నీకు నిట్టికట్టిడిది చావు ప్రాప్తిల్లునని యాకట్టడిబ్రహ్మ నీనొసట వ్రాసెనే? నాయనా! సకలవిధాలభాగ్యంబును గన్న భాగ్యవతికి నీవుపుట్టక నాకేలపుట్టి

తివి? తండ్రీ! ఇట నాకింక నెవ్వరుదిక్కు? పట్టీ! పుట్టకపుట్టిన పుట్టు భోగివి నీవని యాపుట్టుభోగి చలపట్టి నిన్నుఁ జంపెనే? అయ్యో! తనయా! నీవుపుట్టినప్పుడు కాలజ్ఞులు నీజాతకముఁ జూచి చిరకాలము సార్వభౌమపదవిని మనియుందువు నీవని పలికిరిగాని కాలాహిచే నకాలమరణంబు ప్రాప్తిల్లునని నుడువరైరిగదా? హా! లోహితా! నీనగుమోము కన్నులారఁ జూడకున్న, పులకంపము లొలుకు నీముద్దుపలుకు వీనులారవినకున్న, రంగారు బంగారు చాయను గేరి మెరుగారు నీనునుమేను నాయక్కునఁ జేర్చి కౌఁగలింపకున్న, నాబ్రదుకు రిత్తయని తలచుచుంటినిఁగదా? ఇఁక నేనేమని యీభువిని బ్రదుకుదు? నాయనా! పదినెలలు నిను గడుపునందుంచికొని రక్షించినది యీనిడుకానకు బలియిచ్చుటకేనా? తండ్రీ! లోహితా! యని నేఁబిలువనంతటి దూరంబుననుండియైనవచ్చి ముద్దిచ్చి పోవుచుంటివిగదా? నాయనా! ఎటుపోయియుంటివని నే గద్దరించి యడుగ నను గౌఁగలించి అమ్మా! ఆడను బోయియుంటిననిపల్కి నాకు ముదముఁ గూర్చుచుంటివిగదా? ఇఁకనట్టి ముదంబు గూర్చువారు నాకెవరు? అయ్యో తనయా! భూరినిర్భాగ్యను నేను హా! పుత్రశోకమునఁ గుందుచు నేనిచటఁ దడసితినేని నాయజమానురాలికి నేనిచ్చిన గడవు దప్పును. ఆయమ నను దండించి నిందించును. దాసీధర్మవిరుద్ధంబగును. ఈలోహితునికి నాముద్దుపట్టికి నగ్నిసంస్కారంబొనర్చి గృహంబుఁ జేరెద. (శవమెత్తికొని నిష్క్రమించును.)

అనుబంధము 34.

---

# చతుర్థాంకము.

## ప్రథమరంగము.

వీరదాసుఁడు, హంసనారి, లోహితుఁడు, శవము.

వీరదాసుఁడు.—ఇప్పు డర్ధరాత్రి యాయెను. నిదురపట్టదాయెను. నా యుదరములోఁ జేతులుంచి కలంచినట్లు సంకటమగుచున్నది. నా పాలిటి భాగ్యదేవత నా బహిఃప్రాణము. నా ప్రాణపతి తన్ను వీథినిడి విక్రయించు పాపాత్మునిఁ జేపట్టితినేయని నొచ్చుకొని యుండునా? నా తనయుఁడు, సముదంచిత నయుఁడు; నా నందనుఁడు, మదీయాత్మాభినందనుఁడు; నా సూనుఁడు, మృదువచన ప్రసూనుఁడు, నా పుత్రుఁడు, సమస్తజననచైత్రుఁడు, నా కుమారుఁడు, రూపజితమారుఁడు, నా దుష్కృత్యంబులు దలంచి దుఃఖించుచుండునా? అయ్యో! వారికిప్పు డేకష్టమొదవెనో గదా?....అయ్యో! మాలవాని కూలివానికి నాకేల వారిపై జాలి?

చం॥ అలజడిరేఁగ చిత్తమున నర్థవిహీనుఁడనై మరీచిమ
త్కులమునుగూల్చితిన్, సతినిఁ గూరిమిదారను వీథినమ్మితిన్,
గొలువుననుంచితిన్ సుతునిఁ గోమలకాయునిఁ జిన్నిబాలునిన్,
నిలిచితి మాలసేవకును, నింద్యుఁడనైతిని నన్నిటన్ భువిన్.

ఇట్టి భూరిపాతకికి నాకేలవారిచింత? నిదురవచ్చునట్టున్నది. నేలఁ బరుండెద.

(అనుచు ద్వారమునఁ బండుకొనియుండును.)

అనుబంధము 85.

(హంసనారి, లోహితున నెత్తికొని ప్రవేశము.)

హంస.—(లోహితుని క్రిందనుంచి) హా! తనయా ఘోరాటవిలో కర

దీపము వెలుఁగున నీముద్దుమోముఁ జక్కఁగఁజూడనైతిని. ఈశవ కాష్ఠజ్వాలల వెలుంగున నీసుకుమార కాయంబెల్ల నగపడెడు. అయ్యో! పుత్రా! భర్మాంచిత భవనమున మణిదీపికాసహస్రములఁ జెలువారు నీమోము స్మశానవాటికలో శవకాష్ఠకీలికీలల సాహాయ్యమునఁ జూడనయ్యెనుగదా! నాయనా! నాదిక్కుఁజూడవేల? అమ్మాయని పిలువవేల?

సీ॥ నను గన్న నాయనా! తనకలిపాటెట్టు చెనటిపాము నీమేనుఁ జెనకెనన్న!
భోగివై యుయ్యెల లూఁగుచుండెడి నీవు భోగిపాల్పడితివే? బుడుతకుఱ్ఱ!
బంగారు నను గాంచి రంగారు నీమేని సింగారమెటుపోయెఁ? జిన్నిచిలుక!
తండ్రి! నీరక్షకై తాయెత్తుఁగట్టితి నదిరిత్తపోయెనే యటవినపుడు?

గీ॥ తండ్రి! నాదిక్కుఁజూడరా! తనయ! నీదు
మోముఁజూపర! ముద్దిర ముదముదీఱ!
కొడుక! కౌఁగిటఁజేరరా! కొమరుమిగుల
రాకుమారక! లేర పరాకుమాని.

నాయనా! లోహితా! మాటాడక నీవిట్లు రాపడితివేని నాగతి యేమి? "తండ్రీ! లోహితా!" యని నేఁబిలువఁ బరుగిడివచ్చి ముద్దిచ్చి యమ్మా నేనాటకుఁబోదునా? యని నన్నిఁక నెవ్వరడుగువారు? కుమారా! నాకౌఁగిటనుండి చెక్కిలిగిలి నవ్వి నవ్వించువారెవరు? ముద్దుముద్దులుగఁ దొక్కుపలుకులు పలుకుచు నాకు సంతోషము గూర్చువారెవరు? తండ్రీ! హంసతూలికాతల్పమునఁ బవళించి యిరువాగుల చామరంబులు వేయించికొనిన మేనా యిది నేడు శవకంకాళకంటకమైన స్మశానవాటికయందుఁ బడినది. తనయా! ఏనుఁగులపై నెక్కి యేలమిని వాహ్యాళివెడలు నీవు నేఁడు పీనుఁగుల పెంటలపైఁబడి యడఁగితివియా? అయ్యో తనయా! కులముద్ధరించెడు కొడుకొకఁడైనఁ జాలునని యనేకవ్రతంబులు సలిపి నిన్నుఁ గని సమస్తసంపదలు గన్నవానిభంగి సంతసించియుంటినిగాదా? నా సంతోషమెల్లఁగాల్చి సంతాపము గూర్చితివియా? తనయా! నీ

తండ్రిబలె సార్వభౌముఁడవై సర్వజనులను రక్షించి వార్ధకదశను ననుఁబోషింతువని తెలిసితినిగాని పిన్నవయసున నీవిటు పెనుమృత్యువునకు బలియగుదువని తెలియనైతిని. అయ్యో! నే నిపుడేమి సేయుదు?.... నాయజమానురా లాలస్యము చేసితివని నన్నేమి దండించునోగదా? ఏమిసేయుదు?.... లోహితుని, నాలోహితుని, కుమారుని, నాముద్దుకుమారుని, కటికన్నైమై నాచేతులార చితినుంచి "శ్రీ శివార్పణమస్తు" యని పోయెద.

అనుబంధము 35.

దాస్యధర్మం బతిక్రమించితినేని దోషంబు వాటిల్లు. (లోహితునెత్తి గాని)

ఆ॥ చిఱుత! యిపుడు నిన్నుఁ జిచ్చులోఁగలిపెద
చిన్నిబిడుక! నీకుఁ జిచ్చునిడెద
లోనమంచు చిచ్చులోఁజెక్కి యింతలో
నిన్నుగలయుదాఁ నిజము తండ్రి!

వీర.—ఏమీ! యార్తారావము? అర్ధరాత్రము మీఱినపిదప శవమును దెచ్చి కాటినుంకమిచ్చక పనిఁగడతేర్పఁ జూచెదరు కాఁబోలు? ఔరా సాహసము! పోయిచూచెద. (అనుచు ముందరికివచ్చి హంసనారిం జూచి)

ఉ॥ హంసనేత్రి! నీవెఁవు! సాహసవృత్తి నిశీధమందునన్
గారణమేమి నీవిటులఁగాటికిరాఁ? గరమందునున్న శ్వం
గారిములోలు బాలకుఁడు కాయముఁ బాసెనదేల! వాఁడు నీ
కారయఁనేమి కావలయు? నంతయు దాఁపక తెల్పుమా! యికన్.

హంస.—పుణ్యపురుషా! నిర్భాగ్యయగు నాచరిత్రంబు దుఃఖకరంబు. దానినివ్వనేల? కేనొకవిప్రునింటిదాసిని. వీఁడు నాపుత్రుఁడు. విప్రుని బాధకులోఁబడి సమిధలు దెచ్చుటకై యడవికింబోయి యచట నొక కుటిలసర్పంబుచేఁ గఱవంబడి ప్రాణంబులు బాసెను. మహాత్మా!

కామెవరు? ఈబాలుని రక్షించుటకై భువి నవతరించిన దిక్పాలకుల లో నొకరో? త్రిమూర్తులలో నొకరో? సప్తఋషులలో నొకరో? కిన్నరులో? కింపురుషులో విద్యాధరులో? గంధర్వులో? ఎటులయిన నాముద్దుబాలుని రక్షించి పుత్రభిక్షనిత్తురని బతిమాలి వేఁడికొని యెద.

వీర.—మానినీమణీ! నీపలికినవారిలో నే నెవ్వఁడనుగాను. ఈస్మశానవాటి కాధికారియయిన వీరబాహుని సేవకుఁడను. వీరదాసుఁడను. నాతీ! కాటిసుంకమివ్వక శవసంస్కారణంబు గూడదు. నీవాఁడుదానవు కావున మన్నించితిని. కాదేని యీకరవాలంబునఁ గుత్తుక తఱుఁగుచుం టిని. మంచిమాటలతో స్మశానమున కిడఁదగిన పీనుఁగకప్పమిడుము. కానేని యాశవము నెత్తుకొనిపొమ్ము.

హంస.—హా! కుమారా! నాయనా! నీ శవసంస్కారణార్థమునకైన నీ కించుకనేల లేదాయెఁగా? పుట్టుశ్రీమంతుఁడనగు నీవు కాటినిర్భాగ్యుఁడవైతివియా? అయ్యో! తండ్రీ!

శా॥ సప్తాంభోధిపరీతభూవలయ సంస్థానావనీనేతయై
సప్తాశ్వాన్వయ పూర్ణవారిధి శరచ్చంద్రోపమానుండునై
సప్తద్వీపములేలు రాసుతుఁడు సంస్కారార్హమై స్వల్పభూ
ప్రాప్తిం జెందను నోఁచఁడే? అకట! నిర్భాగ్యుండె యీకాటికిన్?

హా! రాకుమారా! బహుప్రయాస లభ్యాశనప్రాసనములగు నిలుపే దలకించెను నీతల్లి నిలుపేదరాలాయెనుగదా? అయ్యో! దాసీవృత్తినినుండు నాకు ధనమెచ్చటినుండి వచ్చును? హతిచే విధిని నమ్మఁబడిన వితెఁడికి విభవముండునే? (వీరదాసునిఁజూచి) మహాత్మా! కట్టుబట్టలుతప్ప నాయొద్ద నొకకాసైనను లేదు. నన్నుఁ గృపఁగని యీపాపని శవమును సంస్కరింప సెలవిమ్ము.

**వీర.**—(హాయని నిట్టూర్పుసారించి)

మ॥ చెలువా! నీవిభుఁడబ్ధివేష్టిత భువిన్ జెన్నొప్పఁగా నేలి యా
ప్పాలనాశై సకలార్థముల్ కడిమిఁదాఁబోఁకార్చెనే క్రూరుఁడై!
కలికీ! నీధనిఁ బెట్టి విక్చె నినున్ గష్టాత్ముఁడై! యైన నీ
గళసూత్రంబున గోప్యమై వెలయు బంగారమ్ము నమ్మఁబడయెన్.

కలికీ! యీకపటంబులు చాలు, నీగళమున దాఁచికొనిన మంగళసూత్రము నమ్మి పీనుఁగసుంకంబిమ్ము.

**చంద.**—(ఱిచ్చవడి దూరమువచ్చి) ఏమియచ్చెరువిది? నామంగళసూత్రంబీ మహానుభావున కెటులఁగపడెను? (ఆలోచించి) అలనాఁడు నేను దుష్టనక్షత్రంబున ప్రథమరజస్వలనైతిని. నాతలిదండ్రులు కృపవీడి నిదురఁబోవు నన్నుఁ బేటికయందిడి సాగరంబున వైచిరి. నా యదృష్టవశమున నాపేటిక మునికి లభ్యమయ్యె. ఆమహాత్ముఁడు నన్నుఁ సంప్రీతిగాఁ బెంచి హరిశ్చంద్ర సార్వభౌమునకు నన్నిచ్చి పరిణయం బొనర్చెను. విధవాత్వదోషపరిహారమునకై తనతపోబలంబున నదృశ్యంబుగనుంచిన నామంగళసూత్రం బీమహానుభావునకు నగపడెనుగావున యితఁడు నాభర్తయనుట నిస్సందేహము. వర్ణము మారినది. అంగసౌష్ఠవమెల్ల నాభర్తను బోలినది. సందేహము లేదు. అయ్యో! ఎంతటిభోగి యెంతటిత్యాగి యీరీతి జోగియై నిలిచెను?

సీ॥ ఈతఁడు జగములనేలఁ జాలెడువాఁడు కాటికావలియయి కందె నేఁడు
వేల్పుగద్దియపైన వెలయుభూతానికి నాసనంబయ్యెనే యస్థిచయము!
రాజాధిరాజుల పూజలందిన రాజు ప్రేతవానికొలువున నిలిచె నేఁడు
భోగ్యభాగ్యాభోగ భూతలాధీశుఁడు శవకాష్ఠభస్మాంగ సంగుఁడయ్యె.

గీ॥ భూరిరాజన్యకోటి కోటీరరత్న
రాజినీరాజితాంఘ్రి సరోజుఁడకట
ప్రేతవాటిని శవసేవఁ బ్రీతినిలిచె
ధాతచేతకు నేమన! భూతలమున.

అయ్యో! కట్టడివిధీ! పాపిదైవమా! అహీన భోగభాగ్య నిరంతర సంతుష్టహృదయుఁడైన సార్వభౌముని యిట్టి హీనదశకుదించి యధమాధమమైన సేవకవృత్తిలో, నందున నధమజాతివాని సేవకవృత్తిలో నిలపితివియా? ప్రాక్కృతకర్మ ఫలంబవశ్యానుభవనీయంబు. (వీరదాసుకడ జేరి.) మహానుభావా! నామంగళసూత్రంబు నాప్రాణపతియగు హరిశ్చంద్రసార్వభౌమునకుఁ దప్ప నితరుల కగోచరంబుగ నుండునని నాపాలన తండ్రిమయుఁడు వరంబొసంగియుండెను. అట్టి సతీగళభూషణంబైన మంగళసూత్రంబు తమకెటులగపడెను? తామా హరిశ్చంద్ర సార్వభౌములవుదురని నమ్మిన దానను. నిజము తెలుపుదురని వేఁడెద.

వీర.—(కన్నీరుఁగార్చుచు) భామా!

సీ॥ సకలావనీతల మకలంకముగ నేలి యాలి నేలఁగలేని కూళ నేనె
భోగినై వైభవాభోగతఁగడునిక్కి త్యాగినై బలిసి జోగినేనె
ఉడురాజవదన! నిన్నడవులఁ ద్రిప్పను నిడుములఁగెట్టు జడుఁడనేనె
మానినీమణి! నిన్ను బానిసపనులకై నడుపధి నమ్మి చెఱఁగఁడేనె.

గీ॥ భామినీ! నీకు నెన్నియో బాధలుంచి
మనిన జీవచ్ఛవుఁడనేన వనిత! నేఁడు
సుతుని శవమునుఁ జూచియు క్షితిని నిలిచి
పలుకు మనుపీనుఁగను నేనె పతితుఁడేనె.

(అని కన్నీరుగార్చుచు కన్నులు హస్తమున మూసికొని కూర్చుండును.)

హంస.—నాథా! అడలకు. గ్రహచారవశంబున మాకిన్నికష్టము లొక్కటై కూడినవని నాకుదోఁచెడు. లెమ్ము. వ్యసనమ్మువలదు. మిన్ను విఱిగి పైఁబడినట్టు నీవున్న గతియేమి? నాథా! నీవీ వెలివాని సేవలో నెటులనిలచితివి?

హరి.—నాతీ! ఆదుఃఖంబు నేనేమని తెలుపుదు. అలనాఁడాయతిగడిబోధిని నిన్నమ్మిన ధనమా నక్షత్రకుఁడు తనబత్తెమున కయ్యెనని యపహరించి మరల మునిఋణమునకై నన్ను బాధింపసాగెను. సత్యపాశాబద్ధుఁడనై యత్నములేక నన్ను నేనమ్ముకొంటిని. వీరబాహుఁడను మతంగజుఁడు నన్నుఁగొని యీశ్మశానమునఁ బీనుఁగు సుంకము రాఁబట్టు పనికి నన్ను నియమించెను. నాతీ! అన్నిటనుఁ జెడితి. రాజ్యభ్రష్టుఁడనైతి. ఘోరాటవులఁ దిరిగితి. నిజదారను నిన్ను ధనమునకై పరిత్యజించితి. కులహీనునకు దేహమమ్ముకొని కొలువు చేసితి. నిజను తిని అయ్యో! యేకపుత్రుని మరణంబుఁ జూచితి. దైవము నన్నికనుఁ బ్రాణమునఁ గాపాడినాఁడు. మఱియేకష్టంబీ పాతకి కనులారఁజూచి యనుభవింప నెంచినాఁడో తెలియదు? దైవగతి దురూహ్యంబు గదా?

హంస.—నాథా! ననుముంచునంత దుఃఖముండినను ముదమించుక యిపుడు నాహృదయమునంకురించెను. ప్రాణపతీ! ఆముని ఋణంబు మితిమీఱికదీర్చి సత్యంబు సాధించితివిగదా! ఇఁక నీవిహపర లోకంబులు రెంటిని జయించితివి. ("సత్యేనలోకాఞ్ జయతి" యని యున్నదికదా?) నాథా! శరీరమునిత్యమా? విభవము శాశ్వతమా? ఇవి చంచలములని కదా ధర్మసంగ్రహమే మనుజునకుఁ గర్తవ్యంబని నీతిశాస్త్రమునందుఁ బలుకఁబడెను. ధాత్రీశా! సత్యమున నీరసన పవిత్రమాయెను. ఇఁక సుఖదుఃఖములకా చింతింపఁదగినది? "నహిసుఖందుఃఖైర్వినాలభ్యతే" యనువచనంబు లేదా? సుఖదుఃఖదేవతలిరుగుపొరుగువారుగదా? నాభర్తసత్యము సాధించి నిత్యకీర్తినిఁ గనెనను సంతోషమొక్కటియె నాకుఁ జాలు. నాకది పది వేలు. నాథా! మనపుత్రున కగ్నికార్యంబు సల్పవలెనుగదా? కా జేని కర్మచ్యుతికలుగును. పుత్రుఁడని సుంకముతీయవేని స్వామిద్రోహి యవుదువు. అది ధర్మవిరుద్ధము. నీవలికినచొప్పున మంగళ

సూత్రమ్ము చెఁగనమ్ముట కది నాస్వాతంత్ర్యపు సొమ్ముకాదు. మీరది కట్టినది. మీరే విప్పఁదగినది కావున మీరు దానిముడివిప్పి నాచేత నుంచితిరేని నేఁబోయి దాని నమ్ముకొనివచ్చెద.

వీర.—రమణీ! దానినివిప్ప నాయలవికాదు. విధాతవ్రాసిన వ్రాఁతఁ దుడవఁగలమా?

హంస.—ప్రాణపతీ! అటులైన నాయజమానురాలి యొద్దకుఁబోయి బలిమాలి సుంకము కొనిదెచ్చెద. నేను వచ్చునంతవఱకు నీ బాలునిశరీరము రక్షింపుము. దేవా! పోయివత్తునా?

వీర.—దేవీ! పోయిరమ్ము.

(హంసనారి నిష్క్రమము.)

హా! హా! అద్భుతమైన విధాయకుఁడగు విధాతవ్రాఁత, యవశ్యానుభోక్తవ్యంబు. అవక్రవిక్రమాన్వితుఁడై, మదనదహిత హృదయవ్యథావిధానంబుసంధించు హరిశ్చంద్రచక్రవర్తి యధమాధమ కులాధిపుని పదసేవసేయు సమయంబు తటస్థించెనుగదా? సజ్జనావనప్రతిపాలనాగుణపరాయణ మానసుఁడగు హరిశ్చంద్ర సార్వభౌముఁడు, దైన్యదశాపరిపాకతప్తచేతనుఁడై పుత్రశోకాతిశయ కర్శితయగు నబల నోదార్చి లాలింపఁజాలఁడాయెఁగా? మేదినీజనావనానుభావుఁడై ధర్మదయావిధేయమతియై నుతిఁగాంచిన హరిశ్చంద్ర మహీపతి యక్షీణపుణ్యలక్షణగేహయగు తనవరారోహ, బాష్పసంప్లావితనేత్రయై నిజతనయ సంస్కరణార్థంబించుక నేలను దీనాలాపముల వేఁడినను గరుణింపక హరిద్రానూత్రోల్లసితహైమ భూషణంబు సువాసినీత్వ సూచకమంగళ సూత్రంబు విక్రయించి సుంకమిమ్మని బింకములాడెఁగా! ఓరీ? క్రౌర్యమింతకంటె హెచ్చుండునా? దౌష్ట్యమింతకంటె హెచ్చునా? ఈకుటిలాలక కటికగుండియవాఁడని నన్నన్ని కాఁబోలు కటికచీకటిలో గాసులుదెచ్చెదనని

పోయెను. మార్గమునం దేదుర్మార్గు లాపన్మార్గవతిని నేమిసేయుదురో కదా? అయ్యో! ఆసతీమణి సచ్చరితంబు, ఆపతివ్రతాశిరోమణి సత్ప్రథావలంబనాయతమతి, ఆసాధ్వీలలామ సత్యశీలంబు, నేనెంతనుతించినను తక్కువయగునుగదా? ఆకుమారుని ముద్దుకుమారుని మరణంబున కపరిమితదుఃఖంబు నందుచు నన్నుగుర్తెఱిఁగిన పిదప నాచిత్తవిషాదవిమోచనార్థం బెన్ని వైరాగ్యంబులు పలికెను? తనదుఃఖమంతయు మనమున నందే ముంచుకొని నాసత్యవాక్శుద్ధికి ముదమందితినని పలికి నన్నూఱడించెను గదా? నాథా! ఎంతటిముప్పునకైనను ధర్మవిరుద్ధంబు సలుపఁదగదని బోధించిపోయెను గదా? ఎన్ని సత్కర్మము లొనరించినను, ఎన్నిధర్మములు నేర్చినను, ఎన్ని వేదాంత బోధనలువినినను, ఎన్నివైరాగ్యములు బూనినను, పుత్రశోకాగ్నియాఱునా? ఆఱదు. అయ్యో! లోహితా! అపన్నగరాజమునకు నీవేద్రోహ మొనర్చితివి? అపన్నిలయమై నిన్నది బాధింప నేల? తనయా! నీజననకాలలగ్నమునుఁజూచి కలకాలము పూర్ణాయువుగలిగి బ్రదుకుదువు నీవని కాలజ్ఞులు పలికిరిగాని కాలాహిచే నీప్రాణవాయువులు గ్రోలంబడునని పలుకరైరిగదా! తండ్రీ! అపరంజితూఁగుటుయ్యెలలో బరుండ నలవడిన నీమేను కంటకావృత కఠినకాననంబునఁ బడనోర్చెనా? తండ్రీ! నాదిక్కుఁజూడుము. నీ ముద్దుమోము జూపుము.

సీ॥ జననలగ్నముఁజూచి మనునుదీర్ఘాయువై యనినపెద్దలమాట యనృతమయ్యె
సాముద్రికముఁజూచి సార్వభౌమపదంబు గలుగునన్న హితోక్తి కల్లయయ్యె
నిలువునీటునుఁజూచి కులముద్ధరింపఁగఁ జాలువాఁడనుమాట కూలిపోయె
చెన్నారునినుఁజూచి వన్నెవాసియుఁగన్న చెన్నెల్లఁ దఱిగెరా చిన్నచిఱుత!

గీ॥ అన్న! నను గన్న నాయన్న! పన్నగంబు
నిన్నుఁగఱచెనె? నీవిటులున్న నేను
మన్న నేమిప్రయోజన మన్న! లేచి
నన్నుఁగనవన్న మన్ననఁ గన్న తండ్రి!

లోహితా! కుమారా! రాకుమారా! సౌభాగ్యలక్షణాకారా! ఉదారగుణాధారా! సుకుమారా! నీనవ్వులముద్దుమోము నాకన్నుల పండువుగఁ జూచునోము నోమనైతినిగదా? పులకండములు చిలుకు నీముద్దుపలుకులు నాచెవులవిందుగ విననైతినిగదా? తనయా! వినయసముదయా! సుగుణసముదంచితనయా! లేవవా? మాటలాడవా? ననుఁజూడవా? నాయనాయని నన్ను బిలువవా? అయ్యో! నే నెక్కడినాయన్నను? నిన్నును నీతల్లిని సాధ్వీమతల్లిని వీధినిఁబెట్టి యమ్మినద్రోహిని, కటికను, క్రూరుని, తండ్రియని పిలువనగునా?... అయ్యో! పిచ్చివాఁడనై యేడ్చిన కొడుకువచ్చునా? రాఁడు. దైవమా! ఆ కుసుమకోమలగాత్రికి బాలునిసుంకమునకై కానుదొరకునో దొరకదో?....(అదిక్కున నెవరో శవము దెచ్చినట్టున్నది. పోయి కప్పము రాఁబట్టెద.)

(నిష్క్రమము.)

---

## ద్వి తీ య రం గ ము.

రా జ వీ ధి.

*విశ్వామిత్రుఁడు, నక్షత్రకుఁడు, భీషణుఁడు, విభీషణుఁడు, ధీకరుఁడు, చంద్రమతి, సోమశేఖరుఁడు.

విశ్వా.—నక్షత్రకా! నాయొనరించిన కార్యంబులెల్ల నామహీపతియెడ వ్యర్థమయ్యెను.

చ॥ ధనమును వేఁడి కద్ధనముదాఁచితి మానవనాథుచెంతి నా
ఋణముగ, సంత్యజాంగనలఁదెచ్చి యిలాతలమెల్ల లాఁగితిన్,
వనతలమం దసహ్యమగువంతలఁ గూర్చితిఁ, జిచ్చుఁబేర్చితిన్,
వనితనునమ్మితిన్ సుతుని ప్రాణముఁబాపితి, బొంకఁడాయెఁగా?

(అనుచుఁ జింతించును.)

నక్ష.—గురువుంగారూ! ఏల చింతించెదరు? తగ్గుముగ్గు లేరికిని దప్పవు. ఇంగలము సంగతిని బంగరమునకువన్నె వచ్చినరీతిగ మనబాధలచే నాపార్థివుని సత్యవాక్శుద్ధి హెచ్చగుచున్నది. గురువులవారూ! ఆ హరిశ్చంద్రభూపాలునికంటెను నతని భార్య మనశ్శుద్ధి హెచ్చండీ. మార్గమునందా భూపాలున కనేకకష్టంబులు కల్పించి బాధించి నప్పుడా మహీధవుఁడించుక పాలుమాలెనేని యొకటబొంకునో యని భీతిఁజెందిన దానిబలె డీయనివచ్చి నన్నదలించి యతని హృదయ మున ధైర్యసారమునించుచుండెను. ఆచంద్రమతి యసాధ్వురాలు. ఇవియన్నియుఁ బ్రారంభముననే నేనాలోచించియుంటిని. హరిశ్చం ద్రునిచేఁ గల్లలాడింపఁ బ్రతిజ్ఞపట్టితినని మీరన్నఁడు నాతోఁ బ్రస్తా పించితిరో నాఁడే "మీకిది యసాధ్యమైనపని కానఁడుపోనేల? మా కేమదిగ నేల? "అన్యథా చింతితంకార్యం దైవమన్యత్ర చింతయేత్" యని యున్నది అనాథులను దైవము రక్షించును. కాకదంతగవే షణమసాధ్యము. కోపము పాపకారణము" ఈహితములు మఱియు ననేక హితములు నాఁడే మీకుఁ దెలుపవలెనని యెంచి మాటలు నాలుకవఱకువచ్చెను. మీముఖభావము వీక్షణముల తీక్ష్ణముమాచి లేని కనైశ్వరదశ నేనెందుకు దెచ్చుకొనవలెనని యూరక నామా టలు నేనే లోపల దిగమ్రింగితిని. మీదుర్దశ కెవరేమి సేయుదురు? ఊరకయుండలేక యుబుసుపోకకు మందుపుచ్చుకొనియెదరు. కాలు ద్రవ్వి యెవరితోఁ గలహమాడ యత్నింతురు. ఇపుడు వ్యసనపడి ప్రయోజనమేమి? నిన్నటిదినమే వసిష్ఠులవారు విశ్వేశ్వరదర్శనము నకై యిచటికివచ్చినారు. నేఁ జూచితిని. మానససరోవరఘట్టములో దిగినారట. వారిని దర్శించి యోడితిని క్షమింపుఁడని పలుకుఁడు. వారు శాంతమూర్తులుగనుక మిమ్ముక్షమింతురు.

విశ్వా.—ఓరీ మూర్ఖా! ఏమికూసెదవు? ఇట్టి ప్రల్లదంబులా నీవాడఁదగి నవి. హెచ్చరిక. హెచ్చరిక. మహాతపోధన సంపన్నుఁడైన విశ్వామిత్ర బ్రహ్మర్షి, విద్యాధికుండైన వసిష్ఠుని దూషణవేఁదునా? అటు వేఁడిన వింధ్యపర్వతమంబుధిపైఁ దేలదా? ఆ రాజాధముని నిప్పుడే వదలుదునా? వదలను. వదలను. ఏమీ భీకరుఁడింతవఱకు రాకయున్నవాఁడే? ఏమిచేసి యుండును? కార్యము చెడి యుండునా?

(భీకరుని ప్రవేశము.)

భీకరుఁడు.—స్వామీ దండము.

విశ్వా.—ఓరీ! భీకరా! పోయినపని యేమిచేసికొని వచ్చితివి? ఎటులొనరించితివి?

భీక.—స్వామీ! తామిచ్చిన మత్తుమందు రాజనగరు కావలివారిపైఁ జల్లితిని. వారు చచ్చినవారివలెఁ బడియుండిరి. నగరులోఁ బ్రవేశించి దాదికొమ్మునయున్న బిడ్డనుదీసి యెఱుఁగనటుల గొంతుపిసికి యెత్తుకొనివచ్చి కాటిమార్గమున బాలునిఁద్రోసి సొమ్ములు దెచ్చితిని.

విశ్వా.—ఏవీ యాసొమ్ములు?

భీక.—స్వామీ! సొమ్ముల మూటయిదిగోఁ జూడుఁడీ.

విశ్వా.—అటులైన ముందు జరుగఁదగిన కార్యంబు నీ చెవులోఁ జెప్పెదను రమ్ము.

నక్ష.—స్వామీ! గురువులవారు! నేనున్నానని రహస్యము గోరితిరో? నానుండి కాఁదగిన కార్యమాయెనని నాపై మీకప్పుడే యనుమానము గలిగెను కదా? మంచిది నేనే దూరంబుగఁ బోయెద,

విశ్వా.—నక్షత్రకా! నీపై ననుమానముండునా? కటికటికటికి వేయి కన్నులు వేయిచెవులునుండును. కావున రహస్యముఁగోరితి.

(అనుచు శ్రీకరునిఁ జేరి వానిచెవులో నేమొ మాటాడుచుండును.)

శ్రీక.—స్వామీ! తెలిసెను. తెలిసెను. మీకుపలికినదంతయుఁ "బాఁచా" దప్పకచేసెదను. మీమెప్పు లందెదను.

విశ్వా.—అటులైన నేనదృశ్యుఁడనై నీచర్యఁజూచుచుండెద. (నక్షత్రకునిఁజూచి) నక్షత్రకా! నీవును నావెన్నడిరమ్ము.

నక్ష.—స్వామీ! మీవెన్నడికాదా మున్నడికాదా రావలెను. రాకతప్పదు. మీరుపట్టినపట్టు వదలువారుకారు. వృథాశ్రమపడియెదరు. వాతూలంబు తూలంబును దూలించినరీతి నామహీపాలునిపై మీ రొనరించు దుష్కృత్యంబులెల్లఁ దైనము దూలించును. ఏనుఁగు కొమ్మును వెనుకఁ ద్రోయసాధ్యమా? పుల్లతో మేరుశైలము సాధించురీతి దైవసహాయ్యముగల భూపాలుని మాయోపాయముల సాధింపఁజాలదరు. "ఎగదీస్తే బ్రహ్మహత్య దిగదీస్తే గోహత్య" యనినట్లు నాకు రెంట సంకటము కలిగించుచున్నవారు. యథార్థమాడితినేని యగ్గివలె మీరుమండుదురు. ఇందున మీరాడితిరేని మితిలేనిసంతాపము నాకుఁగలుగును. ఏమిసేయుదు? అనలేను అనుభవింపలేను.

విశ్వా.—నక్షత్రకా! చాలు. చాలు. నోటికి తాళమువేసికొని నా వెంటరమ్ము.

నక్ష.—గురువులవారూ! నిజమాడితిరి. నోటికిఁ దాళమువేసికొనదగి యవస్థ నాకు సంప్రాప్తించినది. అటులనే చేయుచువచ్చెద.

(విశ్వామిత్ర, నక్షత్రకుల నిష్క్రమణము.)

(శ్రీకరుఁడు నమ్మఁగున దాఁచికొని యుండును.)

(హంసనారి ప్రవేశము.)

హంస.---(మార్గము నడచుచు) ఏమియిది కాలికేమో తగిలెను? చూచెద. (అనుచు వంగిచూచి) అయ్యో! ముద్దుబాలుఁడే! చక్కఁదనమున బాలార్కుని బోలుఁడే? ఏల యిచటనుంచెను? ఈ బాలుని తలిదండ్రు లెవరుందురు? అయ్యో! ఊపిరియాడక యున్నదే! దేహము చల్లఁ జల్లనయినదే! కట్టెవలె రాపడినాఁడే! ఏని తలిదండ్రులు మావలె దౌర్భాగ్యులు కాఁబోలు.

భిక.—(వచ్చి) అమ్మా! నీవెవతెవి? నడురేయి నేల యిచ్చటికివచ్చితివి?

హంస.---అయ్యో! నేనొక విప్రునింటి దాసిని. మృతుని శవసంస్కారార్థము, కాటి కాసుకు గతిలేక నాయజమానురాలగు కలహకంఠిని వేఁడి తెచ్చుటకై వచ్చుచుండ దారి నీపోరఁడెవఁడో ప్రాణంబులు విడిచిపడియుండెను. చూచుచుంటిని.

భిక.---అయ్యో! చెల్లెలా! కాటికాసునకు గతిలేనంతటి బీదరాలవా నీవు? సోదరీ! నేధనికుఁడనై యుంటిని. నాభార్య వ్యభిచారిణియై నన్నువదలిపోయెను. ఉన్నయొక పుత్త్రుఁడు చనిపోయెను. సంసారములో విసుకుపుట్టి విరక్తుఁడనై సన్న్యసింప నీవురికి వచ్చినవాఁడను. నాకుఁగల నగ లేటికైన బీదవాండ్రకిచ్చి ముక్తుఁడఁగాఁ దలంచియుంటిని. వెదుకఁబోయినతీవ కాలఁదవిలినట్లు నీవగపడితివి. పేదరాలవు నీవు. కావున నీకీ నగలమూటనిచ్చెద. (అనుచు నగలమూట యిచ్చును.)

హంస.—అయ్యో! నాకిన్ని నగలేల? నేనేమిసేయుదు? వలదు.

భిక.---అయ్యో! నాటచ్చిచెల్లెలా! నగలేలయని యాడువారనఁదగునా? నాభార్య యాపాదమస్తక పర్యంతము మోయలేనన్ని నగలు చేసికొనియుండియును "నగలో నగలో మరుగుడా నగలో" యని నన్ను ప్రాణములు తినుచుండెను.

భీమణ, విభీషణుల ప్రవేశము.

భీమణుఁడు.---విభీషణా! దొంగపాదముల జాడ యిచ్చటనే తెగిపడి యున్నది. వాఁడీ మార్గముననే పోయెనని నాకుఁదోఁచెడు.

విభీషణుఁడు.—అనుమానమేల? రాచనగరునుండి యిచటివఱకు నొకటే విధమయిన యడుగులఁ జాడ లగపడుచున్నవి. ఆదురాత్ముఁడు ఆబాల హంత యీదిక్కుననే పోయియుండును. ఇపుడే పోయియుండును. ఎచ్చటికిఁబోనీ మేము వదలుదుమా?

భీక.— -(హంసనారిఁ బట్టికొని) అయ్యో! తలారులారా! దొంగకై మీ రేల వెదకెదరు? సొమ్ముతో దొంగనుబట్టినాను. రండి త్వరలో రండి. అబ్బా! దీనిది యెంత సామర్థ్యము? రాక్షసిపో. నన్ను కొసరి క్రిందవేయుచున్నదియే!

(భీమణ విభీషణులు హంసనారిఁబట్టి సొమ్ములమూట గుంజికొని.)

(భీకరుఁడు నిష్క్రమించును.)

భీమ.—అయ్యో! బొమ్మరాకాసీ! అయ్యో రాక్షసీ! ఎంతపని యొనర్చితివే? నీగొంతుఁగోసెదఁ జూడుము. (అనుచుఁ కత్తియెత్తును.)

విభీ.—భీమణా! ఎంతజగజంతయైనను యింతియిది. మగువనేల చంపితిరని రాజు మమ్ము దండించునేమో? దొంగను పట్టుపని మనది. దండించుపని దొరది. కావున నీపాపిని సొమ్ములతోను పాపనితోను మనయేలినవాని యొద్దనుంతము. అతఁడేమయిన నొనర్పనిమ్ము.

భీమ.—నిజము దీనినీడ్చికొని పోవుదమురమ్ము.

(నిష్క్రమణము.)

(విశ్వామిత్ర నక్షత్రకుల ప్రవేశము.)

విశ్వా.—నక్షత్రకా! చూచితివిగదా! భీకరుని ప్రతాపము! దానిమాయోపాయము! ప్రతిభ యిటులుండవలెనుగదా?

నక్ష.—గురువులవారూ! నిజమాడిన నిష్ఠురములు నాకేల? మీరొడలికి లేనివ్యాధిఁ గొనితెచ్చుకొని బాధపడుచున్నవారు. ఔఁగాదని వంకలొత్తువారు లేరు. స్వామీ! కర్పూరము తిప్పనుంచినను దనగంధము వదలునా? బాధలిడుదురేయని భయపడి హరిశ్చంద్రుఁడు కల్లలాడునా? అతని యనుభవము నాకు బాగుగనున్నది. తలఁతగిలినది. దాయాదికి దాయాదిపగ. జాతికి జాతిపగ యనినట్టు వసిష్ఠునితో గజకచ్ఛపములవలెఁ బోరుపెట్టుకొని మీరు పోరాడుచున్నవారు. మీ పోరాటము మాన్పనే వైనతేయుం డవతరించునో తెలియక యున్నది.

విశ్వా.—నక్షత్రకా! ఇటీవల నీవు పొగరుపోతువయి పోసరములాడుచున్నావు. ఆ హరిశ్చంద్రునిపై జాలి చాలుగఁబట్టినది కాఁబోలు.

నక్ష.—స్వామీ! మీయానతికి వేఱుదలతునా? మీమాటకు మాఱుపలుకుదునా? ఆనిర్భాగ్యునిపై నాకుజాలియేల? వచన పరీక్షకు నాక మెతుకుఁబట్టి చూచినఁజాలునని న్యాయశాస్త్రమున విధింపఁబడినది. ఆరీతిగ హరిశ్చంద్రునిఁ బరీక్షించితిమి. అతఁడనృతమాడడని తెలిసెను. మరల నతని కీబాధలేల?

విశ్వా.—నీకుబుద్ధిలేదు. ఎద్దుమొద్దువు నోరుమూసికొని పడియుండుము రమ్ము.

(నిష్క్రమణము.)

---

## తృతీయరంగము.



### రాజనగరు.

ప్రతాపచంద్రదేవుఁడు, హంసనారి, భీషణుఁడు, విభీషణుఁడు.

(సోమశేఖరుని శవము.)

ఉ॥ నాసుకృతోరువైభవము నాగృహదీపము నాతపమ్ము హా!
నాసుఖవార్ధి నాఘనసనాథసంపద నాముదమ్ము నా
వాసిచెలంగు నాత్మజునిఁ బాయఁగఁజేసిరి యెవ్వరోకటా యా
భాసురమూర్తినిఁ గానక ప్రాణమునిల్పనె నాకునిద్ధరన్?

అయ్యో! తనయా! దాదిఱొమ్మునఁ బఱుండి హాయిగనిదురించు నిన్నేపాతకి యేబాలఘాతకి దొంగిలించెను? అయ్యో! నగలకై దొంగిలించి యుండినచో వాఁడేలనగలతో నిన్నెత్తుకొనిపోయెను. వెదుకఁబోయిన తలారులు నాసుతునివార్త కనిపెట్టరైరి కాఁబోలు.

(భీషణ, హంసనారి, ప్రవేశము.)

భీష.—రాజాధిరాజా! ప్రతాపచంద్ర దేవరాజా! జోహారులు! స్వామీ మీసుతునిపాలికి మృత్యువయిన ఘోరపాతకి శిశుహంత్రిని యిదిగో చూడుము. ఇదిగో నీశిశు శవము. ఇదిగో నీబాలుని భూషలు.

(రాజకుమారుని శవముఁజూచి.)

ప్రతా.—హా! తనయా! చందమామను నిరసించు నీముద్దుమోము పాలిగానయ్యెనే యీభామ? పుత్రా! నీప్రాణవాయువులఁ గ్రోలుక్రూరవ్యాళమాయెనా యీనాళీకవదన? నందనా! నీకంకణకింకిణీకాంచనభూషలీకలికికిఁ గంటిమంట లాయెనా? కొడుకా! నీబంగారు చిలుకలరావిరేక యీబొమ్మరాకాసికి నంగారజ్వాలలాయెనా? చిఱుతా! నీయుంగరముల పచ్చనిడాలీ పచ్చిరక్కసికి వెక్కసమాయెనా! అయ్యో! ఈమానినీపిశాచికి నీవేదోషమొనర్చితివి? తన

యా! ఈదానవి నిన్నెట్లుల హింసించె? (హంసనారిఁ జూచి) మానవపిశాచమా? నీవీబాలునెటు మింగితివి? వలయునేని నను వేఁడియుండిన నీకాభూషలుకన్న హెచ్చువెలగల భూషలిచ్చుచుంటిని గదా? భూతల భూతమా! శిశుశిరోనిర్ఘాతపాతమా! సతీరూప శార్దూలమా! ఈబాలుఁడు నీకేమంతోనర్చెను? ఈబాలుని కుత్తుక త్రిప్ప నీకెటు చేతులాడెను? నీది కన్నకడుపుగాదా? గొడ్రాలవా? నీవెవతెవు? ఈపనికినిన్ను ప్రేరేచినవారెవరు? మాటలాడుము.

హంస.—(మాటలాడక బిచ్చవడి తలవంచికొని యుండును.)

భీమ.—ప్రభూ! ఆప్రశ్నయడుగనేల? పురుషులకంటె నాడువాళ్లు [illegible] అంతలు సాహసము హెచ్చని జనులాడరా?

ప్రాచం.—జగజంతా! మాటలాడి ప్రాణము దక్కించుకొందువా? మౌనమూని ప్రాణము గోల్పోయెదవా?

హంస.—(మౌనమూని యుండును.)

ప్రాచం.—(భీమణవిభీషణులంజూచి) తలారులారా! ఈప్రాణి ప్రాణమునకుఁ దెగించినది. మౌనమూనినది. మీరు దీనిని గొనిపోయి శ్మశానాధికారియగు వీరబాహున కొప్పగించి దీనిశిరముఁ దెగనఱుకుమని తెలుపుడి. ఈపాతకాధమురాలిని నాయెదుట నిల్వకుఁడి కొనిపొండి.

భీవి.—చిత్తము.

(నిష్క్రమము.)



# పంచమాంక్రము.

## శ్మశానవాటిక.

వీరదాసుఁడు, వీరబాహువు, హంసనారి, లోహితుఁడు, సోమశేఖరుని శవము, విశ్వామిత్రుఁడు, వసిష్ఠుఁడు, నక్షత్రకుఁడు, కాలకౌశికుఁడు, పరమేశ్వరుఁడు.

వీరదాసుఁడు.—(లోహితుని శవముఁజూచి.)

సీ॥ చిగురులకెగిచాయ నగియెడినునుమేని సింగారమా యిది! చిట్టితనా!
హరినీలమణి కాంతిహరియించి నటియించు యలకలా యివినీకు నసుఁగు తనయ!
బంగరుకడియముల్ రంగుగాఁదాల్చిన కరములా యివినీకుఁ గన్న తండ్రి!
అందియల్ ఘులుఘుల్లు మనసడయాడిన పదములా యివినీకుఁబడుచుకుఱ్ఱ!

గీ॥ కలములీనెడు కన్నులా! కన్నతండ్రి!
చెలువమగ్రరారు వీనులా! చిన్నిబాల!
అరవిరులబోలు పలుచాల! యరిదిపట్టి
కాటిపాలయి పోయితే నీటుదక్క!

హా! విధీ (అనుచుఁ దలవంచికొని యుండును.)

(వీరబాహు, భీమణ, విభీమణ, హంసనారుల ప్రవేశము.)

వీ॥బా.—వీరదాసా! ఏమి చింతించుచున్నావు? ఈ బాలుఁడెవఁడు?

వీ॥దా.—వీరబాహూ! వీఁడొక దౌర్భాగ్యుని కొమరుఁడు. వీనితల్లి కాటిసుంకమివ్వను గతిలేక వీనుఁగునిటవదలి సుంకము విత్తమెత్తుకొని వచ్చెదనని పోయెను. ఇదివరకు రాకగడిసెను. పాపిబ్రహ్మ, ప్రపంచమున నిట్టి నిర్భాగ్యులను నైతము పుట్టించునేయని చింతించుచుంటిని.

వీ॥బా.—వీరదాసా! ఈమగువను గనుము. ఇది నాశీరూపమును దాల్చిన మహామారి. మేకవన్నెపులి. ఈపురిరాజనగమ్ము ప్రవేశించి రాజ కుమారుని కంఠంబుఁద్రుంచి యాబాలుని నగలు హరించినది. అతి పాపాత్మురాలు. దీనికంఠంబు ద్రుంపుమని రాజాజ్ఞయయినది. కావున నీకరవాలమున నీతరుణిఁ ద్రుంపుము. ఇదిగో రాజాజ్ఞ సూచకంబగు ముద్దుటుంగరము.

వీ॥దా.—(హా! విధీ! యనుచుఁ గూర్చుండును.)

వీ॥బా.—వీరదాసా! ఏమీ! అటునిశ్చేతనుఁడవై గూర్చుంటివి? కాటి కావలివాని కింతటి కనికరముండిన గానెటువచ్చును? ఈరీతిఁ గరుణ వహించి నీనుఁగకప్పము రాఁబట్టక వదలెదవా యేమి? ఏమో మో సముచేయుచున్నావని నాకుఁదోఁచెడు. కాదేని నీవు కొలువునకు వచ్చిన మూఁడు నెలలలోను వచ్చుబడి తక్కువైనది.

వీ॥దా.—వీరబాహూ! అట్టి యధర్మవృత్తికి నట్టి స్వామి ద్రోహము నకు నెంత నికృష్టదశలోఁ గుందుచుండినను వీరదాసుఁడు లోఁ బడునా?

వీ॥బా.—అటులైన నీకలికికంఠంబుఁద్రుంప నేలసందియించెదవు?

వీ॥దా.—వీరబాహూ! ఈకలికి నీబలుకు నంతటి దుష్కృత్యంబొనర్చి యుండదు. కాశీరాజే విచారము సలుపక యిట్టి యానతినిచ్చియుం డును.

వీ॥బా.—వీరదాసా! నీకాయధిక ప్రసంగమేల? రాజులపై న్యాయ విచారణసేయ నీకధికారమున్నదియా? వైళమ్మె యీవనితకుత్తుక తెఱుగుము.

వీ॥దా.—(కన్నులుమూసికొని బిచ్చపడినిలుచును.)

వీ॥బా.—ఓరీసేవకా! వీరదాసా! ఈయింతి వైళమ్మె చంపెదవా స్వామి ద్రోహివయ్యెదవా?

హంస.—శ్మశానరక్షకా! వలదీస్వామి ద్రోహబుద్ధి. ఇహపరములు రెండు నాలోచింపుము.

హరి.—(వీరబాహుం జూచి) వీరబాహూ!

చ॥ నెఱచినవాని, యుద్ధమున విల్లును వీడుచు వెన్నుఁ జూపుచుం
బఱచినవాని, బాణములబాధకు నోర్వఁగలేక పూరియుం
గఱచినవాని, నీవెగతి కావు మటంచనువానిఁ, ద్రావిమే
నక్కఱచినవానిఁ, ద్రోవఁ గను మామకఖడ్గము నాటిఁ ద్రుంచునే?

అయ్యా! అబలురగు నబలల తలఁద్రుంచు నలవాటు నాకరవాలమునకు లేదు. కావున నేనెటు లీ సాధ్వీమణి తలఁద్రుంతును?

హంస.—ప్రాణపతీ! సమస్తనీతిశాస్త్రార్థకోవిదుఁడవగు నీకు నేఁ దెలుపవలెనా? "ఎంతటి పాతకినైనను భరింతు, స్వామిద్రోహిని భరింపఁజాల" నని మున్ను భూదేవి శ్రీహరితోఁ బలుకదా? "జాతస్య మరణంధ్రువం" యని యనుభవజ్ఞానంబునఁ బెద్దలాడిరిగదా? శరీరమనిత్యమని తెలిసికదా ధర్మసంగ్రహమే ముఖ్యమని జ్ఞానులాడిరి? వధించువాఁడెవఁడు? వధ్యుఁడెవఁడు? ఈకర్మములన్నియు జగన్నాటక సూత్రధారియగు శ్రీహరిమాయలు వలదు సందేహంబు. ప్రాణపతీ! బాలఘాతినియని సడిఁగాంచి యూరకుంటినే మనఁజాల. పరుల కరవాలమునకు బలియగుటకంటెను, నీదార నీకరాంచిత కృపాణధారకు బలియగుట ధర్మము కాదా?

ఉ॥ దారశిరమ్ముఁ ద్రుంపుమ యుదారపవిత్రచరిత్ర! నే నమ
స్కారి నొనర్తు నీకు. మది సందియ మేల? విరుద్ధధర్మ మిం
దారయ గానరాదు. పతియానతి మీఱఁగ నేల? దానిచే
గౌరవమంద నేల? భిదురమ్ముఁ గరమ్మున బట్టుఁడీ! వడిన్

(క్రిందపడిన కరవాలము చేతికిచ్చి.)

నాథా! ధైర్యమ్మున నీదారశిరముఁ దఱుగుము. వలదు సందేహము.

**వీరదా.**—నాతీ! నీవెన్నివైరాగ్యములు పలికినను నీవెన్నిధర్మములు తెలిపినను నాయునస్సందేహంబు మానదు.

మ॥ మనినందాకను బ్రోచువాఁడనని నేనుంజొప్పఁగా వహ్నిబ్రా
లను దిక్పాలకులెల్ల సాక్షులుగనిల్పీ బాసనేఁజేసితిన్
వనజాతాయతనేత్ర! నా శపథముల్ వమ్మౌఁగదా! దానిచే
కనవే! నాకొనఁగూడు నాశపథముల్ గాంతా! నిరంతిన్యథల్.

(అనుచుఁ గరవాలంబు పాఱవైచును.)

**వీ॥బా.**—ఏమి వీరదాసా! నిన్ను నేఁగొనునపుడు నాయానతిచొప్పునఁ బనులు నెరవేర్తునని పలుకవా? ఆపలుకులన్నృతము లేనా? అనృతవాదీ! స్వామి ద్రోహీ! నీకుఁగాను నే గష్టపడి యార్జించినసొమ్మంతయుఁ గొల్లఁబెట్టితినే? ఏడీ! అలనాఁడు నీమంచినడవడికకుఁగాను బూటకా పయిన నక్షత్రకుఁడు?

**నక్ష.**—అయ్యా! వచ్చితిని. వచ్చితిని. నేను దేశము వదలి పఱుగిడిపోవు దునని తలఁచితివియా! వీరదాసునకు నేఁబూటకాపునైన తప్పునకై పగలురాత్రి వానినిఁ గాచియున్నాను. దూరమునుండి మీన్యాయ మంతయు వింటిని. (వీరదాసునిఁజూచి) హరిశ్చంద్రా! ఇట్టి చెడుగుణ ములు నీ కెన్నఁడులవాటాయెను. నీవేమో సత్యశీలుఁడవు పెద్దమనీ షివి మోసగింపవని నీకుఁ బూటకాపునైతిని. ఇంతటి మోసగాఁడ వని తెలియనైతిని. పచ్చనిదంతయు బంగారమని నమ్మితిని. ఎవరికొం పను ముంప నింతటి యెత్తుగడపన్నితివయ్యా?

**వీదా.**—నక్షత్రకా! హెచ్చుమాటలాడకు. అలనాఁడు నీవీవెలివానికి నన్ను వెలకిచ్చినపుడు రెండుపనులు సేయనని నేఁబలుకనా? అందున ధర్మవిరుద్ధకార్యంబు సలుపనని నేనుడువనా?

**నక్ష.**—అయ్యా! ఇదిధర్మము ఇదిధర్మవిరుద్ధమని నిరూపణము సేయఁ దగినవాఁడవు నీవేనా? నీదార దొంగతన మొనర్చి రాజదండనఁ

బొందియుండ నట్టి దురాత్మకురాలిని దండించుట యధర్మమా? ఏమి మాటలాడెదవు? నేను సత్యమాడువాఁడనని యెగిరిపడి మాటలాడితివి గదయ్యా? నిజమేయుండునని నమ్మితిని. ఇంతటి మోసగాఁడవని నమ్మనైతిని.

చం.—బ్రాహ్మణోత్తమా! ప్రారంభమునుండి నీమాటపోటు లీటులపోటులై నన్నుఁ జంపుచున్నవి. ఇది ధర్మవిరుద్ధముకాదేని నాధర్మపత్నినిఁ జంపెద.

(కాలకౌశికుని ప్రవేశము.)

కాల.—అయ్యో! నేను లోకులకు శనైశ్చరుఁడుగ నుంటిని. నాకీ కలహకంఠియను భార్య శనైశ్చరురాలుగ నేర్పడెను. దానియెదుట నేఁ గూర్చున్ననుదప్పు లేచిననుదప్పు పండుకొన్ననుదప్పు. ఇటు నను బాధించి తలపై మిరియాలు నూఱుచున్నది. ఏమిసేయుదు? దానిని వెళ్లఁగొట్టి ఘటశ్రాద్ధము చేసికొనవలెనని బుద్ధిపుట్టెడు. అగ్నిసాక్షిగ భరించిన భార్యను వదలుట ధర్మశాస్త్రవిరుద్ధము. ఉండినధనమెల్లఁ గొల్లపోసి విక్రయమునకుఁ గొనినదాసి రాదాయెనని కినిసి నాతలఁబగులఁగొట్టెను. కాళ్ళతోఁ జేతులతోఁ దన్నెను. రాళ్లతో ఱువ్వెను.. ముందేమి పాపమొనర్చితినో? నాయగ్రజుఁడు యముఁడై నన్ను కాలువిఱుగఁదన్నెను. నాటినుండి వడిగ నడవలేను. నేఁడీ శనైశ్చరురాలు నాశరీరమంతయు విఱుగఁదన్నెను. ఎన్నఁడు నాకీ కష్టంబు దీఱునో దైవంబెఱుంగు. ఆదాసి వయసుది. నాకుదొరకునా? ఈపాడుపడిన యొలికిలో నుండునా? ఏమీ యుచట గుంపు చేరినది! అందున్నదేమో పోయిచూచెద. ఉండినచోఁ దన్ని యీడ్చుకొనిపోయెద. (ముందటికిఁబోయి నక్షత్రకునిఁజూచి పట్టుకొని.) ఏమోయి నక్షత్రకా! ఎవరబ్బగంటని యెంతసొమ్ము మోసగించితివి? ఎవనికో కొడుకనికి హరిశ్చంద్రుఁడని పేరుపెట్టి దోవలోఁబోవు

మిటారికత్తె నొకదాసిని వానికి భార్యయని తగులఁగట్టి విధినిఁబట్టి విక్రయించి మూటకట్టుకొనిపోతివే? ఎవరియబ్బ సొమ్మది? నీవాంగ హరిశ్చంద్రుఁడు పలుకెడెను. ఆ మిటారి చంద్రమతి సుతిగను. నీ వొకఁడు నాకోఁకడవా. మంచిమాటలతో నానవ్వుడు దాసిని చూపెదవా? నిన్ను నాభార్యయొద్దకు నీడ్చుకొని పోవుదునా?

నక్ష.---(ఇది నాగ్రహచారము.) అయ్యా! హరిశ్చంద్రుఁడు విక్రయించినపుడు నేనచట నక్షత్రకుఁడుగనుండి నాసొమ్ము రాఁబట్టుకొంటినిగాని నీదాసికిఁ బూటకాపుగ నేనుంటినా? దాసిపోయిన దోసము నీదేకాని నాయదికాదు.

కాల.---ఈమోసపు మాటలకు నేమోసపోదునా? నీవు మర్యాదగల గృహస్థువు. నాకుఁదెలిసినవాఁడవు. మోసగింపవని యెంతెంతో యాలోచించి యాగయ్యాళిని గొంటిని. నిన్ను నమ్మి కొంటిని కావున మంచిమాటలతో నాదాసినిఁజూపెదవా? నాధన మిచ్చెదవా? నాభార్యయొద్దకు వచ్చెదవా? నిన్ను వదలను. నాయబ్బ సూరప్పతోడు వదలను. నాయమ్మ ఛాయమ్మతోడు వదలను.

నక్ష.—ఇదియేమయా నాగ్రహచారము? నేనేమయిననుఁ జేయుదునుగాని నీభార్యయొద్దకురాను. ప్రపంచమందెవ్వను రెండుదినంబులుఁ బ్రదుకఁదలంచినాను.

కాల.—అటులైన నాదాసినిఁ జూపుము.

నక్ష.—అయ్యా! చూపెదను (అనుచు హంసనారినిఁ జూపును.)

కాల.—(హంసనారిఁబట్టుకొని గంతులువైచుచు.)

శా॥ ఓ నేస్తుంటిమిటారి! యా నిజగజంతా! అంకతా! ఱిక్కతే!
యా నా నాలిటిసారి! రంధముగునే! యయ్యారే! గయ్యాళి! 6

కానే! కచ్చెల యెుమ్మెలాడి వలువా! యా(బో(తురిలిగా బలా!
యానే(గుమ్మరి? మందిరమ్మునకు రమ్మా! లొత్తు! మర్యాదలో(గా.
(అనుచు నీడ్చును.)

వీ।బా.---(స్వగ. దాయాదికిలిగ వీ(డెక్కడికినై క్కరు(డు, వచ్చెను?) అయ్యా బాపనయ్యా! అమగువ రాజదండనకు లో(బడినది. దాని తల నఱకవలెను. దానినివదలెదవా? నిన్ను(దవలి నేను వదలింతునా?

కాల.—అయ్యా! వీరబాహూ! ఇదినాదాసి! హెచ్చువెలయిచ్చి కొన్నాను. దీనికై నాయిల్లే పా(డాయెను. నాయింటిలో( బనిచేయువారు లేరు.

వీ।బా.—కాలకౌసికా! నీవు దొంగతనమున ధనికు(డైతివని నే(తలంచెద. ఈదాసి నీయింట పగలు పనులుచేసి రాత్రి పరులయిండ్లు చొచ్చి ధనముదోచును కా(బోలు? ధనార్జనకు మంచియెత్తుగడ యె త్తితివి.

కాల.—అధమజాతి విధవా! ఏమి కూసెదవు? బ్రాహ్మణు(డనై దొంగతనము చేయింతునా? నోరు కడగికొని మాటలాడుము. నీవలె వెలివా(డనై పీను(గుసొమ్ము లపహరించి బ్రదుకువా(డననికొంటివియా?

వీ।బా.—సాక్కన బాపనయ్యా! నీవుమోసి పీల్చి పిప్పిచేసిన శవములు నాకెంతధనంబిడును? నాకులవృత్తి నే(జరిపెద. నీబలె స్నానసంధ్యా వందనంబులు వదలి పీను(గులుమోసి పిండములుదిని గండాగుండియనై ధనమార్జించి బ్రదుకేనుగదా? నీముఖముపైన విప్రతేజస్సు గలదా?

కాల.—ఓరీ! అంత్యజా! అగ్రజన్ము(డగు నన్నా నీవెదురించునది? శివ పంచాక్షరీజపంబొనర్చి నిన్నొకదెబ్బన భస్మముచేసెద.

శివ.—(స్వగ। వీరేమిరా సవతికొడుకులు కలహించినట్టు కలహించుచున్నారు. వీరికలహము నే మాన్పెద.) (కాలకౌశికు(జూచి) స్వా

మీరా! కాలకౌశికులవారూ! ఈయింతిశిరంబు నఱకుఁడని రాజుగారి యాజ్ఞయైనది. దానికిమీరీభంగి నాకు పెట్టితిరేని మిమ్ముఁబట్టికట్టి తీసుకొనిపోవుదును.

కాల.—(భయమునటించి హంసనారినివదలి) అయ్యా! దయచేసి నా యింటివఱకువచ్చి నాభార్యతో నిచటజరిగినవార్తఁదెలిపి నన్ను గాపాడుదురుగదా?

భీమ.- -మంచిదయ్యా! అటుచేసెదను. భార్యకింతగ భయపడు పురుషుఁడు నీవేమి పురుషుఁడవయా? నాభార్య నాకెదురుత్తరమిచ్చినచో నాకదెబ్బన రెండుతునుకలు చేయుదునే?

కాల.—అవును లేవయ్యా! నోటిమాటలలో నందఱుతునుకలు చేయువారే! ఎట్టిచాండాలుఁడైనను ఎట్టిహీనజాతి నీచుఁడైనను ఎట్టికటికడైనను తనధర్మపత్నినిఁ జంపునేమయా?

భీమ.—అయ్యా! చాలును మీమాటలు. ఇటురండు. మాకుఁగార్యమున్నది. (వీరదాసునిఁజూచి) వీరదాసా! నీవీయింతిని నఱికెదవా, నఱకవా?

(వీరదాసుఁడాలోచించుచుండును.)

వీ॥బా,—ఓరీ! స్వామిద్రోహీ! అనృతవాదీ! నఱకెదవా? నఱకవా?

వీ॥దా.---అయ్యా! వీరబాహూ! అధర్మ....

హంస.—ప్రాణపతీ! మనోహరా! స్థిరసూనృతోక్తిరచనాధురంధరా! దూరాలోచన పరుఁడవై బదులిడుము. దారాపుత్రాది విమోహపాశంబు నీ వివేకలవిత్రంబునఁ దెంపుము. వలదీ వ్యామోహంబు. జననజరామరణాద్యవస్థలఁజిక్కినశరీరము శాశ్వతంబుకాదు. ధర్మకర్మావనదక్షుఁడవై యార్యస్తవనీయధైర్యుఁడవై నీవీవిధిఁ జింతావధిఁగనలేక విరుద్ధధర్మంబుఁ బూనితివేని వారాశిప్రావృతమేదినీవలయంబెల్ల వ్యాపించిన నీ యశఃప్రసూనామోదంబు తొలఁగించును.

ప్రాణకాంతా! నీవు పెంచి పెద్దఁజేసిన కీర్తికన్యక కుందిక్షీణించుట కేనా యస్తోకశ్రీకానేకానీకంబులతో సంభోధిమేఖలాకలిత భూతలాధిపత్యంబు నిన్ను బోంకింపఁ గంకణంబుగట్టికొనిన విశ్వామిత్ర ఋషికి దారవోసితివి? ప్రాణపతీ! భూమ్యంతరిక్షంబులునిండి నిబిడీకృతమైన నీయశశ్చంద్రికాప్రభావంబు మాపుటకేనా కంటకావృత కర్కశాటవీ సంచారకష్టంబులెల్ల ననుభవించితివి? నీ సూనృత వచనరచనానిర్నిద్రతకు జడత్వంబు గలుపుటకేనా నీదారను నడువీధి నమ్మితివి? నీసుతుని సేవకావృత్తికి నిలిపితివి? దేవా! వలదీ విరుద్ధ ధర్మము. వలదీస్వామిద్రోహము. రాజాజ్ఞ నెరవేర్చుటయందు సేవకునకే దోషంబురాదు. పూనుము నీకరవాలము. ఇదిగో నాశిరము. ప్రాణపతీ! జన్మజన్మాంతరములందు నీవే నాప్రాణపతి వవుదుగాని పార్వతీ ప్రాణనాయకుని దీనాభీష్టఫలదాయకుని సరసీరుహాక్షునాయకుని లోకనాయకునిఁ బ్రార్థించెద. మీపాదారవిందంబులపైఁ బడెద.

అనుబంధము 37.

(అనుచు నమస్కరించి చీరచెఱఁగుపఱచి నిశ్చలచిత్తయై కేలుమోడ్చుకొని కూర్చుండును.)

వీ।దా.---(ఇంతకనిలిచి....తలయూఁచి) హా! హా! వికటీకృతదంష్ట్రమైన విధీ! నే నింకెంతదూఱ నగుదు? అకటకటా! నిజకర్మపరిపాకం బెవ్వరికిని దురత్యయంబుగదా? హా! హా! మదాంధీభూతదుష్టాశయా! హా! క్షత్రియవంశపాంసనా! హా! కులాంగనావిక్రయకా! హా! సప్తాశ్వాన్వయవిదూషకా! హా! కులక్షీరసాగరహాలాహలా! హా! వంశాంబుధిబాడబా! హా! నీచహరిశ్చంద్రా! పావనకులవనకుఠారకుఁడవై నీవేల జన్మించితివి? ఓరీ! మానహీనా! కులాంగనను విక్రయించి జీవించుటకంటెను హాలాహలము భక్షించి చచ్చియుండఁగూడదా? ఓరీ! మూఢా! నీకిది దోషదాయినా? జన్మజన్మదురితక్షయంబైన

యీపావనగంగాప్రవాహంబునంబడి కొట్టుకొని పోఁగూడదయుయుం డెనా? అజాగళ స్తనంబులంబలె నిష్ప్రయోజకుఁడవై యీభూదేవతకు బరువుచేటుగ నేలనిలచితివి? ఏసుఖంబనుభవింపఁదలంచితివి? ఓరీ! పాతకీ! పంచమహాపాతకీ! ధరాధిపాపహాసదృ ప్రకటీకృతమగు నీబాహువీర్యము, నిజదారశిరఃకృంతనోద్యోగ కర్మంబునఁ బ్రకటింపఁ బ్రదుకితివియా? దుర్మదాహితవనదావపావకమగు నీతేజ మీ వికసితశిరీషకోరకసుకుమారశరీర శరీరము దహింపఁ జేయుటకుఁ గాచియుంచితివియా? ఓరీ! చాండాలా! హరిశ్చంద్రా! మహాభీలరమ్మద భీమమై శాత్రవావరోధమై ధవ్యదాయియై వెలసిన నీఖడ్గము, ఘనతరపుత్రశోకకర్శితయగు నీయబలపై నుపయోగింప సమయముఁ గాచి దాచియుంటివియా? విపులారిరాజన్యకోటికోటీరములపై నిబిడ నిష్ఠురదుస్సహనిర్ఘాతంబై పడు నీకృపాణంబు నీయిష్టభోగఫలభాగినియగుభార్య శిరముద్రుంప రక్షించియుంటివియా? ఓరీ! సూర్యవంశ విలసత్కల్పద్రుమ కుఠారకా! ఓరీ! త్రిశంకునందనా! శరజన్మప్రతిమ ప్రతాపనిధియని ప్రఖ్యాతినంది యనుపమవిక్రమక్రమసముగ్రభుజార్గళుండవయి విపక్షక్షత్రపత్నీవలీశితూదండంబగు కౌక్షేయకంబు నీ దక్షిణహస్తంబునఁ బూనినది పుత్రశోకజనితాకులభావవిషణ్ణచిత్తయగు నీయబలను శిక్షింప టకేనా? ఓరీ! బ్రహ్మర్షిభావణపవిచ్యుతభాగ్యా! నీకేల యీ క్రూరతరాతి విచతురాయతమతికలుగు? నీకేల స్త్రీహత్య పాతకంబాదవు? అన్ని పాతకములు దిగమ్రింగి గుంపువడిన నీకు స్త్రీహత్యయనసెంత? హా! సతీమణీ! పురంధ్రీగ్రామణీ! సాధ్వీజనచూడామణీ! మామకమనోహారిణీ! పుణ్యచారిణీ! నీవదనసౌందర్యజితేందుమండలం బించుక జూపుము. నాహృదయవ్యాకులాంధకారంబు బాపుము. నీలాలోలాలకా! నీలాళిమాలికలు చాలుబోలు నీకేశజాలము ధమ్మిల్లాకారమునఁ జెక్కుము. ఈమూల హరిశ్చంద్రుఁడు జాలిమాలి తనకరవాలముచే నీ శిరమునరిగెడు. తన

భుజాపరిఘుచే ధరణీవరారోహనుస్థిరంబుగ భరించిన హరిశ్చంద్రుఁడను చాండాలుఁడీవుసు తనవరారోహను నిన్ను భరింపఁజాలక శిరంబుహరింప సాహసించెడు (అనుచు నఱనుండి కృపాణంబు వెలిదీసి ఝళిపించి) దుర్వారగర్వాహితోర్వీశప్రాణానిలదర్వీకరోపమ కృపాణమా! నీనైజక్రౌర్యంబువహించి యీశార్వరీశానన శిరంబుఁదెగవేయుము. కనికరమ్మించుకైనఁ దలఁపకుము. స్త్రీహత్యయగునేయని శాదగకు. (అనుచుఁ గరవాలమెత్తును.)

(విశ్వామిత్రుని ప్రవేశము.)

(ప్రవేశించి కరముఁబట్టి.)

విశ్వామిత్రుఁడు.—

శా॥ చాలుఁజాలును సాహసంబిటు హరిశ్చంద్రా! నృపేంద్రా! భవ
త్సీలంబుఁ, గులముఁ, యశంబును, మదిన్జింతింపుమా! మానుమా
లోలాక్షిఁ దెగవేయు కార్యమును, వాలుఁ ద్రోయుమా యవ్వలఁ,
యేలఁ జూడుము నాదునందనల భూమీశా! సిరిఁ జెందుమా.

ఓరీ! హరిశ్చంద్రా! నీవున్నృశంసకుఁడవు. స్త్రీహంతవు. నీవు రాజవుగావు రాక్షసుఁడవు. నీముఖము వీక్షింపదోషంబు. ఓరీ! దుర్మదారివారముపైఁ గ్రూరముగ్రవాలు నీకరవాల మబలలగువాలుగంటులపైనఁబ్రవాలనగునా? నీహితుఁడు నీపురోహితుఁడు, వసిష్ఠుఁడు, భామలను జంపినఁ బాపము లేదని గఱపెనా? ఈసాధ్వీమతల్లి యీసతీమణి నీకుధర్మార్థకామమోక్షము లిడునట్టిది కాదా? సత్యమునకై యిట్టిసతీమణినిఁ జంపుట యనుపమోలకై సౌధరాజంబును గాల్చుటయకాదే? సతికై తనమామయగు దక్షునిఁజంపిన భూతపతి నీకంటెను బుద్ధిజాడ్యుఁడా? సతికదా సకల ధర్మవసతి? ఆలుగదా సకల సౌభాగ్యములప్రోలు? హరిశ్చంద్రా! నీవివేకంబేయూరికిఁ బంపితివి? ఇంతటి దురభిమానం బెందుండి కొనితెచ్చితివి? అకటకటా! నాబుద్ధులన్నియుఁ జెడచెవిఁబెట్టి యొంటికిలేని చేటెంతదెచ్చికొంటివి?

అయ్యో! పాపీ! సుతునిఁజంపితివి. భార్యను జంపఁదలంచితివి. భాను వంశమునఁబుట్టి మాలవాని కొలువునఁ జేరితివి. హరిశ్చంద్రా! ఇప్పుడైనను నాహితమువినుము. నానందనలగు మాలచేడియనుగొనుము. అట్లైన నీసుతునకుఁ బ్రాణదానంబు సేయుదు. నీరాజ్యము నీకు నొసఁగుదు. దురాలోచనపరుఁడవుగమ్ము. సుఖముగనుము. సిరివచ్చినపుడు మోకాలడ్డమిడువాని చందంబొనర్పకుము. గవ్వకునై రత్నమును గోల్పోకుము. వారిదమునీరునమ్మి తటాకమునీరు వెలిజల్లకుము.

ఏదా.—మునిచంద్రమా!

శా॥ సత్యాలాప పరాయణుండగు హరిశ్చంద్రుండు ప్రఖ్యాతుఁ డా
దిత్యోర్వీశ విభూషణుండు కులనీతిన్ బాయుమన్ భూమికా
నిత్యంబైన సుఖంబుఁ గోరఁగలఁడే నిస్తేజుఁడై చిక్కినన్
భృత్యుండైనను భార్యఁగోల్పడిన నిర్వీర్యుండునై మ్రగ్గినన్?

మునిరాజహంసమా! ఈవీరబాహునకు నేఁజేసిన ఘోరప్రతిజ్ఞకు వేటుదలఁపనగునా? సత్యంబుమాని స్వామికార్యంబు రిత్తపుచ్చఁగలనా? ప్రారంభమునుండి నన్ను మీరిటు సత్యభంగునిఁ జేయ యత్నించుచున్నవారు. మీనుడివిన నుడువులు శ్రోత్రవికావు. కావున నా ప్రయత్నంబునకు మీరంతరాయంబుగ నిలువవలదని వేఁడికొనియెద.

విశ్వా.—హరిశ్చంద్రా! నీకులగ్రామణి నేనుగావున నీపై నభిమానమూని దయఁబూని యిన్నిహితము లుపదేశించితి. అయ్యో! నీకుఁగల యేకపుత్రుండు సర్పహతుఁడయి యిదిగో వచ్చినను జాలినగవు మానక ముద్దుమోమున వగలుగులుకుచు నీదిక్కుఁజూచుచు నిటఁబడినాడు. ఇదిగో యిచట నీప్రియభామిని నీధర్మపత్ని నీకులాంగన దీనాననయై యత్నములేక చావునకు సిద్ధపడి భగవధ్ధ్యానాయత్తచిత్తయై సమాధియోగంబునఁ గూర్చున్నది. అయ్యో! అసతీమణిని

నీయిష్టార్థఫలభోగినిని ముద్దుమోమై ననుఁజూచి దయఁజూపుము. వలదీమమ్కారపుఁబట్టు. నాహితంబులింటివేని నీసుతుఁడు బ్రతుకును. నీసతిప్రాణంబులు దక్కును. నీకీర్తి నీకొసఁగుదు. మరల సార్వభౌముఁడవై సుఖసాగరంబునఁ దేలుచుండువు. చక్కఁగ నాలోచింపుము సంశతీఁగ దుష్కృత్యంబు ప్రాయశ్చిత్తార్హంబుగాని దురితంబు. నమ్ముమిది.

హరి.—మునివర్యా! ఇఁకమీరిట్టి మాటలాడకుఁడి.

ఉ॥ ఆప నలీక మెన్నఁటికి, నార్యపథంబునువీడ నెన్నఁడున్
గూడను హింసజాతులకు గోసఁగిచానల, స్వామికార్యమే
కీడొనఁగూడినన్ వదలఁగింకరవృత్తిని, మాటలేల! నే
వేఁడను నిర్జరేంద్రపదవిన్, శెడుచేతలసద్దియిచ్చినన్.

మునిసార్వభౌమా! ఈ సాంసారిక తాపత్రయంబున ననుముంప యత్నింపకు. భవసాగరంబునుండి దరిఁజేర్ప నీశ్వరుండున్నవాఁడు. నీనుషువ్వు మాలచేసితుల నేఁ గూషను. ఈసుతుని నే నొల్లను. ఈసతిని నే నొల్లను. సత్యంబొకటి ననువదలకున్న నాకదియ సర్వసుఖము. ఈయనిత్యములైన సతిసుత రాజ్యసామ్రాజ్యములకై వేదనిగదిత నిత్యసత్యంబు వదలుదునా? వదలను. నా దేహంబీ చాండాలున కమ్మితిని. వానియాజ్ఞాధారకుఁడనేను. స్వామిద్రోహికాఁజాల. వదలుము నాకరవాలము. కదులుము నీవిచటనుండి. వదలము హరిశ్చంద్రుని మనము.

(అనుచుఁ గరవాలము నెత్తును.)

(పైనుండి "హరిశ్చంద్రా సైఁపుము నీసత్యభామతమునకు మెచ్చితి. సత్యహరిశ్చంద్రుఁడను పేరు సార్థక పఱచితివి" ఈ శబ్దములు వినఁబడును.) (అందఱు విచ్చవడి నిలుతురు.)

(ఈశ్వరుడు ప్రత్యక్షమగును.)

**హరి.**—(దండకము) (సాష్టాంగ దండంబిడి లేచి.)

శ్రీమన్మహేశా! నిరీశా! నిరాశా! నిహారావనీభృన్నివేశా! నిశాకాంతనీకాశదేహప్రకాశా! నిరీహామనోగేహసంవేశ! నిర్నాశ! నీరేజగర్భాండలోకావనేశా! జగీశా! నినున్గంటి, నీపాదపద్మంబులన్గంటి, నిత్యేశ్వరుసామ్రాజ్యమున్గంటి, నేధన్యుడైతిన్, గృపాపాంగదృష్టిన్, ననున్జూడుమా! యీశ! ముల్లోకముల్ నీవుపుట్టింప, రక్షింప, గిట్టింపగాదా త్రిశూలంబు నీహస్తశస్తంబుగారాజిలెన్ దేవ! త్రేతాగ్నులై భాసిలున్గాదె నీచిత్రనేత్రంబులవ్వేళ, సప్తోదధుల్, సప్తధారాధరంబుల్ శివా! నీజటావల్లికల్గావె, నారాయణా! దుష్టశిక్షాచణా! శిష్టసంరక్షణా! పంచభూతాత్మకా! తత్త్వనిర్ణేతకా! నీవు తేజోమయుండై విరాజిల్లి చైతన్యరూపంబునున్దాల్చి, బ్రహ్మాండజాలంబు నీ రోమరంధ్రంబులన్జేర్చి, మందాకినీ సౌధనీరంబు ద్రావించి రక్షింపవా, సాంబ! నీశుద్ధబుద్ధి స్వరూపంబు వర్ణింప నా బుద్ధికిన్సాధ్యమే? శంకరా! పార్వతీవల్లభా! దుర్లభా! దంతిదైత్యాంగచర్మాంబరా! యీశ్వరా! పాహిమృత్యుంజయా! పాహికాలాంతకా! పాహిదీనావనా! పాహికైలాసవాసా! వినీతుండనై మ్రొక్కెదన్. భూరిసంసారభారంబు సైరింపగాజాల, గష్టాబ్ధిలోమున్గితిన్ దేల్పవే! చాలు నీధాత్రియందుంట, జీవింపగాలేను, వైరాజమానంబుగానుండు, నీ తేజమున్జేర్చి, నన్నాదరింపన్ మహాదేవ! నిన్ దప్పవేరెవ్వరిన్, దిక్కుగానన్, నిజంబిద్దితండ్రీ! ననున్బ్రోవుమయ్యా, నినున్గూడ నే వేడెదన్ భక్తిచే మ్రొక్కెదన్! మ్రొక్కెదన్! మ్రొక్కెదన్!

(అనుచు సాష్టాంగ నమస్కారంబులిడును.)

విశ్వామిత్రుఁడు.—

చ॥ దురితవిభంగ! శిష్టజనదుఃఖ భుజంగపతంగ! యీశ్వరా!
శరధినిషంగ! నిశ్చలితసంయమి హృత్సరసీజభృంగ! శాం
కరిముదితాంతరంగ! నవనందితురంగ! దయాంతరంగ! యా
దరితజనానుషంగ! నిరతంబును భక్తిని నీకు మ్రొక్కెదన్.

(అనుచు నమస్కరించును.)

వీ॥ బా.—శనిపీడాపహారకా! వందనంబులు. (అనుచు నమస్కరించును.)

కాల.—యమగర్వనిర్వాపకా! నమస్కృతి! (అనుచు వందనంబులిడును.)

నక్ష.—దైత్యకులకల్పద్రుమా! అభివందనము. (అనుచు నమస్కరించును)

ఈశ్వరుఁడు.—భక్తపుంగవా! హరిశ్చంద్రా! నీస్థిరసూనృతోక్తికి నే మెచ్చితి. ఈవిశ్వామిత్రుఁడు నిన్ను బొంకింపఁజాలఁడయ్యె. నిన్నితఁడు పదునాల్గు మన్వంతరములు సార్వభౌమునిగ ధర నేలింతుననియును పిదప నంతటికాలంబు నిర్జరేంద్రు సరిగద్దెపై నుంతుననియు నింద్రసభను వసిష్ఠునితో శపథంబు బూనినవాఁడు. ఆ సుఖంబీవనుభవించినపిదప నీకు మోక్షంబు నిచ్చెద. ఈసాధ్విలలామ సమాధి యోగంబున మైమఱచినది హెచ్చరించెద. (సతీమణీ లెమ్ము.)

హంస.—(లేచి యీశ్వరుని జూచి.)

సీ॥ వేదరథ్యాయుక్త మేదినీరథకేలి తోయచంద్రాదిత్య భూరిచక్ర!
చామీకరాచలచాప! తేజోరూప! పద్మాక్షరోప! యోపరమపురుష!
త్రిపురదైత్యాంతకా! త్రిదశాళిపాలకా! త్రినయనా! త్రిభువనావన! యనూన!
జరతసరీసృపచారుహారోజ్వల! దక్షాధ్వరధ్వంసక! యక్షరాత్మ!

గీ॥ అంబికాత్మచకోరశశాంకరూప!
శంబరాంతక! భస్మాంగ! చంద్రజూట!
అంబరవ్యాప్తకేశ! మదారినాశ!
శ్రితజనావన! పార్వతీపతి! పినాక!

(అనుచు వందనంబులిడి.)

యోగిరాజవహంసా! హఠయోగంబున నుండుతతి సాహ్యాదయంబు

జంబున నిన్నుఁగంటిని. ఇప్పుడీ బ్రాహ్మణయునాంబు జంబులఁ బ్రత్య క్షంబుగ నిను గంటిని. కృతార్థనైతిని.

ఈశ్వ.—సతీమణీ! నీవిమలనిశ్చలమతికి నేమెచ్చితి. నీకామితార్థంబు లిచ్చెద. వేఁడుము.

**అనుబంధము 88.**

హంస.—మహాదేవా! ఈకాశీరాజ కొమారుఁడు మృతినందినాఁడు. ఆబాలుని తలిదండ్రులు పుత్రశోకాగ్నిచేఁ దపించుచున్నవారు. ఆ శిశువును రక్షింతువని నేఁగోరెద. అదితప్ప నాకీయవనియందు గోరఁ దగినదేమియున్నది?

ఈశ్వ.—(స్వగత) ఓహో! ఈసాధ్వీమణి పరోపకారబుద్ధి! (చంద్రమతిఁ జూచి) చంద్రమతీ! గుణవతీ! చారుమతీ! నీసద్గుణం బెంతయనునది నీవిపుడు కోరినయిష్టార్థం బొక్కటియె త్రిలోకంబులందుఁ బ్రకటించును. ఈపురుషభూషణుని (హరిశ్చంద్రునిఁజూపి) యర్థాంగివినీవని నఁజాలదు. ఈపుణ్యపురుషుని పూర్ణాంగివినీవు సతీమణీ! నీకోరికకొలఁ కాశీరాజపుత్రుని నీపుత్రునితో నైతము బ్రదికించెదను. వీరికిఁ గలిగినది శ్వాసోచ్ఛ్వాసస్తంభనముగాని మృతిగాదు. చంద్రశేఖరా! లెమ్ము. లోహితా! లెమ్ము. (అని పిలుచును. వారు లేచి కూర్చుందురు.) (విశ్వామిత్రునిఁజూచి) విశ్వామిత్రా నీప్రతిజ్ఞ చొప్పున హరిశ్చంద్రుని సార్వభౌమునిఁ జేసి రాజ్యమేలింపుము. (హరిశ్చంద్రునిఁ జూచి) సత్యహరిశ్చంద్రా! నీబడిన కష్టంబులకుఁ గుందకు. సత్యంబే ధాత్రినిఁ బ్రాముఖ్యంబని స్థాపించితివి. నీనిలచినస్థలము స్మశానము గాదు, నాకొమొనర్చు యజ్ఞవాటిక. నీవుకొలచినది చాండాలునిఁగాదు, సకలధర్మాధర్మ విచారణాధికారియయిన యమధర్మరాజును. ఈపతి వ్రతాశిఖామణినిఁ గొనినవాఁడు కన్నైశ్చరుఁడుగాని వేదబ్రాహ్మణుఁడు

కాదు. నేఁబోయివచ్చిన. రాజ్యంబేలుచు సత్యమేధాత్రిని ధర్మమని జనులెల్లరు నాచరించులాగొనర్తుము. నేఁబోయెద.

(ఈశ్వరుని నిష్క్రమము.)

హరి.—(విశ్వామిత్రునకు మ్రొక్కి) మునిచంద్రమా! మీరు మావంశ గ్రామణులై నన్నేల యీరీతి బాధించితిరి? ఈకసివచ్చిన గ్రహాచారమేమి? ఈయమునకింతటి కష్టావస్థలభింపనేల? ఈసాధ్వీలలామకు చంద్రమతికి దాస్యవృత్తి యేలవచ్చెను? ఈ ముద్దుబాలుఁడే తప్పొనర్చెను? వాఁడు సర్పహతుఁడగుటకుఁ గారణంబేమి? మహానుభావా! వసిష్ఠులతో మీరు కలహించినమాత్రాన వారిశిష్యులగు మాకిన్నికష్టంబులు తమవంటి తపోధనులుంతురని నేనమ్మను. దీనికి వేఱొక మహాకారణంబుండవలయు మహాత్మా! ఆకారణంబులు తెలిపి నన్నానందవార్ధిలో ముంతురని వేఁడెద.

విశ్వా.—హరిశ్చంద్రా! తత్కారణంబులు వినువ నాకే కుతూహలముండెను. దానినే నీవడిగితివి కావున సంక్షిప్తంబుగఁ దెలిపెదవినుము. పూర్వజన్మమునం దవంతీ రాజ్యమేలిన నీలలోహితుఁడవు నీవు. నీకునొకరాక్షసుఁడు మిత్రుఁడై యుండెను. వాఁడు సురమునికంటకుఁడయ్యెను. వాఁడు నీచే మాత్రము వధ్యుఁడని తెలిసి వానిని వధింపుమని నేను నిన్నడిగితిని. ధాత్రియందుఁ బదునాల్గు మన్వంతరములు సార్వభౌమునిగ నిలిపి పిదప దేవేంద్రుని సరిగద్దియపై నుంతునని మాటయిచ్చినచో నారాక్షసుని, జంపుదునని నీవుపలికితివి. దానికి సమ్మతించితిని. మిత్రద్రోహమొనర్చి నీవారాక్షసునిఁ జంపితివి. ఆరాక్షసుఁడిపుడు నక్షత్రకునిరూపంబు వహించి నినుబాధించెను. ఈచంద్రమతి పూర్వజన్మంబునందు నీపురినుండిన కలకంధరియను రెడ్డిసాని. మగనిని తిరస్కరించి నినుమోహించి నీయొద్దఁ జేరెను. నీవారెడ్డివంశనాశనంబొనర్చితివి. పిదపఁ గలకంధరకు బుద్ధి వచ్చి యిఱుఁబదియొకవత్సరంబులు భక్తిపూర్వకంబుగఁ గేదార

గౌరీవ్రతంబు సలిపెను. తత్కారణంబున నిపుడు నీకులాంగనవై వెలసెను. అయినను ప్రాక్కృతదుష్కృత ఫలం బనుభవనీయంబు కావున యింతటి కష్టము లనుభవించెను. ఇఁక నీపుత్రుఁడగు రోహితుఁడు పూర్వజన్మంబునఁ గుబేరుని పుత్రుఁడగు నలకూబరుఁడు, వాఁడు యౌవనమదంబున రంభయింటికిఁబోవుచు దారిలో నడ్డమయిన తక్షకుని కౌమారునిఁజంపెను. తక్షకుఁడు కినిసి నీవు నరరూపంబున ధాత్రిఁబుట్టి సర్పహతుఁడవుకమ్మని శాపమిచ్చెను. దానికిఁ భయమంది రంభాసహితుఁడై మేనకయింటనుండు నన్నుఁ బ్రార్థింపఁ దచ్ఛాపవిమోచనంబు వైళమ్మగలుగునటుల నేవరమిచ్చితి. తక్షకుఁడా ద్వేషంబున నీకౌమారునిఁ గఱచెను. నాతపోబలంబున వానికి స్మృతి రానటులఁగాపాడితి. నీతండ్రి త్రిశంకుఁడు వసిష్ఠశాపతప్తమాలవాఁడయి నన్నుఁ జేరి యాశ్రయింప నే నతనిని బొందిలో స్వర్గమునకుఁ బంపితిని. యముఁడచట వానిఁ జూచి చాండాలుఁడు స్వర్గమునకువచ్చెనని యఱచుచుఁ గ్రిందఁబడఁద్రోసెను. నేదానిఁ గని నీతండ్రిని మధ్యమార్గంబున నే నవీనస్వర్గంబుగల్పించి నిల్పితిని. చాండాలుఁడవై భువిని జన్మింపుమని యమునకు శాపమిచ్చి తచ్ఛాపవిమోచనంబు వేగమ్మె తటస్థించునటుల వరమిచ్చితిని. ఆకారణంబున యముఁడు చాండాలుఁడై బుట్టి నీకతంబున శాపవిమోచనంబు పొందెను. ఈయముఁడు తనసపత్నీమాతృసుతుఁడైన శనైశ్చరునిఁ దన్ని కాలువిఱిచిన కాలమున శనైశ్చరుఁడు నన్నుఁ జేరెను. అపుడు నేను వానిఁబోషించి వానినిఁ దన యధికారంబున నుంచితి. ఇపుడీ కార్యంబునకై భువిని బ్రాహ్మణరూపంబున నవతరింపఁజేసితిని. పూర్వజన్మంబున కలకంధరచే ననేకబాధలందిన యత్తె యిపుడీ శనైశ్చరునిభార్య కలహకంఠియై యీసతీమణిని వేధించెను. హరిశ్చంద్రా! ఇవి పూర్వజన్మకర్మఫలంబులు. ఇది సుదినము కావున దైవప్రార్థన మొనరించి మంగళమహాశ్రీయుతులమై యయోధ్యఁ

లోకము గమ్ము. ఈస్థలము హరిశ్చంద్ర ఘట్టమని యాచంద్రార్క-తారకంబుగ నీనామంబున రాజిల్లుఁగాత. (యమునింజూచి) శమనా! ఇఁక నీవు నీయధికారంబు వహించియుండుము పొమ్ము. (నందునిఁ జూచి) నీవిఁక గ్రహరాసులలోఁ జేరుకొనుము. నక్షత్రకా! నీవు హరిశ్చంద్రునకు మంత్రివై రాజ్యమేలింపుము. రమ్ము పోవుదము.

---

మంగళమహాశ్రీవృత్తము.

శ్రీవిభవ యుక్తుఁడయి-చిత్తభవరక్తుఁడయి-సిద్ధజనముక్తికిని జోడై
దేవగుణసక్తుఁడయి-దీనగుణరిక్తుఁడయి- తేజరిలు మాధవుఁడు మాకున్
బావనపు జీవనము-పాయనియశోధనము-ప్రాభవము నిచ్చుఁడునటంచున్
భావమునఁగోరుచును-భామినులు భక్తిమెయిఁ-బాడెదము మంగళమహా
శ్రీ

సమాప్తము.



# ఉత్తరరంగము.

## ద్విపద.

భూసురులార యో భూవరులార
భానురౌరజులార పాదజులార
సత్యహరిశ్చంద్ర చరితంబు వినుచు
నిత్యకీర్తిఁ గని నెగడుఁడీ యవని
సత్యంబు వేదము సత్యము తపము
సత్యంబు వ్రతదీక్ష సత్యము జపము
సత్యంబు రాజ్యము సత్యంబు సతియు
సత్యంబు పుత్రుండు సత్యము సిరియు
సత్యంబు భోగంబు సత్యము చదువు
సత్యము సకలైక సామ్రాజ్యపదవి
అని దృఢముగనమ్మి యవనీశుఁ డెలమి
ఘనకీర్తిఁ గనెను ముక్తినిఁ గనెను
త్యజియించె ధీరుఁడై ధారుణీశుండు
నిజవాక్యశుద్ధికై నిఖిలసుఖంబు
స్థిరసూనృతోక్తికై క్షితినెల్ల వదలె
ధరసత్యమునకునై తానెను వనట
నిజసత్యదీక్షకై నిజదారనమ్మి
భజియించెఁ జాండాల భర్తను వేడ్క
సుతుమృతిఁ గన్నులఁ జూచియు సత్య
వ్రతదీక్ష వదలక వాసికినెక్కె

మృతుఁడైన సుతుని సంస్కృతికై భార్య
క్షితి వేఁడ నీడయ్యెఁ జలిసుంకమీక 22
దారమాంగల్యంబుఁ దగ నమ్మ మనియె
ధారణీశుని స్థైర్య ధర్మంబుఁ గనుఁడీ 24
స్వామిభృత్యన్యాయ సరణి దప్పకను
భామామణిని ధర్మపత్నినిఁ జంప 26
కరవాలమెత్తెనుగాదె ధర్మంబు
ధరనుస్థాపించుట తగునంచు నెంచి? 28
ఈ పుణ్యపురుషుని యీ యిలాధీశు
నీ పాపదూరుని యీ ఘనోదారు 30
చరితంబు వినినట్టి సజ్జనులెల్ల
నిరతసూనృతదీక్ష నెఱఁబూనుఁడయ్య 32
చక్రవర్తులలోన సడిసన్నఁగన్న
విక్రమాఖ్యుఁ జరితంబు వినుఁడయ్య మీరు 34
ఈ పుణ్యచారిత్ర యీ సతీరత్న
మీ పురంధ్రీమణి యిల్వడియెల్ల 36
తలిరుఁబోణులు మీరు తగ నాచరింపఁ
గలుఁగు దాంపత్య సుఖంబు నిజమ్ము 38
మతిఁజూడ నీ చంద్రమతి గాదె సాధ్వి
పతికి ధర్మోత్సాహపరయయి నిలిచి 40
మానినీమణి చంద్రమతి గాదె సాధ్వి.
మానవనేతకు మర్యాదఁదెచ్చె 42
వేఁటకై పోయిన వేళలోఁ బతికి
నూటిగా ధర్మార్థ సూక్ష్మము దెలిపె 44
నిష్కారణానఁ బూని నిజముఁ దప్పింప
ముష్కరవృత్తిని ముని క్షితి వేఁడ 46

తనపతి సత్యంబు స్థాపింపవలెంచి
మునికి నిమ్మని హితము జెప్పి తాను
సుతునితోఁ బతివెంట సుఖములఁబాసి
వెతలంది యటవిలో నేగుచునుండె
నారచీరలుగట్టి నగరిలను నను
ఘోరకష్టంబులు బొందెనుగాదె?
చేటుమాటలతోఁడఁ బురుషునిఁగలంచి
కోటుపాటానరింప నూహించు వడుగు
మాటల కపటంబు మానిని తెలిసి
నీటుగాఁబతియెదుట నిలిపె సత్యంబు
దావపావకుఁడేర్చి దారిఁగప్పఁగను
పావకుఁ బ్రార్థించి పథముఁగల్పించె
దాసిగాఁ దన్నమ్మి ధర్మవాక్యంబు
వాసిగానిలువఁ బతికిబోధించె
తపనుంకమ్మని క్రిమికొట్టు వేళ
ధవునిపై నలుగక ధర్మమం చెన్నె
స్వామియానతిఁబూని భార్యను జంప
భూమిశుఁడెదలోనఁ బొందె సందియము
పతివనటునుబాసి వైరాగ్యములను
హితవుగ బోధించి యుంచుకయైన
కదలక యోగిని కరణిఁగూర్చుండి
హృదయాంబుజంబున హృదయేశు నిలిపి
కరవాలధారకుఁ గంఠంబు నిడియె
సరసిజాననలార సరవి నీ సాధ్వి

పతిహితంబెంతయో పడఁతికిఁ గనుఁడి
పతిభక్తి యెంతయో పాటించి వినుఁడి 72

పతిభక్తి గలయట్టి పరమకల్యాణి
పతిఁ గూడుగడయయి పరమసుఖంబు 74

పతి హితవరములఁ బ్రాప్తింపఁ జేయుఁ
బతికిఁ బ్రాణంబయి పరమాప్తయగుచు 76

పతిహితమునుఁ జూచుఁ బతినిఁ బోషించు
పతి కష్టసుఖముల భాగరి యగును 78

పతిభక్తి కాదె యాపదలను దొలఁచి
యతిమాయలన్నియు నణఁచెఁ జోద్యముగ 80

పతిభక్తిఁ గాదె యా పావకజ్వాల
లతిశీతముగ తిరిసెఁడా మడఁగెను వెలిఁచి 82

పతిభక్తిఁ గని కాదె పరమేశ్వరుండు
సతిని వెతుచుచుఁ బయ్యన వచ్చె 84

సతికిని పతిభక్తి సారామృతంబు
పతికిని సత్యంబు పరమధర్మంబు 86

సతికిని బతిభక్తి సద్గతిపథము
పతికిని సత్యంబు పరమభూషణము 88

సతికిని బతిభక్తి సత్యవ్రతంబు
పతికిని సత్యంబు పరలోకధనము 90

సతిపతిన్యాయంబు చక్కఁగఁ దెలిసి
ప్రీతి మీరు గనుఁడి యత్నీణవైభవము 92

ఈధర్మసూత్రంబు నెఱుఁగు దంపతులు
బాధలెవ్వియు లేక భంగంబుఁ గనక 94

కరుణను వదలించు కలుషము ఋణము
మరణము వెసఁ దెచ్చు మందగు ఋణము
ధృతిని నీఱొనరించు తేజము ఋణము
చితిలేక కాల్చును చలరేఁగి ఋణము
సతిని దూరముచేయఁ జాలు నీ ఋణము
సుతుని వైరిగఁ జేయఁజాలు నీ ఋణము
బంధు మిత్రాదులఁ బాపు నీ ఋణము
బంధురోలుపాల వాలమీ ఋణము
మనుజుఁ బిచ్చిగఁ జేల్చు మహితమీ ఋణము
మనిని బీనుగఁ జేయు మాంత్రిక ఋణము
లంగరవృత్తిని గింజయుఁ దినినొ
కంకుడువృత్తిని గంజిఁ ద్రాగ్ర్యక్షనినా
ధర నుంఛవృత్తినో దాస్యవృత్తినినా
తిరిపెమెత్తియొ మఱి తీర్థ సేవననా
సాహసవృత్తిని సంసారులగుచు
దేహయాత్రనుసల్పి ధీరులై మనుఁడి
ఋణముచేయక యుండు రీతినిఁగనుఁడి
గణనీయులై మహాఖ్యాతినిఁగనుఁడి
అప్పెంతయున్నది యని యెంచి ప్రొక్కి
దప్పించుకొని మీరు ధరణిలో మనుఁడి
అప్పు ముప్పయి మీకు నవమతిఁ దెచ్చు
అప్పు నిప్పయి మిమ్ము నశియింపఁగాల్చు
అప్పొనరించువాఁ డధమాధముండు
అప్పులేకున్నవాఁ డమరేశుఁ డనని.

# అనుబంధము (Appendix.)

## 1. బ్యాండు రాగము - ఆదితాళము.

సూత్రధారుడు.—

శ్రీదేవా-మహదేవా-భావమ్మునవిను-సదాసంస్మరింతూ ।శ్రీ।

భానుని నిన్ను-మనమునందు-దినదినాము-నేసదా

నయభయముల-వినుతిని చేతూ-గనుననుకరుణా ।శ్రీ।౧।

కాలకాలముల నిన్ను-కలుషహరా-కృపక్షోవా.

వేదకన్ను-నిరతము కనుకరుణా

దురితహరా-ధరణీవరా-భావమ్మునవిను-సదాసంస్మరితతూ ।శ్రీ।౨।

## 2. తోగడ రాగము - రూపకతాళము.

ఇంద్రుడు.—వినగా-గోరితినా-మనవి విన వేడువాడా ।విన।

భూతలంబునందుగాంచ-భూరిసూనృతదీక్ష బూనిన

పుణ్యమూర్తి యెవ్వడేని పోలజూడ-నున్నవాడ ।వి।౧।

సత్యవ్రతము నలుపనెందు-సాహసంబు-సరణిగాంచ

నృత్యులార-అట్టివాడు-చూడ ధరనుండునె ।వి।౨।

## 3. కాపీరాగము - ఆదితాళము.

ఇంద్రుడు.—

మానీ తగునే కినుకా-మనుతిను గనుచును విను మానీ।తగు।పల్లవి।

హీనము-కోపము-పూనుమ శాంతము-అహీనమతి విను।మానీ।౧।

కావనేంద్ర-కోపమందు-పాపమూలము-గాన నీవిక [మానీత।౨।

నోటిక బూనుమ-యీాగతి తాపము-చాలింపుమ-హితంబు మదిగను।

భూరివేదపారతత్వ-సారవేదులు మీరుకావున [మానీ।తగు।౩।

మీరిటు-మాటలు నాడగ పాడియె-భావంబున హితంబు వదలుచు।

4. లావణిధాటి - ఆదితాళము.

సత్యవ్రతుడు.—

ఈనశ్యమేసినాచాలూ మనసారగను-ఘనసారమగు। ఈనశ్య। పల్లవి।
పరలోక మానవులము క్తి-నరలోక మానవులర క్తి
కనుడీ-గానుడీ-ఈనశ్యమేసినాచాలు-మనసార
గనూ-ఘనసారమగు-ఈనశ్యమేసినాచాలు ।౧।

5. శంకరాభరణ రాగము - త్రిశ్రగతితాళం.

భట్టులు.—జోహార్ ధరాధిపాలకా-జోహార్ విరోధిహారకా।
యశంబునిండగా-టుటక్-అటక్-యెటక్ గనా
శుభంబగుక్-శుభంబగుక్-సుఖంబగుక్-హితంబగుక్
వినూమికాహితమ్ముకాక్-జోహార్ విరోధిపాలకా।౧।

6. శంకరాభరణ రాగం - రూపకతాళం.

సత్యకీర్తి.—ద్విజులు ధనము-ఆశపూర్తిగ-కనకసందీరి
మనముసందు తనివిచెంది చనిరికా నింగు।౧।
ఇపుడు యొసగ విప్రులచట్ల కనక కానరు
నృపతియేలా-సుకృతి కాంచ-ఘనుతవు నీవు।౨।

7. భీమపలాసురాగం - రూపకతాళం.

సత్యకీర్తి.—భూమిపాల-భూరిభీతి-నామనంబుజేరనూ।భూ।
తాపసుండు కోపిగాదె-తలపవేల నంతయు
తాల్మివదలు-తామసించు-నయనుగానదామునీ।భూ।౧।
పుత్రకులు నాగ్రహించు-నిగ్రహముగానదూ
శీఘ్రకోపి-శ్రీలవిడుడు-సేమము-యొసబూనదూ।భూ।౨।

8. కాంభోజిరాగము - చాపుతాళము.

1 మతంగకన్య.—మగువాలలా-ద్రోయుకాడు ధరణిపు।మగు।పల్లవి।
చలిమీ చలిగా సలుపుచు-మగువాలలా।అనుప।

కావించి-నాపతిగ చేయుదు నిక-మరువాలలా|౧|
ఈ రాజు నరసను-రాణింపజేరుచు మారునిరతి వేడ కా
మరులు వెలయుగ-సరస సరసను-మురియుచును-రతి నేకలి సేతము|౨|
గానాము సలుపుచు-భూనాథు జేరుచు-నూనతరుని కేళినే
తనివి తెందుచు-ఘనతగనుచును-మనముప్పరగను మునియెద|మరు|౩|

9. యదుకాంభోజి రాగము - ఆదితాళము.

నక్షత్రకుడు.—రావే-రమామణి-గోరితి మారుకేళి
వారిజనయనా-దారితి నీకయి
ననుఁ దయఁ గనుమికఁ|రావేరమామణి|౧|

10. అసావేరి రాగము - ఆదితాళము.

౨ మతంగకన్య.—రామా-పతినినే-మానగలనె
యేమని నేమనియుందు జగతిని- నిలువగలనె-మహి|రా|
కాంతారములా-కాంతుఁజేగదా-ఇంతీ-నేను-కాంతునివదలి
సంతసమ్మున-మానగగలనె-పిలువిడుమా-మాతా|రా|౧|

11. బేగడ రాగం - రూపకతాళం.

చంద్రమతి.—అందము యాతరు బృందము-శోభిత
నావనందనంబు పోలె-భాసిలె మిగులగ|అం|౧|
కలనాదా-కలనాదా-వలిమోదా-స్వరకాదా
శాలరసాలము-చిగురుల రుచి గనుగొనియెద|అం|౨|

12. గజలు - ఏకతాళము.

చంద్రమతి.—అనూనకాంతి-గ్రాలు వనాంతరము గనుమ
అతులకుతూహల మాయె మనంబున-యానవము|అ|
అందమైనా-వికపథామా-మరుదాయె చాల కాంచుమా
అభినవానువిభవా-మాయారె-యేమారె-విహారాము నా
రమణ కనూమిది కనులారా|అనూ|౧|

13. శంకరాభరణ రాగం - ఆదితాళము.

చంద్రమతి.—కాంతా మోకంబునకై యిటులరిగితి
మింతగదూరా-మిదితగునే॥కాంతా॥౧॥

హరిశ్చంద్ర.—ఇంతిరో కాంతల-కింతటి భయమగు
టెంతయు నైజా మిది తగదే॥ఇంతి॥౧॥

లోహిత.—బంగరు రంగు కురంగము గనమది
పొంగుగ నింతగ-పొరపడితి॥బంగ॥౧॥

చంద్రమతి.—బరయుచు గాధిజు డుండెడిచోట
కరుగనాని హా నాథా॥కాంతా॥౨॥

హరిశ్చంద్ర.—కొడుకు మృగంబును గోరిన యొసగుట
కడుముదమౌగా కంజాక్షీ॥ఇంతి॥౨॥

లోహిత.—ఇటుభయమొందగ నేటికితల్లి
పటువిధి దానిని బంధింతూ॥బంగ॥౨॥

14. కాపి నారాయణి రాగం - ఆదితాళం.

చంద్రమతి.—నతజనాళిపాలా-నాగరాజవరదా
నారదాదివంద్యా-నారాయణా॥నత॥
అరళి బ్రోవుమా-ఆదిదేవుడ నీ
దలతు శ్రీవిభావా-దయను నమ్ము బ్రోవా॥నత॥
మదిని నిన్ను నెంతో-మానితంబుగాను
కుదురుగాదలంచి కోర్కెదీర నాదు
పదసరోజముల-భక్తిపూజచేతు
సదయరావె వేగా-సార్వభౌము-గావా॥నత॥

15. బేహాగురాగం - ఆదితాళం.

1. మతంగకన్య.—స్మరసనయనాస్మైపా-భూరివిరహాగామేపా॥సా॥
కూరిమి సలినీ-చేరగమానీ-దూరము నా-మనా

దయగని-మిగుల దయగని-మిగుల దయగని మగనీ
చూడావె-తారె యిదలు-బలమూరె॥దయ॥౨॥

20. అసావేరి రాగము - ఆదితాళము.

చంద్రమతి.—ప్రాణనాథ యేలా-చింతరిత్త-మానుమ నీవు॥ప్రాణ॥
క్రోధమూని వాని-కోపమునా-శాపము నొసగి
వదినిచింత-వదలు॥ప్రాణ॥పల్లవి॥
భూరిధనము గూర్చా-దారి గనుమది
ధీరుడయి చింతను-వదలు కాంత॥ప్రాణ॥౧॥

21. నాదనామక్రియ రాగం - చాపు తాళం.

చంద్రమతి.—నరియె-రమణా-పరితాపమిటు నీకు
అరయూమ-మునిధనా-మతివేగమున దీర్చ్యా॥స॥౧॥
మనమూన-ఇటులా-ఘనబాధలను నెందా
ముసియేల-వదలును-ధనమియ్యవలె గాదె॥స॥౨॥

22. మాలకంస్ రాగం - ఆదితాళం.

లోహిత.—శంభోసుఖసదనా-త్ర్యంబక-సకలశివకరా-సుగుణ నిధానా॥శం॥
అమరేశ్వరనుత చరణా-గుణగణగానా-మునివరధ్యానా
సుఖకరశర్వా-సతతము-మనాంబుజమూన-భజింతునే సదా॥శం॥౧॥
విశ్వేశా-శుభంకరా-సురేశ్వరా-సదాశివా-సుగిరా
ముఖరా-సుఖదా-వరదా-హరా-పరాత్పరా-ఉమావరా-త్ర్యంబక-
సకలశివకరా॥శం॥౨॥

23. హిందూస్తాని భైరవి రాగం - రూపకతాళం.

చంద్రమతి.—నామనోరమణ నిన్ను-నేను వదలజాలా॥పల్లవి॥
ఇంతగా-చింతించనేల-కాంత నీకు మేలా
వ్యాకులా-మేలా-చాలాగ
నాథ నిన్ను వదలజాలా-ఏడియుండజాలా॥నా॥౧॥

## 24. భైరవి రాగము - ఏకతాళము.

చంద్రమతి.—నాథ దాసినై-పోయెదా-దయ మరువకు॥ నాథ॥
కుటిలతలిగలి-కుటిలవిధాతా
కట-కటా యిటువలె-యిటు ఘటియించె
ధీరుడవై మను-నానాథా-దయ మరువకు॥ నాథ॥ ౧॥

## 25. ఆనందభైరవి రాగము - ఏకతాళము.

లోహితుడు.—నాయన-యేమిదిగ ననరిది-తనయుని మనవిని వినుమిక॥ నా॥
సతతమా రాజ్యము-సతతమా విడిముడి
సతతమా కాయము-హేయము లెమ్మిక॥ నా॥ ౧॥
తనయులు నిత్యమా-ధనములు-నిత్యమా
ధర్మము-నిత్యము-తడయక లెమ్మిక॥ నా॥ ౨॥

## 26. యదుకులకాంభోజి రాగము - రూపకతాళము.

చంద్రమతి.—ప్రాణనాథా-పోయెదనీ-పదము లెవను నమ్మి॥ ప్రా॥
కాన లేనుదారియిక-కాంతనిను-వదలజాలాను నేను॥ ప్రా॥ ౧॥
మున్ను నేను యెవ్వరికి-కన్నడముల-గూర్చినానా
కన్నబాధా-గంటనియీ-పన్నముల-బడుచు-చెడుచు-నాహా॥ ప్రా॥ ౨॥
నిన్ను బాసి-యెన్నడును-యున్న మగువ-గాను గాదె
సన్నుతాంగ-బానిసనై-చెన్నువిడి-మనుదు-నేనటు-లాహా॥ ప్రా॥ ౩॥

## 27. మాండురాగం - త్రిశ్రగతితాళం.

వీరబాహు.—సంబాళి-సంబాళి-చాండాలు
ఆహా-వచ్చె ఓహా-వచ్చె గనుడి-జరుగుడీ॥ సంబా॥ ౧॥
ఏధి చాండాలుడు-యీదారివచ్చు-కనుడి-జరుగుడీ
త్రార్వడి-దార్వడి కల్లుడివేగా-వేగా-వెల్లరు హా
శార్వడి-విడుడిహా-నసదారిని తియ్యండివే-వానలారకవిడుడివేగ॥ సం॥ ౨॥

### 28. బ్యాండు రాగము - త్రిశ్రగతి తాళము.

వీరబాహు.—వడిగనడు-వడిగనడు-వడిగ వెడలుమా॥వడి॥పల్లవి॥
పుడమివిడు-ఏడు విడు-కాదుగని మనుమా
మాదలనూ కూడగనూ-నేడు వెడలుగాఁయిదుమా
వడిగనడు-వడిగనడు-వడిగ వెడలుమా॥౧॥

హరిశ్చంద్ర.—దాసుడై తినే-కాటి దాసుడై తినే॥పల్లవి॥
దోసము-లెన్నో చేసితి దాసుడై తినే-కాటి దాసుడై తినే॥౧॥

వీరబాహు.—ముంతయిగో-గంతయిగో-ముందునడువుమా
మంతమున-గొంతుకాను-కూర్చితనియుమా॥యిదుమా॥౨॥

హరిశ్చంద్ర.—వాసరపతి వంశమునా-వాసిగాంచినవాడనూ
దోసము లెన్నో జేసితి-దాసుడై తినే॥కాటిదాసు॥౨॥

వీరబాహు.—కేలుబవల్-నిద్రగాచి-నీవు నిలువుమా
కూలివాడా పాలుమాలి-కుందుపడకుమా
యిదుమా వడిగనడూ-వడిగనడూ-వడిగ వెడలుమా॥౩॥

హరిశ్చంద్ర.—కానుకునై-కాంతనునే-గానపెట్టితె-ఖాసితె
దోసము-లెన్నో జేసితి దాసుడై తినే-కాటి దాసుడై తినే॥౩॥

### 29. శంకరాభరణ రాగం - ఏకతాళము.

1 బాలుడు.—ఆడుదామా-మేమాడుదామా-మే-మాడూదమా
ఆటలిటులాడి-పాటలిటుపాడి
నీటుమీర-నీడను-కాటిలోనకూడి॥ఆడు॥౧॥

2 బాలుడు.—చెట్టులను యెక్కి-గుట్టలను ద్రొక్కి
కట్టుమీర్చుబగతులు-కాలదన్ని పారి॥ఆడు॥౨॥

3 బాలుడు.—గిల్లి దండ లాటా-చిల్లనిటచూడా
కల్లగాదు పోదిని-కాలు నూదికొట్టి॥ఆడు॥౩॥

4 బాలుడు.—పండు ఫలమూల దండిగాను దెచ్చి
మెండుగాని మెక్కి చెందు పయికి వేళి॥అడు॥౪॥

5 బాలుడు.—కొమ్మలానువంచి కోతియాట పెంచి
ఖ్యాతిమీర యిచట-ఖ్యాతిగాను కూడి॥అడు॥౫॥

6 లోహితుడు.—ఆటలేల మన పాటలేల
చేటువచ్చు నయ్యె రామో-మాటవచ్చువలదు॥అదు॥౬॥

80. ముఖారి రాగం - రూపక తాళం.

లోహితుడు.—చెడుపామిటు-ననుగరచెను-కడుసంకటమాయె
చేరి నను-కాపాడెడు-వారూ యిటలేరే॥౧॥
పుడమీబడి-కడుసోలితి-తడయూగను లేను
భూరివెత-లాయెకట-మాతా యిటురావే॥౨॥

81. బేగడ రాగం - రూపక తాళం.

హంసనారి.—బాలుడు-రాడె-నాపాలి-భాగ్యము
నగువు మోముగానగల నా॥బా॥౧॥
ముద్దులు-ముచ్చట-సుద్దులను జూపుచు
ఆడువాడుగానేడు రాడుగ-యేమిసేయు॥౨॥
చిన్నినా-చిరుతాడు-కన్నీరును గారించె
తానకేగగ-నేడురాడుగ-యేమిసేతు॥బా॥3॥

82. సావేరి రాగం - చాపు తాళం.

హంసనారి.—లోహిత-ననుబాసి-యీగతి బోయితె
యేగతి మనుదును-భూమి నేను॥౧॥
ఏడుదేవుల నేలు- రేడావు నీవిటు
పాడర యొడలయె-తాళగజాలా॥౨॥
దిక్కుమాలిన-భూరి-దీనూని బోలుచు
క్రుక్కితి అటవిని-అక్కట నేడు॥లోహి॥3॥

33. పీలురాగము - చాప్ తాళము.

హాంసనారి.—అయ్యో-యిటులోహితా-వదలుచు నీవెటుపోయితె
బాసితె-న చిన్నిబాలుడ-నీవు బాసిపోయితె
ఆ దైవమాయా-పోయగంబు వదలుచు నీవెటుపోయితె॥అ॥౧॥
క్రోధితి-నాడట-బాలుడ నిన్ను బాసిపోయితె
భూమిని-నిల్వ-జాలు-బాలా-వదలుచు నీవెటుపోయితె॥అయ్యో॥౨॥
లేవాగ లోహితా-యీరీతి నన్ను-బాసిపోయితె
దైవము నాపాయ-క్రూరమూన-వదలుచు నీవెటుపోయితె॥అ॥౩॥

34. మాండ్ రాగము - చాప్ తాళము.

హాంసనారి.—విచారసాగరంబునా-విడించి ముంచినానను॥వి॥
శైలవ-ముని తాపసి-శాంతుని బాయ జేసెనా
సుతుని బాపి-చింతలో-విడించి ముంచినానను॥వి॥౧॥
బాలువియోగ-మేగతి-జాలుదు బాయ నీధరా
జాలవార్థి క్రోయుచు-విడించి ముంచినా నను॥వి॥౨॥

35. మాండ్ రాగము - చాప్ తాళము.

హాంసనారి —అయ్యో తంద్రి-పోయితె॥అ-అ॥
నీముద్దుమోము-నేనెటుగాంతుచు॥పల్లవి॥
నేనెటు నిల్తును-భూమిపై
రావయ్య లోహిత-రహీనాడుచూ
రాజీవలోచనా-రా-రా॥౧॥

36. పూర్వీకల్యాణి - ఆదితాళం.

హాంసనారి.—శ్రీశివా-చిరుతను-చిచ్చును జేర్తు॥శ్రీ॥
చిన్నిబాలుని దయలేక-చిచ్చున కలిపివైచి చనద॥శ్రీ॥
దయవదలి ముద్దుశిశువును నాలోహితు
వలాగు-కీలిని-కాలాగ-నిడెదాను॥శ్రీ॥౧॥

37. పీలురాగం - రూపకతాళం.

హంసనారి.—నామనోహరా-మీపాద-ములనేద పదిలముగను॥నా॥
సంసారమునజిక్కి-గుందితి-ప్రాణనాథ॥నా॥౧॥
జన్మజన్మమునకు మీకు-జాయగా నగుదీవెనాల
నీడువు-మనోనాథ-మీపాదము లె-శరణనియెద॥నా॥౨॥

38. కాఫీ రాగము - ఆదితాళము.

హంసనారి.—మనోజ-మదహరణా-మానితలోచనా
ఆతాత వినోదనా ॥మనోజ॥౧॥

మం గ ళ ము.



Printed at the T. V. C. Press,—Madras.

ఏతద్గ్రంథకర్తచే రచియింపఁబడిన, వుపన్యాసములు, నాటకములు.

1 భారత భగవద్గీతలను గుఱించిన విమర్శనం.
2 వ్యవహార కర్మజ్ఞానము.
3 అర్జునవిషాదయోగము.
4 సాంఖ్యయోగము.
5 కర్మయోగము.
6 జ్ఞానయోగము.
7 కర్మసన్యాస మంత్రతలయ హఠ రాజ యోగములు.
8 ధ్యానయోగము.
9 విజ్ఞానతారక బ్రహ్మయోగము.
10 రాజవిద్యా రాజగుహ్య విభూతి యోగములు.
11 విశ్వరూప సందర్శన భక్తియోగములు.

## 2. ఉపన్యాసముల పేర్లు.

1 ఆర్యుల నాగరికతవారి ప్రపంచ వ్యాపకత.
2 ఆర్యులచరిత్ర, ఋగ్వేదభాష &c.
3 ఋగ్వేద విభజన వేదకాల విభజన &c.
4 ఆర్యులు పంచాబు చేరిన విధము వారి శాసనము.
5 మద్యపానము జూదము స్త్రీల గుణములు &c.
6 వివాహ కట్టడములు.
7 జాతి చట్టములు.
8 సృష్టిని గుఱించిన తాత్పర్యము.
9 వేదమతము నాస్తికమతము ఆర్యులదైవములు.
10 నరమేధ అశ్వమేధాది యజ్ఞములు.
11 అదితి ద్వాదశాదిత్యులు &c.
12 యమ యమి మృత్యువు పితృదేవతలు కర్మ &c.
13 సోమపానము అశ్వినులు రుద్రుఁడు పర్జన్యుఁడు &c.
14 ఋషులు సప్తర్షులు దధీచి, చవనుఁడు &c.

15 ఋగ్వేదములోని ముఖ్య ప్రార్థనలు.
16 మతవిధు లేరీతిగఁ బ్రబలినది.
17 నాటకముల గురించి ప్రపంచములో నాటకపాత్ర లెట్లు త్రిగాం చినదిన్ని, వారి యభినయాది లక్షణములను గురించిన్ని వ్రాయఁ బడిన యూఱుపన్యాసములుగల గ్రంథము.

వరా.—పై యుపన్యాసంబులలో నింకను ననేకవిషయములున్నవి. జాబితాలో వివరములన్నియును వ్రాయ సాధ్యము కాదు. ప్రతియొక శాస్త్రమునందు నార్యులు ప్రావీణ్యమంది యుండి రనుటకుఁ బ్రమాణములు చూపఁబడినవి.

3. చరిత్ర నాటకములు.

1 రామరాజ చరిత్రము లేక (కర్ణాటక రాజ్య నాశనము.)
2 సుల్తానా చాందుబీ.
3 చంద్రగిర్యభ్యుదయము.
4 మైసూరు రాజ్యము.
5 శిలాదిత్య.
6 సుఖమంజరీ పరిణయము.
7 ప్రతాపాభ్యుదయము.

4. పౌరాణికములు.

రామాయణ నాటకములు.

౧. 1 శ్రీరామజననము.
2 సీతాకల్యాణము.
3 పాదుకా పట్టాభిషేకము.
4 లంకాదహనము.
5 కుశలవ నాటకము.

## నాయికా పాత్ర పోషణ చమత్కృతములు.

3. 1 గిరిజా కల్యాణము. | 3 మదాలస.
2 సీమంతిని.

## దైవఘటన వైచిత్రి మంతములు.

4. 1 సత్య హరిశ్చంద్రీయము. | 3 చంద్రహాస.
2 భోజ ప్రబంధము లేక కాళి దాసనాటకము.

## 5. స్వకపోల కల్పితము.

1 సునందనీ పరిణయము (అద్భుత నీతి పూరితము.) | 2 యువతీవివాహము.

## 6. ఆంధ్రీకరణములు.

1 మానాపమానము. | 2 రాక్షసీ మహాత్మ్యాంక.

## 7. ప్రహసనములు.

1 ఆచారమ్మకథ (కన్నడభాషలో.) | 3 సమయమునకు భార్య.
2 అన్యాయధన్యపురి మహిమ. | 4 నాదిపార్టి.

1 ఆంధ్రకృతాగస్త్య భారతము (పద్యకావ్యము) సభాపర్వము వరకు.

1 Dramatic History of the world (in English.)